భాగవతకథా గ్రంథమాల



# గోపికా గీతలు



గ్రంథకర్త:

శ్రీ గంగా ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు:

శ్రీ రామ్‌శరణ్ కుందుర్తి వేంకట నరసయ్య

ప్రకాశకులు:

భాగవతకథా గ్రంథమాల,

బుద్దాం P. O. (గుంటూరు జిల్లా)

బ్రాంచీలు: బందరు, తణుకు, లక్కవరం.

 1989 [వెల: 10-00

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:

నటరాజ పబ్లికేషన్సు

ఏలూరు రోడ్ * విజయవాడ-2

# భాగవతకథ

## గోపికాగీతలు

గాలా

శ్లో॥ జయతి తేఽధికం జన్మనా వ్రజః
శ్రయత ఇందిరా శశ్వదత్ర హి।
దయిత దృశ్యతాం దిక్షు తావకా
స్త్వయి ధృతాసవస్త్వాం విచిన్వతే॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౧ అ. ౧ శ్లో॥

క॥ నీవు జనించిన కతమున
నో వల్లభ లక్ష్మి మంద నొప్పె నధికమై
నీ వెంటనె ప్రాణములిడి
నీ వా రరసెదరు చూపు నీ రూపంబున్॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

పుట్టంగానే బిడ్డ పాటతో నేడ్చును. దేనిని వినిన సహృదయుల హృదయ మానందించునో దానిని గాన మందురు. దేనిని వినిన మృదు హృదయములు కదలిపోవునో దానిని రోదనమందురు. కాని బిడ్డయొక్క రోదనమున హృదయము కదలదు. దానిచే సుఖమును గలుగదు. సుఖద రసము పుట్టదు. ఘృణాభావము జాగృతి చెందును. బాలకుని రోదనముచే నింటిలోని వారందఱకును మోదము కలుగును. సర్వత్ర ఆనందము ప్రస్ఫుటిత మగును. దీనినిం బట్టి బాల్యారోదనము సుస్వరమైన దనియు, సంగీతశాస్త్రమున కనుకూల మైనదనియు నూహింపవచ్చును. దీనిచే జన్మింపంగనే మానవుండు పాడును, ఏడ్చునని తేలుచున్నది. అందువలననే 'పాటరాని వాండు, ఏడ్చుట చేతగానివాం డెవం'డను సామెత కలదు.

మహామూర్ఖుండు, జడుండు, త్రిగుణాతీతుండు వీరి విషయమును వదలివేయుండు. వారు మానవులలో లెక్కింపబడరు. మోక్షము కొఱకు సాధనం జేయువాండు కావున శాస్త్రములలో మనష్యునకు సాధకుండను పేరు వచ్చినది. సాధకులందఱును బాడుటయును, నేడ్చుటయు నెఱుంగుదురు. ఎవం డేడ్చుచు హృదయముతో నాతని నామమును, ఆతని గుణములను గాన మొనర్చునో, ఆతనికి భగవంతుండు

దూరముగ నుండఁడు. ఆతఁ డశ్రువులచే నార్ద్రమైన కరుణా పూర్ణమగు గాన తంతువుచే బంధితుఁడై, వివశుఁడై సాధకుని కడకు వచ్చును. వానిని బాహుపాశమున బంధించును. అందువలన భక్తుఁడు రెండే పనులు చేయును, ఆతని నామ గుణములను నిరంతరము గాన మొనర్చు చుండుటయు, నేడ్చుటయును, గాన మొనర్చుటచే వాణి పవిత్రమగును. పవిత్ర వాణియందే ప్రభువు నివసించును.

జీవుఁడల్పజ్ఞుఁడు, ప్రభువు సర్వజ్ఞుఁడు, ప్రభు వేది చేయించునో, జీవుఁడది చేయును. జీవుని భగవానుఁడపూర్వముగ నొనర్చినాఁడు. అందువలన నాతఁ డపూర్ణ బ్రహ్మనే యూహించును. ఆతని కృపచే నాతఁడు పూర్ణబ్రహ్మను గుర్తించెనా ఆతని అపూర్ణత నశించును. ఆతఁడును బూర్ణుఁడగును. ఆతని జీవభావము నశించును. అల్పజ్ఞుఁడగు జీవి నిరంతరము సర్వజ్ఞుఁడగుటకు బ్రయత్నించుచుండును. ఏల ననఁగా నాతఁడు సర్వజ్ఞుని అంశ. ఆతని కపూర్ణత లేకుండిన నాతనికి సాధన యెందులకు? ఆతఁడు ప్రయత్నమేల జేయును. నదులపూర్ణములగుట చేతనే సముద్రము వైపు నకుఁ బరువిడుచుండును. ఆ మహాజలరాశినిఁ బొంది, దానినిఁ గాఁగలించుకొని, దానిలోఁగలిసి శాంతించును. చంచలతా విహీనమగును. క్రియ యెచ్చట నున్నదో అచ్చట అంశ

మంశినిఁ బొందుటకుఁ బ్రయత్న మొనర్చుచున్నాఁడని తెలిసి కొనవలయును. తన ప్రియుని వైపునకుఁ బరువిడుచున్నాఁడు. వ్యగ్రత లేక శీఘ్ర ప్రాప్తి లేదు. శబ్దము లేక ఆకర్షణము లేదు. అందువలన శ్యాముఁడు పాడి నిజజనులను దనవైపునకుఁ బిలుచును. సమీపమునకు రాఁగానే హృదయమందు వ్యాకులత నుత్పన్నము కావించి-ప్రేమను బ్రదర్శించి - అంతర్హితుఁడయ్యెను. అంత నాతని గుణములను బాడుచుండుము. ఆతని నామమును బలుకుచుఁ గేకలు వేయుచుండవలెను. ఇదియే సాధనము. తనకడకు బిలిచినపుడాతఁడు చెప్పిన దిదియే. ఏడ్చుచుఁ బాడుకొనుము. ఏడ్చుచుఁ బాడుకొనుము. తప్పక పాడుకొనుము. శుష్క-హృదయముతోఁ బాడకుము. నయనాశ్రువులతో హృదయము నార్ద్రము కావించి పాడుకొనుము. రమించువాఁడును రమింపఁజేయు వాఁడునగు రాముఁడు లభించును. దుఃఖదురితము లన్నియును దూరములగును. అందువలననే భక్తిమార్గమునఁ బాడుటయును, నేడ్చుటయును ఈ రెండును బ్రధానములు. అందువలనఁ గొందఱు జ్ఞానాభిమానులగు మహానుభావులు భక్తిమార్గము స్త్రీలమార్గమని చెప్పుచుందురు. వాస్తవమున నిది సత్యమే. పురుషత్వాభిమానముండిన వాఁడెన్నటికిని భక్తిమార్గమున ముందునకుఁ బోఁజాలఁడు. పురుషుఁ

డొక్కఁడే ఆతఁడే నందనందనుఁడు. ఇఁక మిగిలిన వారంద ఱును స్త్రీలో నపుంసకులో నైయుందురు. మనమందఱమును మనస్సునకధీనులమై వ్యాపారము లొనరించెదము. సంస్కృత సాహిత్యమున మనస్సును నపుంసక లింగముగఁ జెప్పినారు. బ్రహ్మనుగూడ నపుంసక లింగముగఁ జెప్పిరి. అవతారము లలో నన్నిటికంటెఁ బ్రథమావతారమును, పురుష సూక్త ముచే స్తుతింపఁబడిన పురుషునిఁ బొందుటయే జీవున కేక మాత్ర ధ్యేయము. బాలకుఁడై ఆయనను బొందవచ్చునని కొందఱు చెప్పెదరు. తానాతనికిఁ బత్నియను భావమున ననఁగాఁ బతిభావమున భజింపవచ్చునని కొందఱు చెప్పు దురు. వీనిలో నేమార్గము మంచిదియా యీ వాదవివాద మున మేము పడఁదలఁచలేదు. ఈ రెంటిలో నేది రుచి కరమో వారు చూచుకొనవలయును. మీరు పురుషులు కండు, స్త్రీలు కండు ఇద్దఱు స్వరము మధురముగ నొనర్ప వలయును. మధుర స్వరమున నేమ్పును లేదా గాన మొన రింపుము. గానమో, ధ్యానమో ఏదో ఒకటి చేయుము. వాక్కులో మాధుర్యము రానంతవఱకు ప్రియుఁడానం దింపఁడు. వాక్కు ఆకర్షకముగ బాలుల వాక్కువలెనో, స్త్రీ వాక్కువలెనో ఉండవలయును. పిల్లల కంఠము బొంగు రుగఁ బడనంతవఱకు చాల కమ్మగనుండును. కోమలముగ నుండును. పిల్లవానినుండి పెద్దవాడు కాఁగానే, పెద్దతనము

వాని శిరస్సున కెక్కెనా అప్పుడు వాని వాక్కు పెద్దదగును. దానిలో నాకర్షణముండదు. స్త్రీకంఠ మెన్నటికిని బొంగురు పడదు. అందువలన వారి కంఠములు సదా మధురముగను, నాకర్షముగను నుండును. అందువలన గానమును స్త్రీలే చేయఁ గలరు. పురుషులు చేయు చేష్టలలో నాకర్షక మెక్కడిది ?

జ్ఞానమార్గమునందు ధ్యానమును దృప్తియు నివి రెండును ప్రధాన సాధనములు. నిరంతరము ధ్యేయధ్యాన మందు ధ్యాతలగ్నమై యుండవలెను. త్రిపుటీత్రయము నొక్కటిగఁ జేసి సదా ఆత్మతృప్తినిఁ జెందియుండవలెను. ఇదేవిధముగ భక్తిమార్గమందు గానము, అతృప్తి యీ రెండును ప్రధాన సాధనములు. నిరంతరము తన యిష్ట దైవము యొక్క నామగుణములను గాన మొనర్చుచు, సదా ప్రేమకోఱకు కొట్టుకొనుచు నతృప్తినిఁ జెందియుండ వలెను.

భక్తి శాస్త్రమున ననేక భేదములు చెప్పఁబడినవి. ఇది గొప్ప అపారసముద్రము నంటిది. దీనిలోని తరంగము లెన్ని యీ అన్ని తరంగములను సందర్శించుకొని వానినిఁ దమ సముద్రమే నని భావించుచుండిరి. కాని యీ జలరాశి లోతు తెలియదు. లెక్క లేదు. ఇంతని లేదు. సామాన్య ముగ భక్తికి మూఁడు భేదములు చెప్పఁబడినవి. సాధన

భక్తి, భావభక్తి, ప్రేమభక్తి. సాధనభక్తి రెండు విధములు. వైధీభక్తి, రెండవది రాగానుగభక్తి. వైధీభక్తి యనఁగా శాస్త్రములలో నాదేశించిన విధముగ, ఆ వచనములందు విశ్వాసముంచి, విధివిధాన పూర్వకముగ భక్తి పూర్వకముగ భక్తిచేయుట. భగవంతునితో నేదియో సంబంధమున రాగము కలుగుటకు రాగాత్మిక భక్తి యందురు. ఆ రాగము రెండువిధములుగ నుండును. ఒకటి కుబ్జకు గలిగినట్లు కామభావము చేతను, రెండవది సంబంధము చేతను, దేవకీ, వసుదేవ, నంద, యశోదా, కుంతి మొదలగు వారు కృష్ణునికు సంబంధించుటవలన వారికి రాగాత్మికాభక్తి కలిగినది. దీనినిబట్టి రాగాత్మికభక్తి కామరూప, సంబంధరూపముగ నుండును. ఇది సామాన్యముగ సాధన భక్తి పరిచయము.

రెండవది భావభక్తి. హృదయమున సాధనసంబంధమున స్వాభావికముగ నేదో భావముత్పన్నమై మనస్సచ్చుట లగ్నమైనఁ జిత్తమందా భావమే నిలచును. ఇదియే భావభక్తి. మనస్సా భావమునే భావించును. ఈ భావము సాధన చేయుచుండఁగా నుదయించును. భగవంతుని యొక్కయు, భగవద్భక్తుల యొక్కయు కృపచేతను గలుగును. హఠాత్తుగ నొకానొక ప్రభావశాలియగు మహాత్ముని దర్శనము

వలనను గలుగును. ఆతని వాక్యముల వలనను గలుగును. అట్టివారిట్టి భావము కలుగవలయునను హృదయ పూర్వక ముగఁ గాంక్షించినను లభించును. గోపికలలోఁ జాలమంది సాధనచేసి సంపాదించిరి. కొందఱు పరికరలు. కొందఱు భగవదాజ్ఞచే గోకులమున జన్మించిరి. ఏ విధముగ నైనఁగానిండు వారి మనస్సులందు కృష్ణుఁడు తమకుఁ బ్రేష్ఠుఁడనియు, బతి యనియు, ఇట్టిభావము సుదృఢమయ్యెను. వారాతనిఁ బ్రాణ పతిగ భావించుచుండిరి మనస్సులో భావాంకుర ముత్పన్న మైనచో సాంసారిక విషయములందు విరక్త్యాదులు స్వతః ఉత్పన్నములగును. వానినిఁగూర్చి దిగ్దర్శనముగ జెప్పఁ బడినది.

మూఁడవది ప్రేమసంగతి లేక ప్రేమభక్తి. దీనిలో నేదోవిధముగ మమత్వము కలుగును. ప్రేమ కలుగును. భగవానుఁడు లేక నిలువఁ జాలనట్లుండును. దానిలో విధి నిషేధములుండవు. శ్రీకృష్ణుఁడు మనవాఁడు, మనము శ్రీకృష్ణుని వారము. శ్రీకృష్ణుఁడు గాక ప్రపంచమున నింకెవఁడును లేఁడు. ఈ భేదములు చెప్పుకొనుటలో మూఁడు కలవుగాని, యేదోవిధముగ భగవంతుని యెడల ననురాగము కలుగుటకు భక్తి అనిపేరు. ఆచార్యులు సామాన్యముగ నీ క్రమమును జెప్పిరి— మొదట అంతః

వలనను గలుగును. ఆతని వాక్యముల వలనను గలుగును. అట్టివారిట్టి భావము కలుగవలయునను హృదయ పూర్వకముగఁ గాంక్షించినను లభించును. గోపికలలోఁ జాలమంది సాధనచేసి సంపాదించిరి. కొందఱు పరికరలు. కొందఱు భగవదాజ్ఞచే గోకులమున జన్మించిరి. ఏ విధముగ నైనఁగానిండు వారి మనస్సులందు కృష్ణుఁడు తమకుఁ బ్రేష్ఠుఁడనియుఁ, బతియనియు, ఇట్టిభావము సుదృఢమయ్యెను. వారాతనిఁ బ్రాణపతిగ భావించుచుండిరి మనస్సులో భావాంతర ముత్పన్నమైనచో సాంసారిక విషయములందు విరక్త్యాదులు స్వతః ఉత్పన్నములగును. వానినిఁగూర్చి దిగ్దర్శనముగ జెప్పఁబడినది.

మూఁడవది ప్రేమసంగతి లేక ప్రేమభక్తి. దీనిలో నేదోవిధముగ మమత్వము కలుగును. ప్రేమ కలుగును. భగవానుఁడు లేక నిలువఁ జాలనట్లుండును. దానిలో విధి నిషేధములుండవు. శ్రీకృష్ణుఁడు మనవాఁడు, మనము శ్రీకృష్ణుని వారము. శ్రీకృష్ణుఁడు గాక ప్రపంచమున నింకెవఁడును లేఁడు. ఈ భేదములు చెప్పుకొనుటలో మూఁడు కలవుగాని, యేదోవిధముగ భగవంతుని యెడల ననురాగము కలుగుటకు భక్తి అనిపేరు. ఆచార్యులు సామాన్యముగ నీ క్రమమును జెప్పిరి— మొదట అంతః

భగవానుని యందు స్థాయీభావము కలుగును. దేనిద్వారా రతిసుఖస్వాదనము కలుగునో దానిని విభావమందురు. దాని కాలంబనమనియు, నుద్దీపనమనియు రెండుభేదములు చెప్పఁబడినవి. దేనిద్వారా సాక్షాత్తుగ రతిసుఖము ప్రాప్తించునో దాని నాలంబనమందురు. శ్రీకృష్ణుఁడెట్లో ఆతని భక్తులు నంతే. శ్రీకృష్ణుఁడే రతిసుఖమునకుఁ బ్రధాన నాయకుఁడు. ఆతఁడే భక్తికి ఏకైకాలంబనము. ఆతఁడు సర్వగుణ సంపన్నుఁడు. ఆతని రూపమాధుర్యము, వేణు మాధుర్యము, లీలా మాధుర్యము లనుపమానములు. ప్రపంచమున వీనికి సమానమైనవి లేవు. అవి హృదయమును హఠాత్తుగఁ దమవైపున కాకర్షించును. రెండవ విభావము ఉద్దీపనము. దేనినిఁ గాంచినఁ బ్రియతముఁడు జ్ఞాపకమునకు వచ్చునో దానినుద్దీపనమందురు. భగవానుని కాయక, వాచిక, మానసిక గుణములట్లు. గుణములనఁగాఁ గిశోరావస్థ, అనుపమ సౌందర్యము, అత్యంత సుకోమల సుందర స్వరూపము, మోహనత్వము, ఆతని మనోహర రాసాది చేష్టలు, దుష్టులను వధించుట, ఆతని వస్త్రాభూషణాదులు, వేణు శృంగములు, బృందావనము, తులసి ఇంకను వేనినిఁ గాంచిన భావోద్దీపనము కలుగునో వాని నన్నిటిని ఉద్దీపన విభావములందురు. ఇవి సామాన్యపు విభావ విషయములు.

చిత్తములోని భావములు బయటకుఁ గ్రియలలోఁ బ్రకటమగుదానికి అనుభావ మందురు. ఎట్లనఁగాఁ బ్రేమలో నాట్యమొనర్చుటయును, ఏది ... వాగుటయును, నవ్వుచునో, యేడ్చుచునో క్రిందఁబడి దొరలుటయును, గీతములను బాడుటయును, గేకలు వేయుటయును, ఒడలును విఱచుకొనుటయును, హుంకరించుటయును, విభావము హృదయమున కనుభవ వస్తువు, ఏ భావములు శరీరము మీఁదఁ బ్రకటమై, ఆ భావములందు భావితులై చేష్ట లొనర్చుట కనుభావము లందురు. ఇంతవఱకును గోపికలు శ్రీ కృష్ణభావమునందు మునిఁగి యుండిరి. ఆతని విషయముల నొక్కొక్కదానినిఁ దలఁచుకొని దుఃఖితులై యుండిరి. ఇప్పుడు వచ్చి వారు తమభావములను గీతములుగనొనర్చి గానము చేయుచుండిరి. ఇది వారి అనుభావస్థితి. మూఁడవది సాత్త్వికభావము. దీనిలోఁ బ్రియుని స్మృతియందు స్తంభ, స్వేద, రోమాంచ, స్వరభేద, వేపథు, వైవర్ణ్య, అశ్రు, ప్రళయాద్యనేక చేష్టలు సంభవించును. రసశాస్త్రములందు వీని అన్నిటికిని విస్తారవర్ణనము కలదు.

నాల్గవది వ్యభిచారీభావము. ప్రియుని స్మృతియందే భావములు వ్యభిచారములగునో, శరీరమందును, మనస్సునందును నే వికారములు కలుగ వలయునో వానిని వ్యభి

చార భావములందురు. దీనికిని నిర్వేదము, విషాదము, దైన్యము, గ్లాని, శ్రమ, మదము, గర్వము శంక మొదలగు భేదము లనేకములు కలవు.

ఏ భావముదయింపఁ గనే అది తొలఁగక స్థాయిగా నుండునో దానిని స్థాయీభావమందురు. అది శ్రీకృష్ణ విషయక రతివలె. ఏ దశయైనను గానిండు శ్రీకృష్ణప్రేమ సదా అక్షయ్యముండును. ఈ రతినిఁగూర్చి శాస్త్రకారు లనేక భేదములను జెప్పిరి. ఆ గహనవనమందుఁ బ్రవేశించు నభిప్రాయము మాకు లేదు. శ్రీకృష్ణ ప్రేమోన్మత్తలైన నా గోపికలు తమ మనోగత భావములను నను భావరూపమున-గీతముల ద్వారా- ప్రకటింపసాగిరను నదియే మేము చెప్పఁ దలఁచితిమి. మునుముందుగా వారికి బృందావన మందలి ఆ రాసస్థలినిఁ గాంచఁగనే ఉద్దీపనము కలిగెను. అందువలన ముందుగా వారు బృందావన ధామములను బ్రశంసించుచు గోపికలు గాన మొనర్చ నారంభించిరి.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలుయమునా పులినమునకు వచ్చి ప్రియుని గుణములను గానము చేయ సాగిరి. వానిలో శ్యామసుందరుని శూన్యమందుసంబోధించు చుండిరి- "ప్రియుఁడా! వ్రజవల్లభా! నీ కీ వ్రజభూమి అత్యంత ప్రియమైనది. ఏమైనఁ గానిండు వ్రజమునఁ గాక గోవర్ధన

పర్వాత మెచ్చటచున్నది? నీవు రమణులతోఁగూడి రాసను రచించిన రాసస్థలి బృందావనమునఁ గాక త్రిభువనములం దెచ్చట లభింపఁగలదు. ఈ బృందావన భూమి భూమికి భూషణము. జగత్తునకు మనోజ్ఞమకుటము. బృందావన ధామ మాహాత్మ్యమును దెలిసికొనియే లక్ష్మీదేవి కమల వనమును బరిత్యజించి నిరంతరమిచ్చట నివాస మొనర్చు చుండును. స్వభావమునఁ జంచలయయ్యునిచ్చటనచంచలయై నీ ముఖమును జూచుచు నుండును. నీవు బహువల్లభుఁడవు కదా! నీ వామె వైపునకుఁ జూడనైనఁ జూడవు. అయినను నామె నీ వెను వెనుకనే ద్వారమునకుఁ గట్టిన తోరణము వలె నెగురుచుండును. క్షీరసాగరమునందు నీవు శేషశయ్యా యందు సుఖముగ శయనించినపుడు సాపత్న్యభావరహితయై యీయామె నీ పాదములను సేవించుచుండును. కాని యీ వ్రజ మందీమెకు నీ పాదస్పర్శ చేయుటకైనను నవకాశము లభింపఁ బోదుఁ ఆమె నిన్ననుక్షణ మనుగమించుచుండును. ఏల ననఁగా నీ చరణస్పర్శ సౌభాగ్యము లేకున్నను, నీ చరణ చిహ్న చిహ్నితమైన బృందావన పావనరజము తన శరీరఁ ముపైఁ బడుఁగాక యని ఆమె నిన్ననుగమించుచుండును. అందువలన నామె చంచలయయ్యును నెన్నడును వ్రజమును బరిత్యజింపదు. లక్ష్మికి దాను శ్యామసుందరునకు బత్నినను గర్వము కలదు. నీవు మనహారివి కావున నీ వామెను బలుక

రింపనైనఁ బలుకరింపవు. నిన్నుఁ బ్రసన్నునిఁ జేసికొనుట
కును, నీకృపను బొందుటకును నామె నిరంతరము వ్రజ
ములో నుండుటకు సంకల్పించి యుండును. క్షేత్రసన్న్యాస
మును గైకొనియుండును. అందుకనియే నిన్నువదలి వ్రజ
మున కావలఁ గాలుపెట్టదు. మేమును బొరఁబడితిమి.
మేమును సర్వస్వతంత్రుఁడు నీశ్వరుడవగు నిన్ను మా కధీ
నుఁడవని యెంచితిమి. మాకు నీ ప్రాణప్రియులమను గర్వము
వచ్చినది. అందువలన నీవు దాగితివి. మా గర్వమణఁగినది
ప్రభూ! నీవు స్వామివి, స్వతంత్రుడవు, ఈశ్వరుఁడవు, మేము
నీకు దాసీలము, చరణసేవికలము. కింకరీలము, అధీనలము
అంతఃపుర దాసీలకు సర్వత్ర అవ్యాహతగతియుండును.
స్వామి వారికడ సంకోచింపఁడు. ఆతనికి దాపరికము లేదు.
నిస్సంకోచముగ వారికి దర్శన మొసంగును. యథేచ్ఛముగ
నాజ్ఞల నొసంగును. దాసీలమైనను మేము సామాన్య దాసీ
లము కాము. ఉచ్ఛిష్టభోజినులగు దాసీలము. నీ వనుభ
వించిన వస్తువే మా కాహారము. దానినిఁ దినియే మేము
జీవించెదము. నీవు త్రాగిన పాలను ద్రావి మాదాహమును
దీర్చుకొందుము. మే మాఁకలి తోడను, దప్పికతోడను
దిరుగుచున్నాము. నీ రూపావనమును ద్రావనిచ్చియు, నీ
యధరామృతమును రుచి చూపించియు మృతులమైన మమ్ము
లను బ్రదికింపుము. నీ కింకరీలను జావునుండి రక్షింపుము.

వ్యాధునివలె వేణువునూది హరిణముల నలరింపఁ జేసివిషా_క్త బాణములచేఁ గొట్టినట్లు కొట్టితివి. ఇప్పుడు మేము సగము చచ్చితిమి. మేము బాగుగాఁ జావనైనఁ జావలేదు, బ్రదుకను లేదు. మేము వ్యాకులలమై దశదిశలను దిరుగుచున్నాము. ఈ బాణమును శరీరమునుండి దీసివేయుమని ప్రార్థించుచున్నాము. నీ దర్శన రూపమగు నమృతమును మాపైఁ గ్రుమ్మరించి మమ్ములను రోగరహితలుగ నొనర్చి మమ్ములను స్వీకరించుము. శ్యామసుందరా! మమ్ములను దాసీలనుగా నొప్పుకొనకుండిన మాకును నీకును నొక సంబంధము కలదు.

ఒక సఖి యిట్లనెను :- "మీకు శ్యామసుందరునకు సంబాధమేమి ?"

ఆమె యిట్లనెను :- "శ్యామసుందరునకు వ్రజభూమి అత్యంత ప్రియమైనది. అట్టి వ్రజమందు వసించు వ్రజాంగనలము మేము. ప్రియుని సంబంధముచే సమ_స్త వస్తువులును ప్రియములగును. ఆతని వస్త్రగంధములును సుఖకరములుగనే యుండును. వ్రజభూమి సంబంధముచేతనే మాకు దర్శనమొసంగుము. నిర్దయుఁడవై మమ్ములను వధింపకుము.

అంత నొక గోపిక యిట్లనెను :- "శ్యామసుందరుఁడిచ్చుటలేదు. ఆతఁడే యస్త్రమును బ్రయోగింపలేదు? శరీర

మున గాయమును గనఁబడదు. అయినను మాటి మాటికిని వధయని ప్రయోగ మొనర్చు చున్నావేల ?"

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఆ సఖి వాక్యములను విని ఆ చెప్పుచున్న గోపిక మూర్ఛితయై అచేతనురాలైరి. ఆమెకు శరీరస్పృహ లేదు. ఆమె ప్రక్కనే కూర్చుండిన రెండవసఖి యీ మాటలను వినెను. ఆమె కొంచెము సేపు సఖియొక్క ప్రశ్నకు సచేతయై ప్రత్యుత్తర మొసఁగుటకు సిద్ధమయ్యెను.

# శ్రీ కృష్ణ కటాక్ష బాణము

(గాగి)

శ్లో॥ శరదుదాశయే సాధు జాతసత్
సరసిజోదర శ్రీముషా దృశా।
సురతనాథ తేఽశుల్కదాసికా
వరద నిఘ్నతో నేహ కిం వధః॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౩౧ అ ౨ శ్లో॥

క॥ శారద కమలోదర రుచి
చోరకమగు చూపువలన సుందర మమ్ముం
గోరి వెల యీనిదాసుల
ధీరత నొప్పించు టిది వధించుటగాదే॥
శ్రీ మదాంధ్ర భాగవతము.

వధ రెండు విధములుగ నుండును. ఒకటి విషము చేతను, జలముచేతను, అగ్నిచేతను, శస్త్రాదులచేతను రెండవది చేష్టాదులచే జరుగును. కొన్ని ఔషధములలోని విషముచేఁ జావబోవువాఁడు బ్రదుకఁ గలఁడు. కశ్యపుఁడను ముని తక్షక విషజ్వాలలచే భస్మమైన వటవృక్షమును మఱలఁ బచ్చగనొనర్చి బ్రదికించినాఁడు. శస్త్రముచే మానవుఁడు చచ్చుననునది లేదు. శస్త్రము గ్రుచ్చుకొన్నను మానవుఁడు చావఁడు. కేవలము గాయమగును. కొలఁది కాలములో గాయము మానును. కాని ప్రియుని కటాక్ష బాణము హృదయమున గ్రుచ్చుకొనెనా ఆ గాయము అసాధ్యమగును. ఆ బాణము ప్రాణములతోడనే పోవును. ఆ పీడ నిరంతరముండి తీరును. దీనినే అశస్త్రవధ యందురు. నీతికారులు మూఁడు విషయములను నశస్త్రవధగాఁ జెప్పిరి. రాజాజ్ఞోల్లంఘనమును, గురుజనులును 'నీవు' 'నీ'వని అవమానించుటయును, భార్యను శయ్యమీఁదకు రానీయకుండుటయు నీ మూఁడును నశస్త్రవధలు. కాని మా దృష్టిలో నివియును నశస్త్రవధలు కావు. వీనికినిఁ చికిత్సలు కలవు.

మహాభారత యుద్ధమందు కర్ణుని బాణములచే వ్యధితుఁడై ధర్మరాజు అర్జునుని గాండీవమును దూషించెను. తన గాండీవము నెవరు దూషించెదరో వారిని వధింతునని

అర్జునుని ప్రతిజ్ఞ. ప్రతిజ్ఞానుసారముగ నాతఁడు తనయన్నను జంప బయలుదేరెను. వాసుదేవుఁ డాతని నివారించెను. ఆతఁడు తన ప్రతిజ్ఞావిషయమును జెప్పెను భగవానుఁ డిట్లనెను:- "పెద్దలను నీవు నీవనుటయు, నాతని కవమాన మొనర్చుటయు నాతని వధించుటే యగును. నీవు ధర్మరాజు నవమానింపుము." అర్జునుఁడట్లే యొనర్చెను. తర్వాత నాతనికిఁ దాను జేసిన పనికిఁ బశ్చాత్తాపము కలిగెను. తా నాత్మహత్య నొనర్చుకొని మరణించుట కుద్యుక్తుఁడయ్యెను. అప్పుడు భగవానుఁడు దీనికినిఁ బ్రాయశ్చిత్తము జెప్పెను:- "నీవు నిన్ను బొగడుకొనుము. ఇది నీకు మృత్యుతుల్యమే." అర్జునుఁడిదే చేసెను. ఇద్దఱ మనోమాలిన్యమును దొలఁగి పోయెను. అశస్త్ర వధకును బ్రతీకారము జరిగెను.

రాజుయొక్క ప్రజలు రాజోల్లంఘన మొనర్చిరి. రాజు వారినిఁ బిలిచి వారి కష్టములను దూరముకావించెను. కొలది దినములలో మనోమాలిన్యము దూరమయ్యెను. రాజునకును బ్రజలకును మరలఁ బ్రేమభావము కలిగెను. కావున రాజాజ్ఞో ల్లంఘనమునకును జికిత్స కలదు.

గౌతమమహర్షి తన పత్నియొక్క మానసిక వ్యభిచార మును గాంచి ఆమెను శయ్యనుండి బహిష్కరించుటయే కాదు. పాషాణమువలె నొనర్చెను, వేలు లక్షలకొలఁది

సంవత్సరములవఱకు శిలలవలెఁబతికి దూరమై పడియుండెను. కాని కౌసల్యానంద వర్ధనుఁడును, జానకీ జీవనుఁడును, అయోధ్యాకుల మండనుఁడునగు రామచంద్రుని చరణ ధూళిని స్పర్శించుటచే నామెను బావనమొనర్చెను. గౌతమ మహర్షి ఆమెను నిష్పాపయని భావించి సహర్షముగ శయ్యా కధికారిణిగ నొనర్చెను. ఆమెను బత్నీరూపమున స్వీకరించెను. కావున శయ్యకు దూరమై, చచ్చినవానివలె నున్న పత్నిని మరల బ్రదికింపవచ్చును. కాని నల్లని కృష్ణుని గటాక్ష బాణములచే గాయపడిన దానికి చికిత్స నేఁటివఱకును లేదు. ఇఁక నుండబోదు. వారు జీవితాంతము వఱకును గొట్టుకొనవలసినదే.

శ్రీకృష్ణుఁడు మధురాతి మధురమైనవాఁడు. ఆతని ఐశ్వర్యమాధురియును, లీలామాధురియును, రూపమాధురియును, వేణుమాధురియును ననుపమేయములు. వీనికి సమానములు లేవు. పోలిక లేదు. ఆతని చేష్టలన్నియు మధురములును, ఆకర్షకములును, ఆతని అంగప్రత్యంగములు సురమ్యములు. అత్యంత మనమోహక రుచిరములు, ఆకర్షకములు. తేజ, బల, దయాఐశ్వర్య, యశ, శ్రీ, జ్ఞాన, వైరాగ్యములచేఁ బరిపూర్ణములు. ఆతని వాక్కులు మధురాతిమధురములు. ఆతఁడు దక్షుఁడు, కృతజ్ఞుఁడు. సుధృఢవ్రతుఁడు. చతు

రుఁడు. విదగ్ధుఁడు. శుచి, వశీ, శాంతుఁడు, దాంతుఁడు. క్షమాశీలుఁడు, గంభీరుఁడు, ధృతిమంతుఁడు. సముఁడు, వదాన్యుఁడు, శూరుఁడు, కరుణాళువు, సాధుసమాశ్రయుఁడు, నారీగణ మనోహరుఁడు, సారాంశ మేమనఁగా నాతఁడు సర్వగుణ సంపన్నుఁడు. ఆతనిశోభ కోటి కందర్పదర్ప భంజకమైనది; ఆతని నామమెంతటి యాకర్షకమనఁగా నే సహృదయుని కర్ణకుహరములలో నది పడినను నాతఁడున్మత్తుఁడు కాఁగలడు. ఆతని వేణునాద మతి మోహకమైనది. దాని స్వర లహరి యెవరి కర్ణములలోఁ బడునో వారి యిల్లు, వాఁకిలి, కుటుంబము, పరివారము శూన్యమైపోవును. ఎవఁడాతని త్రిభువన మోహనరూపమును గాంచునో, వాని విషయమును గూర్చి చెప్పవలసినపని లేదు. ఆతఁడు నిష్కాముఁడగును. ఆతని రోగమునకుఁ జికిత్స యేమియును లేదు. ఉపాయమును లేదు. అసాధ్య వ్యాధి.

శ్రీకృష్ణ కటాక్ష బాణములు స్వభావమున వక్రమైనవి. వంకర బాణము గ్రుచ్చుకొనునుగాని బయటకురాదు. విషాక్త మగుటచే నవి ప్రాణములను దీసికొనికాని పోవు. లౌకిక బాణము లొక్కొక్కప్పుడు గురితప్పుచుండును. కాని శ్రీకృష్ణ కటాక్షబాణము అమోఘము. అది యే యుద్దేశ్యముతో వేయఁబడినదో అది వేధించి ఆ యుద్దేశ్యమును నెఱ

వేస్పుకొనును. వ్యర్థమెన్నటికినిగాదు. శ్రీకృష్ణ ముఖమును గొందఱు చంద్రున కుపమించుచుందురు. కొందఱు కమల సదృశమందురు. లౌకికదృష్టి కలవారింక నేమి యుపమానము లను దేఁగలరు? కాని ఆ ముఖ మనుపమేయము. అతి సుందరాతి సుందరమని మాత్రము చెప్పఁగలము. మనోజ్ఞ మైనది, ఆకర్షకమైనది. శ్రీకృష్ణుని అనుపమాన మెన్నటి కిని మ్లానముకాదు. అది యెల్లప్పుడును మందహాసముచే నావృతమై యుండును. ఒకవేళ ప్రియా విరహమున మ్లాన మైనట్లు కనఁబడినను నది యింకను నాకర్షకమగును. అది స్మితముగను, హసితముగను, విహసితముగను, అవహసితము గను, అపహసితముగను, అతిహసితముగ నుండును. స్మిత మనఁగా నవ్వు. నవ్వులో నేత్రములు వికసితములగును. వానిలో ననురాగము వ్యాపించును. కపోలములు కొంచెము లేచును. దంతములు కనఁబడవు. ఈ నవ్వులో గొప్ప గొప్ప ధైర్యవంతుల ధైర్యమును సడలింపఁ జేయు మాయకలదు. నవ్వు సరిగా హృదయమును వేధించును. హసితమనఁగా నేత్రకపోలములు వికసించుటతోఁ బాటుగా దంతముల అగ్రభాగములు కొంచెముగఁ గనఁబడును. విహసితమున నేత్రములలో ననురాగముదయించి, కపోలములు వెనుకను బోవును. దంతములు పూర్ణముగఁ గనఁబడును, ముక్కుల

నుండియును ముఖమునుండియు వేగముగ శ్వాసలు వెడ
లుచు నస్ఫుటశబ్దములు వెలువడును. దీని నవహసిత
మందురు. రెండు ముక్కులు నుబ్బి, నేత్రములు మూఁతఁ
బడి అస్పష్టశబ్దము కలిగిన దాని నవహసితమందురు.
ముక్కురంధ్రము లుబ్బి, నేత్రములు మూఁతపడి, కన్నుల
నుండి నీరువచ్చి తలనూపము ముఖము వికసిత మగుటను
అపహసితమందురు. అతి హసితమున నవ్వువాఁడు తన
శారీరక వేగమును నాపుకొనఁ జాలకుండును. స్వతః రెండు
చేతులతోఁ జప్పట్లను జఱచుచు, నాసాపుటములు సంకుచిత
ములై, నోరు తెఱువఁబడి, శరీరము క్షతవిక్షతమగుచు,
నవ్వి నవ్వి దొర్లగిలుచు, మాటిమాటికిని దీర్ఘనిశ్వాసము
లను విడుచుచు నవ్వునాపు కొనఁజాలకుండిన దానిని అతి
హసితమందురు. ఈ నవ్వులన్నియును నత్యంత ప్రేమ
యందును, నవ్వుమాటలందును, ప్రియజన గోష్ఠియందును
వచ్చును. ఈ గోపికలందఱును గ్రీడలందును, యువతులతో
నేకాంతమున నీ నవ్వులాట లన్నియును జేయుచుండును.
శ్యామసుందరుని నేత్రములు స్వాభావికముగ విశాలము
లైనవి, చంచలములైనవి, కాని ఆతఁడు నవ్వినప్పుడును,
హాస్యమొనర్చు నపుడును వికసితములగును. అప్పుడవి
అత్యంతాకర్షకములుగ నుండును. వాని నెవరును మఱతు
మన్నను మఱవఁజాలరు. ఆతఁడంత ర్హితుఁడై నపుడును,

దాగుకొన్నప్పుడును, కన్నులెదుటనుండి తొలఁగినపుడును, విశాలములగు నల్లనల్లని గనుబొమలతోఁ గూడిన కుటిల కటాక్షములతోఁ గూడిన నయనములు స్మరణమునకు వచ్చును. అప్పుడు హృదయమున నిస్పృహకలుగును. ఆ సమయమున నొక విచిత్రమగు దశ కలుగును. దానిని మృత్యువనియును జెప్పఁజాలము, జీవితమనియును జెప్పఁజాలము. మధ్యలో సగము చావుగనుండును. విషార్తమగు బాణముచే గాయపడిన హరిణమెట్లు తటతట కొట్టుకొని, చివర కలసిపోయి పడిపోవును. అట్టి దశయే శ్రీకృష్ణుఁడంతర్హితుఁడు కాఁగానే విరహిణులగు నావ్రజాంగనలకు కలిగెను. శ్రీకృష్ణునియొక్క ఒక్కొక్క చేష్టను స్మరించి శూన్యమందు వానినిఁ జెప్పుచుండిరి. హృదయస్థుఁడగు హృదయేశ్వరుని వారు సంబోధించు చున్నట్లుండెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా! గోపికలకు శ్రీకృష్ణుఁడు కనఁబడకున్నను నాతనితో నిట్లనుచుండిరి :- "ప్రియా! నీవు సురత సుఖమునకు స్వామివి. నీ వలన మాకు లభించిన సురతసుఖమువంటి సుఖమింకెక్కడ మాకు లభింపఁగలదు ? నీవు చూచుటకు మిక్కిలి అమాయకుఁడవు వలెఁ గనఁబడుచుందువు. కాని చాల పోఁకిరివి, కఠినుఁడవు, దాగిన బధికుఁడవు. ఒక వేళ వేటగానియొక్క లక్ష్యమైనఁ

దప్పిన దప్పునేమోకాని నీ లక్ష్యముమాత్రము తప్పదు. బాణమును వేధించుట నెఱుఁగుదువుకాని, దానినిఁ దీయుట యెఱుఁగవు. విశేషించి నీ శూరవీరత నీ యబలలపైన సాగించుచుందువు. నిర్బలులను గొట్టుటయు, గాయపఱచుట యును మంచిదియగునా? నేనేమి వధించితిని? నా వద్ద నస్త్ర శస్త్రము లేమియున్నవి? వలగాని, గింజలుగాని లేవన వచ్చును. ఈ విషయము మాకును దెలియును. నీవు సాధా రణ వ్యాధుఁడవుకావు, విచిత్రవ్యక్తివి. నీ వస్తువులన్నియు విచిత్రములే. నీవు సుందరతా, కోమలతా, మృదులతా, సరసతా, వశితాది తంతువులచే నొక గట్టివల నల్లితివి. దానిని నీ ముఖమను నరణ్యమునఁ బన్నితివి. దానియందు మోహకతతో నిండిన మందహాసములను నన్నికణములను జల్లితివి. నీవు కనుబొమ్మలను ధనుస్సుమీఁదఁ గటాక్ష రూపములగు బాణములనెక్కిడి, హరిణీరూపలగు వ్రజాంగ నల మీఁదఁగొట్టి గాయపఱచుటకై కదంబము చాటుననుండి మోహక మురళిని వాయించుచుందువు. కామవర్ధకరాగము నాలాపించుచుందువు. గృహకార్యములందు వ్యగ్రులమైన మేమా ధ్వనిని విని, దాని యాకర్షణమునకు వశులమై వచ్చి తిమి. కొందఱు ధనమునొసంగి దాసీలను గొనుచుందురు. నీవో లోభివియును స్వార్థుఁడవునై యున్నావు. నీవు మూల్యము

నీయవు. ఇతరుల దుఃఖములను గమనింపవు. కటాక్షములచే గాయపఱచెదవు. అక్రీత దాసీలనుగా నొనర్చుకొందువు. ఏదో విధముగఁ గ్రీత దాసీలమైతిమి. మా కిప్పుడింటి పనులును లేవు. ఇప్పుడు మమ్ములను వివశలఁ గావించితివి. మా ధర్మ కర్మ రూపమగు ధనమునుగూడ చోరశిఖామణివైన నీవు హరించివైచితివి. లజ్జా నివారణార్థముగ మేము కట్టుకొనిన వలువలనుగూడ హరించితివి. సమస్త విధముల నసహాయల నొనర్చి మమ్మిచటి కేకాంతమునకుఁ దీసికొని వచ్చి వదలితివి. నీది అబలలమగు మాకు శస్త్రములేని వధకాదా? నది అన్యాయముకాదా? ప్రియుఁడా! ఎట్టి స్వార్థుఁడైనను స్త్రీలమీఁద దయఁజూపును. దొంగలు, హంతకులైనను దమ ప్రియలను గౌఁగిలించుకొందురు, ప్రేమించెదరు. మేము నిన్నింకేమియును గోరుట లేదు. నీవు మా సర్వస్వమును నపహరించితివి. మంచిపనినే చేసితివి. మమ్ముల నిండ్లకుదూరముచేసి వనములో నీ చరణ సమీపమునకుఁ బిలిపించుకొంటివి. ఇదియునుమంచిదే. కాని కొంచెముగ దయఁజూపుము. నిరపరాధలగు స్త్రీలను వధించిన పాపమునకుఁ బ్రాయశ్చిత్తము నొనర్చుకొనుము. నీరు లేనిచోటఁ జేపలు కొట్టుకొనునట్లు కొట్టుకొనుచున్నాము. నీ దర్శనమను జలమును జిలకరించి మాకు జీవనదాన

మొసంగుము. నీకు జాల పుణ్యముండఁగలదు. నీవు సమస్త పాపములనుండియు బయటఁబడఁగలవు. దర్శనరూపమగు నమృతము నొసంగి, మరణించుచుండిన నీ యబలలను నీవు రక్షించినచో నీ కక్షయ పుణ్యలోకములు లభింపఁగలవు. శ్యామసుందరా! రమ్ము రమ్ము, రమ్ము ప్రియతమా! చాల సేపైనది. ఇంక నధిక వికలము గావింపకుము. మేము మర ణించుటయే నీ కభీష్టమగుచో మొదట మమ్ములనేల రక్షించి తివి. మేము దేవకీమూలమునఁ జాలసారులు మృత్యుముఖ మునఁ బ్రవేశించితిమి. నీవే పరువిడివచ్చి మమ్ములను మృత్యు ముఖమునుండి రక్షించితివి. మమ్ముఁ జావనీయ లేదు. ఇతరులు చంపుచుండిననే నీవు రక్షించితివే, ఇప్పుడు నీవే స్వయముగ మమ్ములను వధింపనేల ? ఏల మమ్మేడ్పించెదవు? ప్రియుఁడా! ఇప్పుడుచాల మించిపోయినది. ఇఁక నాలశ్య మొనర్చిన ననర్థమగును.''

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఈ విధముగ గీతమును బాడి యీ గోపిక మెదలకుండఁగా, శ్రీకృష్ణుఁడు తమ్మెచ్చట రక్షించినదియు స్మరించుకొని యింకొక గోపిక గోవిందుని గుణగాన మొనర్ప నారంభించెను. ఆ గీతమును గూడ మీరు దత్తచిత్తులరై వినుఁడు.

—॥—

# ఓ రక్షకా! రక్షింపుము

(౯౮౬)

శ్లో॥ విషజలాప్యయా ద్వ్యాల రాక్షసాత్।
వర్షమారుతా ద్వైద్యుతానలాత్।
వృషభయాత్మజా ద్విశ్వతోభయాత్
ఋషభ తే వయం రక్షితా ముహుః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౧ అ. ౩ శ్లో॥

తన ప్రేమను ప్రదర్శించుట కనేకోపాయములు కలవు. హృదయములోపలఁ ప్రేమ దాగియుండినచో నోట నే మాట వచ్చినను ప్రేమ మిశ్రితమై వచ్చుచుండును. బయట వడ వేయుచున్నను, వాయు వెంతో ఉష్ణముగ నున్నను వీవన క్రింద మంచుగడ్డను బెట్టినచో వేడిగాలి చల్లఁబడిపోవును. గ్రీష్మఋతువునందును జలిపుట్టును, లోపల ప్రేమయుండి నోటఁ గఠోరవాక్యములు పలుకుచున్నను హృదయమును గరిగింపఁజేయును. ప్రేమ వివృద్ధినిఁ గావించును. ఏ వస్తువును ప్రేమతో స్పర్శించెదమో దాని స్పర్శవలన సుఖము లభించును, సరసమగును, మనోజ్ఞమగును, అత్యంతాకర్షకమగును. హృదయహారిణిగను, అనురాగవివర్ధినిగను నగును.

ప్రేమహీన హృదయముతో నే విధముగ నుపాలంభ మొనర్చినను వానితో శాశ్వతముగ వైరము లభించును, కాని అదే యుపాలంభమును ప్రేమ హృదయముచే లభించినచో దానిలో మాధుర్యము గోచరించును. ఎవఁడైనను గోపముతో "పో! పో! నీకును నాకును సంబంధమేమి? నీ వెవఁడవు?" అనినచో నట్టి స్వాభిమానపురుషుని ముఖమును జీవితమునఁ జూడ బుద్ధిపుట్టదు. కాని యీ వాక్యములనే ప్రేమభరిత హృదయముతోఁ బ్రగాఢ తమ స్నేహముతోఁ బలికినచో నాతని హృదయమున నెంతో అధిక మమత్వ ముత్పన్నమగును. వాఁడు పోఁదలఁచినవాఁడైనను నీ మమతా భరిత ఉపాలంభన వచనములను విని పోఁజాలఁడు. అందువలనఁ బ్రేమలోఁ గఠినమగు పలుకులను వినుటయును, ప్రేమాభివృద్ధియందు ప్రధాన హేతువుగ నెన్నఁబడుచున్నది ప్రేమయందు శిష్టాచారధ్యానముండెనా అది నిర్ముక్త ప్రేమ కాదు. సర్వత్రా శిష్టాచారప్రేమ కాక, కఠినవాక్కులను బలుకుచుఁ దిట్టెనా, ఏకాంతమున నేమాటలన్నను నది నిర్ముక్త ప్రేమయని తెలిసికొనవలయును. గోపికలు శ్రీకృష్ణుని అపార ప్రేమను బొంది ఉబ్బిపోవుచుండిరి. ఆతని నేమియనుటకైనను సంకోచము కలుగుట లేదు. భగవానుఁడు బ్రహ్మాది దేవతల వేద స్తుతులచేఁ బ్రేమికుల నోటినుండి

వెలువడిన ఛల, కపట, ధూర్త, కఠినవాక్కులతోఁ గూడిన మమత్వ పూర్ణ శబ్దములను విని సుఖమును నానందమును జెందినట్లు చెందఁడు.

సూతుఁడిట్లనెను:– "మునులారా! ఆ గోపికలందఱిలో నొకర్తుక శూన్యమున శ్రీకృష్ణుని సంబోధించుచు నిట్లనెను:– "శ్యామసుందరా! నీ వందఱిలో శ్రేష్ఠుఁడవని వింటిని. దీనుల యందు దయను జూపుటయును, దుఃఖితుల దుఃఖములను దొలఁగించుటయును, పీడితులను బీడించుటయును, ఆర్తుల ఆర్తిని హరించుటయును, సదా పరోపకార నిరతుఁడగుట యును శ్రేష్ఠపురుషుల లక్షణము. కాని నీవు దీనికి విపరీతా చరణమును గావించుచున్నావు. మమ్ములను బీడించు చున్నావు. ఆదర్శన రూపమగు నస్త్రముచే మమ్ములను బొడిచి చంపుచున్నావు. కటాక్ష బాణములచే గాయపఱచి నీవు దాగి నవ్వుచున్నావు. ఆనందించుచున్నావు. కడు నిర్ద యుఁడవు. నీ హృదయమున దయావేశము లేదు. నీవే మా హృదయమునఁ గామాగ్నిని రగిల్చి, ప్రేమయను గాలితో నూది, దానిని మండించితివి. ఇప్పుడు గొప్ప విరక్తుఁడ వైతివి. మొదట నీవు ప్రేమలతను నీ ప్రేమ పూర్ణములగు మధురవచనములచేఁ జిలకరించి, అది పల్లవితమై పుష్పింపఁ బోవు సమయమున నీవు నల్లని మేఘమవై అమృతస్థానము రాళ్లవర్షమును గురిపించి తుషారాఘాత మొనర్చుచున్నావు.

నీవు దానిని నశింపఁజేయవలయుననిన నొక్కసారి జడమునే కోసివేయుము. ఏల బాధించెదవు? దానిని మొదలంట నాశము చేయఁగోరినచో మొదట దానినిఁ బెంచు టెందులకు? అమృతవాక్కులను జల్లి దానినిఁ బెంచుటెందులకు? జాగ్రత్తగా నేల రక్షించితివి? రక్షించి, అది పుష్పించి ఫలింపనుండఁగా దానిమీఁద విషమును జల్లుటయూ చేయునది. సూచీముఖమున దాని నరములలోనికి విషము నెక్కించుచున్నావు. ఇదియేనా సాధుత్వము? సజ్జనుఁడు తన చేతులతో నాటిన విషవృక్షమునైనను దానుగా నఱకఁడు. నీవు దుఃఖితులమగు మమ్ముల నిదివరలో దుఃఖముల నుండి రక్షించితివి. మృత్యుముఖమున దూఱి మమ్ము రక్షించితివి. ఒక్కసారి కాదు. మే మనేకసార్లు, సమస్త వ్రజవాసులతో మృత్యు ముఖమును బ్రవేశించితిమి; కాని నీవు మమ్ములను హఠపూర్వముగ నీ బలపురుషార్థములచేఁ దీసి తెచ్చితివి.

కాళియ హ్రదమందు మహావిషధరమగు కాళియ సర్పము నివసించుచుండెడిది. అది బృందావన సమీపమునఁ గల యముననంతను విషయుక్త మొనర్చినది. పొరపాటున నా హ్రదమందలి జలమును గోవులు ద్రాగినవి. నీవును నా హ్రదమునఁ బ్రవేశించితివి. కాళియుఁడు నీ శరీరమునకుఁ

దన శరీరమును వైచి గట్టిగఁ జుట్టివైచినాడు. వినఁగానే మేమందఱమును బరువిడితిమి నీయాస్థితిని గాంచి మేమును నా హ్రదమునఁ బ్రవేశింపఁ దలఁచితిమి. మే మా సమయమునఁ బ్రాణములను విడువఁ దలఁచితిమి, కాని నీవా నాగమును మదమణఁచి నీటినుండి వెడలనడిపితివి. వానిని వ్రజము నుండిపారద్రోలితివి. మమ్ముఁజంపుటయే నీకిష్టమగుచో నప్పుడే మమ్ముల నేలఁజావనీయ లేదు. మేమా విషయుక్తమగు జలమునఁ బడి చచ్చియుండినచో నీవు హాయిగ బయటకు వచ్చి ఆనందించి యుండవచ్చునుగదా! మా అంతట మమ్ములను జావనైనఁ జావనీయక పోతివి. మమ్మప్పుడు చావనిచ్చి యుండిన నీకు పాపముకూడ ఉండెడిది కాదు. ఇప్పుడు కటాక్షబాణములచే వేధించి గాయపఱచి నీవదర్శన రూపమగు విషము నాగాయముపైఁ జిలుకుచున్నావు. విరహ రూపమగు విషౌషధమును సూదితో గాయమునకు సంబంధించిన రక్తవాహినీ నరములలోని కావిషవస్తువు నెక్కించుచున్నావు. ఇట్టి యాచరణము నీ కనురూపమైన దేనా? మేము విషజలమున మునిఁగి చచ్చుచుండినపుడు నీవు రక్షించితివి. ఇపుడు మాకు విషము నొసంగుచున్నావు. కొట్టికొట్టి చంపుచున్నావు.

దుష్ట రాక్షసుఁడగు నఘాసురుఁ డజగరుఁడై వనము లోనికి వచ్చినాఁడు. మా సోదరులు, మేనల్లుండ్రు, పుత్రులు,

మఱందులు ఇతర బాలకులా యజగరుని నోటఁ బ్రవేశించి వత్సములతో సహా విషజ్వాలలచే మరణించిరి. వారు చచ్చి యుండినచో మేమందఱమును వారి విరహమున మరణించెడు వారమే. ఆ సమయమున నీవు మృత్యురూపమగు నజగరము ముఖమునఁ బ్రవేశించి ఆ బాలకులనందఱను రక్షించితివి. ఆ సమయమున నీవు మా ప్రాణములను నేమి యాలోచించు కొని రక్షించితివి? అట్లు చావనిచ్చియుండినచో, నీ వేకాంత ప్రియుఁడవు కావున మామీఁద నేవగింపు కలిగినచో నీవీ యెనుబదినాలుగు యోజనములుగల నీ వ్రజమున నీ వొక్కఁడవే కదంబవృక్షము నెక్కి సుఖముగ నుండి యుందువు కదా! ఏ కారణమున మమ్ము విపత్తులనుండి కాపాడితివి? నీకు విరక్తియనిన నిష్టమగుచో మాకు మొదటనుండియు నీ యనురక్తి నేలఁ గలిగించితివి? వధికుఁడు పశువును మొదట మంచిమంచి పచ్చిగడ్డిని మొదలగు వస్తువులనుబెట్టి బలిపించి తరువాత నొకదినమున దాని మెడమీఁదఁ గత్తినిఁబెట్టి వధించును. అట్లుచేయకుము. వ్రజరక్షకా! ఇంతవఱకును నీవు మమ్ములను రక్షించితివి. ఇప్పుడు నట్లేచేయుము. మాకు దర్శనమొసంగి కృతార్థుల నొనరింపుము.

ఒక్కసారికాదు, అనేకసార్లు మేము మృత్యుముఖమునఁ బడితిమి. వార్షికపూజ నొనర్పకపోవుటచే మేఘాధిపతి

యగు నింద్రుఁడు కుపితుఁడై వ్రజవాసులమగు మామీఁద వర్షమును గురిపించి సర్వనాశన మొనర్పఁబూనెను. ఆతఁడు గోప, గోపీ, గోపబాల, గోవత్స, గోవ్రజమునంతను సర్వ నాశనము కావింపఁదలఁచెను. ఆతఁడు ప్రళయమొనర్చు సాంవర్తకమను మేఘములకును నాజ్ఞాపించెను. ఆ మేఘ ములు ప్రళయంకరమగు వర్షమునుగురిపించెను. వ్రజమును సంహార మొనర్చుటకై మెఱపులు మెఱయ నారంభించెను. తీవ్రముగ గాలి వీవనారంభించెను, గాలివానచేఁ బెద్ద వృక్ష ములు పెల్లగిలి పడిపోయెను. మా బండ్లన్నియు నీటిలో మునిఁగెను. మేము మృత్యువుయొక్క చివరి గడియలను లెక్కించుకొనుచుంటిమి. చావ సిద్ధముగ నుంటిమి. అప్పుడు నీవు గోవర్ధనమును ధరించి వర్షమునుండియు, మెఱపుల నుండియు, గాలివాననుండియు మమ్ము రక్షించితివి. ఇంద్రుని కోపమునుండి కాపాడితివి. ఏడు దినములు శ్రమలేకయే గోవర్ధనమును ధరించితివి. నీకు మమ్ముఁ జంపుటయే యిష్ట మగుచో నప్పుడింతటి శ్రమ పడవలసిన పనియేమున్నది? నిజముగ మామీఁద నీ కేవగింపే యుండినచో నప్పుడే మమ్ముఁ జావనిచ్చెదువాఁడవు, నిన్నింద్రుఁడేమియును జేయఁ జాలడు, నీవు సర్వేశ్వరుఁడవు. నిర్గుణుఁడవు, నిరాకారుఁడవు, నిరీహుఁడవు, నిర్లేపుఁడవు, అద్వితీయుఁడవు. నీ వొక్కతె

తోడనే రమింపఁదలఁచి యుండిన రమణీజనములమగు మమ్మేల రక్షించితివి?

ఒక్కఁడుకాఁడు. అనేకులగు నసురులు వచ్చిరి. వారం దఱి సంకల్పమును వ్రజవాసులమగు మమ్ముఁ జంపుటయే. వారనేక రూపముల వచ్చిరి. సుడిగాలిగను, వత్సముగను, అజగరముగను, గార్దభముగను వత్సాసుర, అఘాసుర, వ్యోమాసురాదులెందఱో వచ్చిరి. వారి నందఱను నీవు చంపి వ్రజమును రక్షించి, మాకు జీవనదాన మొసంగితివి. నీవిట్లేల జేసితివి? ఇప్పుడు మమ్మెలఁ దలపై కెత్తుకొని బండమీఁద బాదఁదలఁచితివి? మాకేల స్వర్గసుఖమునుజూపి నరకయాతన లను బెట్టుచున్నావు? నీవు దయావశమున మమ్ము రక్షించి యుండినచో నా దయ యిప్పుడెచ్చటికిఁబోయినది. ఆ దయ పతివ్రత కాదా? అటునిటుఁ దిరుగు తిరుగుబోతా? నీ హృద యము నుండి లేచిపోవుటకు? ఇప్పుడు నీవు దయా విహీనుఁడ వైనచో నా యసురులను వధించినటుల వధింపుము. మా ప్రాణములను దీసికొనుము. మమ్ములను బీనుఁగులఁ జేయుము. చావు బ్రదుకుల స్థితికేలఁ దెచ్చెదవు? ఇప్పుడు మేము చావను లేదు, బ్రదుకను లేదు. ఇదివఱలో నీవు మమ్ము రక్షించియుండిన మఱల నిప్పుడును రక్షింపుము. నీకు సామ ర్థ్యము లేకపోలేదు. నీవు సాధారణ గోపకుఁడవు కావు. నీవు గోపకుఁడవయ్యును విశ్వేశ్వరుఁడవు.

సూతుం డిట్లనెను:- "మునులారా! ఈ విధముగ గోపికలు భగవానుఁడు చేసిన ఉపకారములను స్మరించుకొనుచు నాతని పూర్వకృత్యముల యెడలఁ గృతజ్ఞతను బ్రకటించుచు వివిధ విధముల నుపాలంభనము కావించుచుండిరి. వారు భగవానుని గోపకుమారునిఁగఁ జూచుట లేదు. వారి కాతఁ డఖిల విశ్వపతియును, సర్వేశ్వరుఁడును. సచ్చిదానంద ఘనమనియు భావనము కలదు.

# సర్వసాక్షీ! మా మొఱను వినుము

౯౮౭

శ్లో॥ న ఖలు గోపికా నందనో భవాన్
అఖిల దేహినా మంతరాత్మదృక్।
విఖనసార్థితో విశ్వగుప్తయే
సఖ ఉదేయి వాన్సాత్వతాంకులే ॥

శ్రీ భాగ ౧౦ స్కం. ౩౧ అ. ౪ శ్లో॥

ఉ॥ నీవు యశోద బిడ్డఁడవె నీరజనేత్ర సమస్త జంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు తొల్లి విరించి దలంచిలోకర
క్షావిధ మాచరింపుమని సన్నుతిసేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁలోన నిటుపుట్టితిగాదె మనోహరాకృతిన్।

శ్రీ మదాంధ్ర భాగవతము,

ప్రేమవస్తు వొక్కటే రెండుకాదు. భగవంతుఁడు సర్వత్ర ఒక్కడే. ఆతనిలో ద్వైతములేదు. జీవుఁ డాఏక మునే కోరును. ఇంకొక దానినిఁ గోరఁడు. కాని కొంత పొరపాటు జరిగినది. ఆతనికి స్వాభావికముగ దేనియందు బ్రీతియుండునో దానిని భగవానుఁడని అనుకొనఁడు. అందు వలనఁ బ్రేమించియును దుఃఖమును బొందుచున్నాఁడు, అశాంతిగా నున్నాఁడు వ్యాకులుఁడై నాఁడు. ఆతనిఁ జింత చుట్టుకొనియున్నది. కాకున్నచో నెంతటి చల్లనిదైనను అగ్ని సమీపమునకుఁ బోఁగానే చలి పాఱిపోవును. జీవున కెచ్చట ఆకర్షణము కలదో, దేనియందు నిష్ఠయుండునో దానిని భగవద్రూపముగ భావించినచోఁ దరించి తీరును. మనము విషయముల ఆకర్షణమునఁబడి సుఖముకొఱకై పరు విడుచున్నాము. కాని సాంసారిక విషయములందు సుఖ మెక్కడిది. అవి దుఃఖాలయములు. వానివలన; శాంతి లభింపక అశాంతియే లభించును. మనము ప్రేమించినఁ బరి ఛిన్నమును ప్రేమింపరాదు. అపరిఛిన్నమును బ్రేమింప వలెను. వ్యష్టినిఁ బ్రేమింపఁ గూడదు. సమిష్టినిఁ బ్రేమింప వలెను, ఒక్కదానినిఁ జూచువానినిఁ బ్రేమింపకు. సర్వ ద్రష్టను బ్రేమింపవలయును. ప్రేమయనిన నది. లేకున్నది కామవాసన కాఁగలదు. వ్యభిచార మగును. కామభావ మునే భగవంతుని యందుంచినచో దానికిఁ బ్రేమసంజ్ఞ

ప్రేమవస్తు వొక్కటే రెండుకాదు. భగవంతుఁడు సర్వత్ర ఒక్కడే. ఆతనిలో ద్వైతములేదు. జీవుఁ డాఏక మునే కోరును. ఇంకొక దానినిఁ గోరఁడు. కాని కొంత పొరపాటు జరిగినది. ఆతనికి స్వాభావికముగ దేనియందు బ్రీతియుండునో దానిని భగవానుఁడని అనుకొనఁడు. అందు వలనఁ బ్రేమించియును దుఃఖమును బొందుచున్నాఁడు, అశాంతిగా నున్నాఁడు వ్యాకులుఁడైనాఁడు. ఆతనిఁ జింత చుట్టుకొనియున్నది. కాకున్నచో నెంతటి చల్లనిదైనను అగ్ని సమీపమునకుఁ బోఁగానే చలి పాఱిపోవును. జీవున కెచ్చట ఆకర్షణము కలదో, దేనియందు నిష్ఠయుండునో దానిని భగవద్రూపముగ భావించినచోఁ దరించి తీరును. మనము విషయముల ఆకర్షణమునఁబడి సుఖముకొఱకై పరు విడుచున్నాము. కాని సాంసారిక విషయములందు సుఖ మెక్కడిది. అవి దుఃఖాలయములు. వానివలన; శాంతి లభింపక అశాంతియే లభించును. మనము ప్రేమించినఁ బరి ఛిన్నమును ప్రేమింపరాదు. అపరిఛిన్నమును బ్రేమింప వలెను. వ్యష్టినిఁ బ్రేమింపఁ గూడదు. సమిష్టినిఁ బ్రేమింప వలెను, ఒక్కదానినిఁ జూచువానినిఁ బ్రేమింపకు. సర్వ ద్రష్టను బ్రేమింపవలయును. ప్రేమయనిన నది. లేకున్నది కామవాసన కాఁగలదు. వ్యభిచార మగును. కామభావ మునే భగవంతుని యందుంచినచో దానికిఁ బ్రేమసంజ్ఞ

ఈ నీ త్రిభంగ లలిత, శిఖిపింఛ మకుటమును ధరించిన వనమాలి స్వరూపమును సత్యమే. ఇదియును నవిద్యకును, మాయకును, బ్రకృతికిని బరమైనదియే. నిర్గుణుఁడవు, సగుణుఁడవైనావు. నీ రూప మమూర్తమయ్యును, మూర్తీభవించినను దోషముగాలేదు. అది యథాప్రకారముగ నిర్లేపము గను, నిర్వికారముగను సర్వ సద్గుణాశ్రయముగనే యున్నది.

లోకమున విప్లవము తటస్థింపఁగాఁ గమలాసనుఁడగు బ్రహ్మకడకు దేవతలందఱునుబోయి, వారు తమ దుఃఖమును నివేదించుకొనిరి. బ్రహ్మ దేవతలతో నిట్లనెను:- "దేవతలారా! మీరు నన్ను బ్రహ్మాండమునకంతకును నేకైక అధీశ్వరుఁడ ననుకొనుచున్నారు. ఇది మీ భ్రమ. నేనును స్వతంత్రుఁడను గాను, నేను నింకొకని ప్రేరణచేతను, ఆతని సంకేతము చేతను గార్యము లొనర్చుచున్నాను. మీ దుఃఖమును నే నాతని సమ్ముఖమున విన్నవించెదను. ఆతఁడేమైనను జేయఁగలడు, మీరును నాతో రండు." ఇట్లు పలికి బ్రహ్మ అందఱను తీసికొని క్షీరసాగర తటమునకు వచ్చిరి. కాని అచ్చట స్వచ్ఛమగు తెల్లని పాలుతప్ప వేఱు కనఁబడుటలేదు. మనుష్యుఁడు కానిండుఁ దేవత కానిండు, లోకపాలురు కానిండు, సాక్షాత్తు బ్రహ్మాండనాయకుఁడగు బ్రహ్మకానిండు, ఎవరై

నను నిన్ని చర్మచక్షువులతోఁ జూడజాలరు. మా చర్మ చక్షువులలో నీ వెల్లప్పుడును నివసించుచున్నట్లు చేసితివి. నీవు మా కాటుక కండ్లలో నివసించుటచేఁ నీవు నల్లవాఁడ వైతివి. నీకు కృష్ణయను పేరువచ్చినది. కాకుండిన బ్రహ్మ నిన్ను "శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్" అని యేల స్తుతించును? ఆతఁడు శ్వేతదుగ్ధమునందు నిన్నుఁ జతుర్భుజునిఁగఁ గాంచెను. మేము నిన్ను ద్విభుజు నొనర్చి మా నల్లని కాటుక కనురెప్పలలో నిన్ను దాచుకొంటిమి. మానవుఁడు తానెట్టివాఁడగునో అట్టివారినే ప్రేమించును. మాకు రెండుచేతులే యున్నవి. నీకు నాలుగు చేతులుండినఁ మేమాలింగనము చేసికొనుటెట్లనుకొంటివి. మా బాహు పాశములందు నీ నాల్గుచేతుల నెట్లు బంధింపఁగలము? నీవు మా వివశతను గ్రహించి, బ్రహ్మప్రార్థనను విని నీ వందఱ కును దర్శనమీయలేదు. బ్రహ్మయొక్క అంతఃకరణమునఁ బ్రకటమై ఆతనికి ప్రకటవాక్కులతో నిట్లంటివి. ఆ వాక్కుల నింకెవరును వినలేదు. బ్రహ్మయొక్కఁడే వినఁగలిగెను. నీ వాతనితో నిట్లంటివి:- "నేను సమస్త జగద్రక్షణముకొఱకై సాత్వత కులమందు-భక్తుల వంశమున నవతరించెదను."

కావున జనార్దనా! నీవు నీ ప్రతిజ్ఞను జ్ఞాపకముంచు కొనుము. నీ యవతారము సమస్త జగద్రక్షణము కొఱ

కైనపుడు మమ్ములను జగత్తునుండి వేరుచేసెదవేల? మేమును నీ జగత్తులోనే పుట్టితిమికదా! మమ్ములనేల రక్షింపవు. మా శరీర తాపమునేలఁ బోఁగొట్టవు? వచ్చి మమ్ములనేలఁ గౌఁగిలించుకొనవు?"

కొందఱీ ప్రపంచము నీ కన్యమైనదందురు. ఈ ప్రపంచము తమ్ముఁ గబళించునని వారు భావించెదరు. ఇది తమ్ము చక్రమునఁ ద్రిప్పునందురు. చంపుచుండును, పుట్టించుచుండును. దుఃఖము నొసంగునందురు. అందువలన దీనిని దుఃఖ కారణముగ భావించి సుఖస్వరూపుఁడవగు నిన్ను శరణు వేఁడెదరు. నీవు వారికభయ ప్రదానమొనర్చి స్వీకరించుచుందువు. వారిని దుఃఖమునుండి బయటపడవైచెదవు. వారి భయమును బోఁగొట్టెదవు. నీ వందఱి భయములను బోఁగొట్టుచుండ మా భయమునేలఁ బోఁగొట్టవు? మామీఁదఁ గృపఁజూపవేల? మే మీ ఘోరవనమున నొంటరిగ భయ భీతులమైనాము. స్త్రీలు స్వాభావికముగ భీరువులు. పైఁగా నొంటరిగా నుండిన నింకను భయపడుచుందురు. రాత్రియందందఱకును భయము వేయును. మా కింకేమియు నక్కఱలేదు, మా ప్రార్థనమిదియే. సముద్రమునుండి బయటకువచ్చి, సిగ్గుపడుచు వచ్చుచుండిన ననురాగవతియగు లక్ష్మియొక్క కోమల కరమును నే నీకరముతోఁ బట్టుకొంటివో ఆ కరకమల

మును మా శిరస్సున నుంచుము. ఆ కరమును స్పర్శించుట చేతనే మేము కృతకృత్యులమగుదుము, దీనితోడనే మా సమస్త మనోరథములు పూర్ణములగును, ఆ కమనీయ కామ పూరక కోమల కరముల స్పర్శచే మా సమస్త కామపీడలు శాంతింపఁగలవు. మా శిరస్సు సార్థకము కాఁగలదు. అది సర్వశ్రేష్ఠమైనదగును. ఇంతమాత్ర మొనర్చి పారిపోఁగూడదు. శిరస్సు సౌభాగ్యశాలిని కాఁగలదు. ఈ కన్నులో! ఇవి స్పర్శచే సంతుష్టినిఁ జెందునవికావు. వీనికి రూపము కావలయును. ఆ రూపమైనను ననాకార రూపము పనికిరాదు. సుందరమైనది కావలెను, సుకుమారమైనది కావలెను, అది ప్రియమైనదియును, అతి సుకుమారమైనదియును గావలయును. ఈ రెండు కన్నులును ఆ రెండు కన్నులును గలిసి నాలుగైనచో వానినుండి అనురాగము వర్షింపఁగలదు. ఈ కన్నులతి చంచలములైనవి. వీ రనేకములగు గన్నులను గాంచిరి, కాని వీరు నీ కన్నులనుగాంచి దేహ విస్మృతినిఁ జెందిరి, ధన్యులైరి. స్త్రీలు స్త్రీరూపమునుగాంచి మోహితలు కారనుచుందురు. కాని మా యీ కన్నులు నీ కన్నులనుగాంచి మోహితలైనవి. నిరంతరమివి వానినిఁ జూడఁగోరుచుండును. ఏ కన్నులు మనోహర మందహాస యుక్తమగు ముఖమున నుండి అల్లరిచేయుచుండునో, వేనినుండి అనురాగ శ్రోతలు

నిరంతరమును ప్రవహించుచుండునో, ఏ యవి భక్తుల సమస్తాభిమానములందును నీటినిఁ గ్రుమ్మరించినవో, ఏవి స్మిత, హసిత, ప్రహసిత, అతిహాసితములవలన వికసితములై యుండునో, ఆ కన్నులను, వాని కాసనముపమగు గపోలములను, అవనీముపమగు నాననమును మాకు జూపింపుము. నాథా! అబలల కన్యాయ మొనర్చెదవేల? మమ్ములనేల వ్యర్థముగఁ ద్రిప్పెదవు?

ఇంకొక పనినిఁ జేయవలయును. దానిని మఱవరాదు. అది చాల ఆవశ్యకమగు కార్యము. నీవు మస్తకమున హస్తమునుంచి, మా కన్నులలోఁ గన్నులను గలిపి, పెదముఖమునుబెట్టి, మమ్ము వికలలఁ గావించి తప్పించుకొని పాఱిపోతివి. అప్పుడు మమ్ముల నెవరివారల నొనర్చితివి? దుఃఖము హృదయమునకు సంబంధించిన వస్తువు. అనుభూతి హృదయముచేతనే కలుగును. బ్రహ్మ మాయువతుల హృదయములను స్థూలముగను, గఠోరములుగను, ఉన్నతములుగను నొనర్చినాఁడు. ఈ హృదయమునందే కామమును గూరికూరి నింపినాడు. నీ చరణము లత్యంత కోమలములని మేము వినియున్నాము, అనుభవించియున్నాము. నూతన కమలదళములకంటెను, లేత రావిచిగుళ్లకంటెను నతి కోమలములైనవి. నవనీతముకంటె నధిక స్నిగ్ధమైనవి. బాలకుని

మృదుహాస్యమునకంటె నధిక ఆకర్షకమైనది. స్వర్గములోని అప్సరసల అధరామృతముకంటె నధిక మధురమైనది. అవి అనావృతమగు వక్షఃస్థలమందు పడినచో వాని కాఠిన్యమును బోవును. అదియును నత్యంత కోమలమగును. నీవొక వనము నుండి ఇంకొక వనమునకు దిసిపాదములతోడనే పశువుల వెంటఁ బర్యటించుచుందువు. ఎవరు నీ మృదుపదముల నాశ్రయించెదరో వారి పాపములు, తాపములు, సంతాపము లన్నియును నశించిపోవును, వక్రములు సరళములగును. విషాక్తములు వీని స్పర్శచే నిర్విషములగును. కాళియ నాగ ఫణాగ్రమును నది తాఁకఁగనే అది విషహీనమై సాధు వయ్యెను. ఆ మదభరిత, మాయాభరిత చరణములను మా యుబ్బిన గబ్బిగుబ్బలతోనుండిన వక్షఃస్థలముపై నుంచుము. వాని కాఠిన్యమును బోఁగొట్టుము. వీనిలోఁ గ్రుచ్చుకొనినఁ గామ కంటకమును నీ సుఖస్పర్శచేఁ దీసివేయుము. శ్యామా! దీనిని మఱవవలదు. హృదయముమీఁదఁ జరణమున నవశ్య ముంచవలయును. ఈ శీతల, సుఖద, అమృతస్రావములగు జరణ కమలముల శీతలత్వముచే మా విరహాగ్నిని శాంతింపఁ జేయుము. చేసెదవుకాదూ? శ్యామసుందరా!''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఈ విధముగ గోపికలు విరహాగ్నిలో మండుచు బృందావన విహారినిగూర్చి

వివిధవిధములగు ప్రార్థనములను జేయఁదొడఁగిరి. ఆ ప్రార్థనలను నేను విస్తారముగ వర్ణింపఁబూనినచో నా జీవితమున వానిని వర్ణింపఁజాలను. కావున నింకఁ గొంచెముగఁ జెప్పి, యీ గోపికా గీత ప్రసంగమును సమాప్తము కావించెదను.''

—॥—

# కర్ణకుహరములను గృతార్థములు కావింపుము

(౯౮)

శ్లో॥ తవ కథామృతం తప్త జీవనమ్।
కవిభిరీడితం కల్మషాపహమ్।
శ్రవణమంగళం శ్రీమదాంతతమ్
భువి గృణంతి తే భూరిదా జనాః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౧ అ. ౯ శ్లో॥

మ॥ ఘనలక్ష్మీయుతమై వినన్ శుభదమై కామాది విధ్వంసియై
సనకాదిస్తుతమై నిరంతర తపస్సంతప్త పున్నాగ జీ
వనమై యొప్పెడు నీ కథామృతము ద్రావంగల్గు నే భూరిదా
దాన నిమాఘత్వము లేనివారలకు మా నారీమనోహారకా॥

శ్రీమదాంధ్ర భాగవతం,

సమస్తేంద్రియములకును వేఱు వేఱాహారములుకలవు. చేఁపలు నీటినెట్లు నిరంతరము చూచుచుండునో అట్లే కన్నులు సదా ప్రియతముని దదేక దృష్టితోఁ జూడఁగోరును. ఎన్నడును దానికి దూరము కాఁగోరవు. అట్లు వేఱు కాఁగానే కన్నులు గ్రుడ్డివైనట్లుండును. ఘ్రాణేంద్రియములు ప్రభుని శరీర సుగంధమును వాసన జూడఁగోరును. ప్రియుని శరీరమునుండియును, వస్త్రములు, మాలలు, శరీరమునకు సంబంధించిన సమస్త వస్తువుల నుండియును నొక యనిర్వాచనీయమగు గంధము వచ్చును. ఘ్రాణేంద్రియము దానిని దూరము నుండియే గ్రహించును. నాలుక ప్రియుని యుచ్ఛిష్ట అధరామృత ప్రసాదమును గైకొనఁగోరును. స్వయముగఁ బ్రియతముని ప్రసాదము లభించినచో దానిముందన్నియును దిగదుడుపే. ఉచ్ఛిష్ట ప్రసాదము వలనను, ఉచ్ఛిష్ట తాంబూలము వలనను, ఉచ్ఛిష్ట పేయము వలనను నాలుక తృప్తినిఁ జెందును. ప్రియుని సుఖద శరీరస్పర్శ ప్రాప్తింప వలయునని స్పర్శేంద్రియము కోరుకొనుచుండును. తన చేతులతో నాతని సేవింపఁగోరును. ఆతని కాహార పానీయముల నొసంగ వలయునని యుండును. దీనివలన స్పర్శేంద్రియమున కపారానందము కలుగును. ప్రియుని మధురాతిమధుర శబ్దములు సదా చెవులలోఁ బడుచుండ వలయునని కర్ణములు కాంక్షించును. ప్రియుఁడు సమ్ముఖమున

నుండినచో నాతని కమల ముఖమునుండి వెలువడిన వచనములను వినవచ్చును. ఆతఁడు సమ్ముఖమున లేనప్పుడాతనికి సంబంధించిన వచనములను వినవచ్చును. శ్రోత్రములు ప్రియతముని యందు బాగుగా ననురక్తము లైనచోఁ బరచర్చను వినబుద్ధిపుట్టదు. ఇతరుల విషయము లను గూర్చినచర్చ విష సమానము. భగవంతుని శబ్దము వినఁగానే కర్ణములు పచ్చఁబడును. అమృతమును గ్రుమ్మ రించినట్లుండును. భగవంతునిగూర్చి చర్చించువాఁడును, ఆతని కథలను జెప్పువాఁడును నత్యంత ప్రియుఁడగును. భగవద్విషయములను వినుచుండిన నెంతకును దృప్తి కలు గదు. శరీరమునఁగర్ణములు లేక కేవలము నేత్రములే యుండినచో లోకమున విరహు లెవరును జీవింపరు. ప్రియ వియోగమునఁ బ్రియతముఁడు మాయముకాఁగానే శరీర త్యాగ మొనర్చును. విరహులను గర్ణములే బ్రతికించు చున్నవి. అవియే సంజీవనౌషధము శరీరమునకుఁ బంపి చైతన్యతా ప్రధానమును గావించుచున్నవి. ఎదురుగా నుండి నచోఁ గన్నులు కడుపార నాతని రూపమాధురినిఁ బాన మొనర్చును. అవి ఇతర ఇంద్రియముల విషయము చూడనే చూడవు. ప్రియుని రూపాసవమును ద్రావి త్రావి సమస్తశరీ రమున మాచకతను గలిగించును. ప్రియుఁడు పరోక్షుఁడు కాఁగానే అవి వికలములై అశ్రులను రాల్చును, ఇవి వికృ

లములు కాఁగానే అంగ ప్రత్యంగములన్నియును వికలము లగును. ఆ వికలతను నివారించుటకును, అంగములన్నింటికిని గతినిఁ బ్రసాదించుటకును గర్ణములే సమర్థములైనవి. ప్రియుని కమనీయకథలు వినుటకు లభించినచో నట్లు వినినఁ దరువాతను వ్యసనముండును. అట్లు వినిపించిన వానికేమి యీయంగలమనుకొనుచుందురు. అతనికిఁ గృతజ్ఞతను బ్రకటించెదరు. భగవత్కథలను జెప్పువారికేమి యీయంగలము? ఆతని ఋణమును దీర్చుకొన నదెట్లు ?

సూతుఁడిట్లనెను:- మునులారా! గోపికలు గానము చేయుచు నిట్లనిరి:- "కమలనయనా! నీవు పలికినఁ దేనికంటె మధురములగు శబ్దములవలన మా మనస్సులు మోహితములైనవి, నీ ముఖకమలములనుండి వెలువడిన వాక్యరూపమగు మకరందమును బానమొనర్చుటచే మా మనోమధుపములు మత్తిల్లినవి. ఆ యున్మాదమున నివి నశింపనున్నవి. వీనిపై నీయధరామృతమును జిలికిన నివి జీవింపఁగలవు. అసహాయులును నిరీహులునగు నీ యబలలకు జీవనదానమొసంగి నీవు పుణ్యభాగివి యశోభావివి కాఁగూడదా?"

మేమీసమయమునఁ గేవలము పాపనాశనియు, శాంతిదాయనియు, మంగళ వివర్ధయు, అమృతమయియుఁ, గవిజన కీర్తింతయు గమనీయమునగు నీ కథల యాధారమునఁ

ప్రాణములను నిలుపుకోఁగలము ? నీవు దర్శనమిచ్చు వఱకు చిత్తము కొట్టుకొనుచునేయుండును. అంతఃకరణము ఉద్విగ్నమగును. మనస్సులో వ్యాకులత కలుగును. ప్రియతమా! మాయెడల నన్యాయ మొనర్పకుము."

నీవు గొప్ప మోసగాడవు. అందఱకును బులిబుచ్చి కపు మాటలనుజెప్పి మోసగించుటలో నిపుణుఁడవు. ఏడ్చువారిని నవ్వించెదవు, నవ్వువారి నేడ్పించెదవు. నీ ముఖమున గల మందహాసమొక విధమగు విచిత్ర గారడీ. తమ కన్నులార నా మంగళమయ మందహాసమును గాంచినవారి విషయమును వదలివేయుఁడు. వారికెట్టి స్థితి కలుగునో అది అవర్ణనీయమగు విషయము. ఏకాంతమునఁ గూర్చుండి యా మందహాసమును ధ్యానించినను వారి హృదయము నీరునీరై పోవును. ధైర్యము సడలిపోవును. ఆ మందహాస మంత్రమునే నీవు మామీఁదం బ్రయోగించినావు. నీవొక్క మాయనే యెఱుఁగుదువనునది లేదు. నీవు సర్వవిద్యా నిపుణుఁడవు. మోసగించు విద్యలన్నిటిలో నీవు పండితుఁడవు. నవ్వుతోఁ గూడిన కమనీయ స్నేహపూర్ణ ప్రణయ కటాక్షముల విషాక్తబాణము లొనర్చు పని నొనర్చును. నవ్వులకై నీవు హృదయ హారిణులగు నవ్వుమాటలను జెప్పి నవ్వించుచుందువు. వివిధ విధముల కల్లబొల్లి మాటలను జెప్పి మా చిత్తములను హరించె

దవు. ఈ విషయముల నన్నిటిని దలఁచుకొని మేమత్యంత దుఃఖించుచున్నాము. ఇప్పుడు ప్రత్యక్షము కమ్ము. ఏడ్చుచుండు రమణులను నవ్వించుము. ప్రియుఁడా! నవ్వించుము.

నిన్నొక్కమాట నడిగెదము. చెప్పెదవా? ప్రత్యుత్తర మొసంగెదవా? కమలములయొక్క కోమలదళముల కంటెను నత్యధిక కోమలములగు నీ చరణకమలములీకంటక శిలాయుక్తమగు నీ భూమిపై నిరావరణముగఁ బడినచో వానికిఁ గష్టము కలుగలేదా? వానికిఁ గష్టము కలుగకున్నను, దానిని స్మరించిన మాకు మాత్రము కష్టము కలుగుచున్నది. నీ యుగళచరణము లెంత మృదువైనవి! ఎంతటి కోమలములు! వానినుండి యెట్టి దివ్యసుగంధము వెలువడుచుండును. అత్తపత్తి ఆకుకంటెను నెక్కువగ లజ్జించి ముడుచుకొనును. దొండపండుకంటెను నెఱ్ఱనిదియు, మృదులమైనదైయున్నది. వానిని మేము మావక్షఃస్థలములపై భయపడుచు భయపడుచుఁ బెట్టుకొందుము. ఏలననఁగా మావక్షఃస్థలములత్యంత కఠోరములైనవి, పరమ మృదులములగు నీ చరణములకుఁ గష్టము కలుగరాదనుకొనుచుందుము. అట్టి చరణములు గల నీవు, కంటకమయమును శిలామయమునగు నీరాతి నేలలందొంటరిగ దిరుగుచుందువు ఆ చరణములు సాధారణ చరణములుకావు. అవి శరణాగతినిఁ జెంది

అనన్య భావుకభక్తుల భవభీతి హారకములు. సమస్తవాంఛ లను బరిపూర్ణ మొనర్చునవి. అవికమనీయ కమలాకరకమల ములచే బ్రేమతో నారాధింపఁబడినవి, అవి పృథివికి భవ్య భూషణములు. వాని నాపత్తు విపత్తులందు స్మరించినచో సుఖశాంతులను, సంతోషము నొసంగును. అట్టి చరణము లను గఠోర పృథివి యందుంచక మా హృదయములమీఁద నేలనుంచవు? మా హృదయములు పృథివికంటెఁ గఠిన మైనవికావు. ఒక్కమార్గమున రెండు పనులగును. నీవు పోవుటయును జరుగును. మా బాధయును శాంతించును.

ప్రియుఁడా! ఇంతవఱకు మేము మా ప్రేమను గృప ణుఁడు ధనమును దాఁచినట్లు గుప్తముగ దాఁచుకొంటిమి. మొదట మేము నిన్ను దూరమునుండి చూడఁగనే హృద యమునఁ బ్రేమ తరంగము లుబికెడివి. ఇది చాల పురా తన విషయము. అప్పటికి నీవు మమ్ముల నెఱుఁగవు కాని ఆమాటను మాత్ర మెట్లనఁగలము? నీవు సర్వజ్ఞుండవు. అంతర్యామివి. అందఱ హృదయములందలి విషయములను దెలిసికొనఁగలవు, నీవు శిఖి పింఛమును ధరించి, కట్టున నస్నపుమూఁటను గట్టుకొని వేణువు నూదుచు, గోవులను గాయుచు వానిని మేపుటకు వనములకుఁ బోవునపుడు మేము మా వాకిండ్లలో నిలుచుండి తదేకదృష్టితో నిన్నే చూచు

చుండెడివారము నీవు కంటికగపడకుండపోగానే, నిరాశను జెంది, యింటి పనులలో మునింగి యుండెదు వారము. కాని మనస్సుమాత్రము వ్రేలాడుచుండు నీబులాకుతోడనే ఊగుచు బోవుచుండెడిది. దాని తోడనే అల్లల్లాడు చుండెడిది. ప్రొద్దు వ్రాలగనే మేము నీకొఱకై వాంకిలిలో నిలుచుండినను, మిద్దెమీంద కెక్కినను దూరముగం జూచినను నీవావులను దోలుకొని వచ్చుట కనంబడెడిది కాదు. నిన్నుం జూడ కున్నచో మాకొక్కొక్క క్షణ మొక్కొక్క యుగముగం దోంచును. నీవు గోచారణమునకుంబోవుట మాకు కనంబడ కుండెనా మాకానాండేది మా గోల్పోయి నట్లుండును. ఆవశ్యకపు వస్తువును గోల్పోయినట్లుండును. ఇట్లు ప్రతీ క్షించుచుండగా మధురాతి మధురమగు వేణునాదము మా కర్ణకుహరములం దమృతమును గ్రుమ్మరించినట్లుండంగ మేము సమస్త గృహ కృత్యములను వీడి పరువెత్తుకొని వాంకిలి లోనికి వచ్చి నీ దర్శనము కొఱకు కనిపెట్టుకొని యుండెడు వారము. ఆ సమయమున స్కంధములవఱకును వ్రేలాడు చుండి నల్లగ నుంగరములు తిరిగిన కమలకావళిచే శోభించు నీ మృదుల ముఖారవిందమందలి మనోహర మందహాస శోభను గాంచుచుండిన ధన్యులమయ్యెడు వారము బ్రహ్మ యొక్క మూర్ఖతకుం గోపమువచ్చెడిది. ఈ బ్రహ్మకు

వృద్ధాప్యము వలన బుద్ధి లేదు. కనుకనే యీ కన్నులకు రెప్పలు పెట్టినాఁడు. రెప్పలుంచిన నింకెవరికైనను రెప్ప లుంచవచ్చును. నిరంతరము తదేకదృష్టిలో నిన్నే నీశోభనే గాంచు మాకీ రెప్పలవలన వ్యవధానమును గల్పింపనేల? ప్రొద్దు వ్రాలగనే గోపబాలక పరివేష్టితుఁడవై గోవుల వెను వెంట వచ్చినపుడు ధూళి ధూసరితమగు నీల కుంతలములతో నావృతమైన నీ మనోహర ముఖారవిందమును జూపి మా హృద్రోగము నుత్తేజితము కావించుచున్నావు. మాకు వ్యథను గలుగఁ జేసి నీవు గోష్టమందు ప్రవేశించెదవు. మేము వంచితలమై చిత్రలిఖిత ప్రతిమలవలె నచ్చటనే ద్వారమున నిలుచుందుము.

ప్రియుఁడా! ఆర్తినాశనా! వ్రజవల్లభా! నీవు గాన ప్రియుఁడవని మేము విన్నాము. నీకు గానమనిన నను రాగము. మాకు గానమును దెలియును. పాడి నిన్ను సంతోష పెట్టెదము సుందర తాళ స్వర లయాదులతో నీకు గానమును వినిపించెదము. మాకు గానమేదో కొంత తెలియును, కాని మా కర్ణములకును సంగీత శ్రవణరోగము పుట్టినది. నీ దివ్యగానమునకు మోహమును జెంది యీ కర్ణము లున్మత్తములైనవి. ఇవి మమ్ములను బలవంతముగ నిచ్చటికిఁ బ్రేరేపించి తెచ్చినవి. మేమును మా పతి పుత్ర

కుటుంబ, సోదర బంధు వర్గమునందు మోహమమతలను వీడి నిన్నే కోరి నీచరణసన్నిధికి వచ్చితిమి. ఇప్పుడు మేమింకఁ దిరిగి యాగృహాంధ కూపమునకుఁ బోఁదలఁచుట లేదు. ఇప్పుడు సమస్తజీవితమును నీచరణ సన్నిధియందే గడుపుటకు దృఢసంకల్ప మొనర్చితిమి. కపటీ! నిర్దయా! మేమింతగాఁ ద్యాగ మొనర్చి వచ్చితిమి. కాని నీవింత నిష్ఠురుఁడ వైతివేల ? ఎంత కాలమునుండియో మొఱఁ బెట్టుకొనుచుండ నీవు దర్శనమీయవేల ? ఇది బాగుండలేదు. నీవు రసశాస్త్ర మర్మజ్ఞుఁడవు కావని తోఁచుచున్నది. అరసికుఁడవు. నీవాలోచించుకొనుము. ఇట్టి యన్యాయ మేరసికుఁడైనను రమణుల యెడల నొనర్చునా ?

మే మొక్క విషయమడుగుచున్నాము. నీవీ శారదీయ రాత్రులందు వేణువు నేల యూఁదెదవు ? వంశీగానము నొనర్చుటయును దప్పేనా ? నాయిష్టము వచ్చినట్లు నేనూదితినని నీవనవచ్చును. నిజమే. వేణుగాన మొనర్చుట తప్పు కాదు కాని నీవనంగవర్ధనమును, గామినుల కామభావము నుద్దీపింపజేయు సర్వశ్రేష్ఠ కామోద్దీపక గానము నేల గావించితివి ? దాని పరిణామమేమో నీకు తెలియదా ? మేఘరంజని రాగమును బాడుటచే వర్షము కురియుట నిశ్చితము దీపక రాగమును బాడుటచే నారిపోవు దీపము వెలుఁగుట

యుచు ననివార్యమే. అదేవిధముగఁ గామోద్దీపక రాగమును బాడుటచే వ్రజాంగనలకు నిన్నుఁ గలిసికొను కోరిక కలుగుట స్వాభావికమే. ఎవని మనస్సులో సమాగమేచ్ఛ యుండునో ఆతఁడే కామోద్దీపక రాగమును బాడును. నీవు మమ్ములకు గలిసికొనుటకే గానమొర్చి ఏంకాతమునకు మమ్ము బిలిచితివి. మేమందఱమును నాగానమునకు వివశులమై నీచరణ సమీపమునకు వచ్చితిమి. మాకు నీవు దర్శన మొసంగి సంతోష పెట్టితివి. అది బాగుగానే యున్నది. కాని సర్వస్వమును ద్యజించి గృహ, కుటుంబ పరివారముతో సంబంధమును ద్రెంచుకొని. భయానక రాత్రియందు ఘోరవనమునకు వచ్చిన నీరమణుల నేకాంతమున విలపించుచుండ వదలి యే రసికుఁడు పోఁగలఁడు? ధర్మము నెఱింగినవాఁడు రమణేచ్ఛ కలిగిన రమణిని సాధారణ స్థితియందును బరిత్యజింపఁడు. ప్రియుఁడా! మాకు మాకు నీ విశాలవక్షఃస్థలము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. దానిలో మాహృదయమునకు స్థాన మొసంగుము. ఉబ్బెత్తుగ నుండిన నా వక్షఃస్థల సన్నిధి కావలయునను నుత్కంఠత చేతనే మామనోమయూరము మాటిమాటికిని మోహితమై నృత్య మొనర్చుచున్నది.

శ్యామసుందరా! నిన్నందఱును దుఃఖహరా! సుఖకరా! ఆర్తినాశనాయని యింకెన్నెన్ని విధములుగనో పిలుచు

చుందురు. మా దుఃఖములనేల దూరమొనర్పవు? మాకు దర్శనమేల నీయవు? మమ్ము నేడ్పించెదవేల? వనములఁ ద్రిప్పెదవేల? బాధించెదవేల? మృత్యువు లేకయే చంపెద వేల? నిష్ఠురతను జూపెదవేల? మమ్ముఁ బరీక్షించెదవేల? మేము స్వయముగఁ బరీక్షలో నెగ్గఁజాలము. నీవు కృపఁ జూపిననే ఏమైనఁ జేయఁగలుగుదుము. కావున ప్రియతమా! రమ్ము! రమ్ము!! ఇప్పుడింక వచ్చి వేయుము. ఇప్పుడింక దుఃఖపెట్టనలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ సుమధుర స్వరముతోఁ దాళలయయుక్త గీతములను బాడు కొనుచు భావమయలగు గోపికలు శ్రీకృష్ణుని దర్శనలాలసతో వెక్కి వెక్కి యేడ్చుచుండిరి. వారు తమ చివర యస్త్రమును విడిచిరి. అది యెన్నటికిని వ్యర్థమగునది కాదు.

# గోపికలమధ్య కృష్ణుఁడు ప్రత్యక్షమగుట

(౯౯)

శ్లో॥ తాసామావిరభూచ్ఛౌరిః స్మయమానముఖాంబుజః ।
పీతాంబర ధరః స్రగ్వీ సాక్షాన్మన్మథ మన్మథః ॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౨ అ. ౨ శ్లో॥

మ॥ అని యిట్లంగన లంచిత స్వరముతో సంకించుచుం బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్య మో
హనుఁడై మన్మథ మన్మథుండయి మనోజ్ఞాకారియై హారియై
ఘన పీతాంబరధారియై పొడమెఁ దత్కాంతా సమీపంబునన్॥

**శ్రీమదాంధ్ర భాగవతము.**

అనంతజీవు లనాదికాలమునుండి యీ భావాటవి యందు భ్రమవశమునఁ దిరుగుచున్నవి. వీరందఱును బ్రభున్ని అంశ లే, అంశికి దూరమైనామనుకొని, తమ ఏర్పాటు నంగీక రించి దుఃఖము ననుభవించుచున్నారు. వీరందఱు నెప్పుడో సంయోగసుఖము ననుభవించిరి. దాని నజ్ఞానవశమున మఱచిరి. అయినను నందఱ హృదయములందు గొన్ని సంస్కారములు శేషించి యున్నవి. అందఱు నా సుఖమును బొందఁ గోరుచున్నారు. అందఱును బ్రియతముని – అంశినిఁ – జేరఁ గోరుచుందురు. సంయోగ సుఖానుభవమును జెందఁగోరుదురు. కాని యా సుఖమును భ్రమవశమున సాంసారిక పదార్థములందు వెదుకుచున్నారు. వనమునఁ బోఁగొట్టుకొనిన లొట్టిపిట్ట డబ్బిలో నెట్లు చిక్కఁగలదు ? వనములోఁ

మ॥ అని యిట్లంగన లంచిత స్వరముతో నంకించుచుం
బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు
త్రైలోక్య మో
హనుఁడై మన్మథ మన్మథుండయి మనోజ్ఞాకారియై
హారియై
ఘన పీతాంబరధారియై పొడమెఁ దత్కాంతా
సమీపంబునన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

అనంతజీవు లనాదికాలమునుండి యీ భావాటవి యందు భ్రమవశమునఁ దిరుగుచున్నవి. వీరందఱును బ్రభుని అంశలే, అంశికి దూరమైనామనుకొని, తమ ఏర్పాటు నంగీక రించి దుఃఖము ననుభవించుచున్నారు. వీరందఱు నెప్పుడో సంయోగసుఖము ననుభవించిరి. దాని నజ్ఞానవశమున మఱచిరి. అయినను నందఱ హృదయములందు గొన్ని సంస్కారములు శేషించి యున్నవి. అందఱు నా సుఖమును బొందఁ గోరుచున్నారు. అందఱును బ్రియతముని – అంశినిఁ – జేరఁ గోరుచుందురు. సంయోగ సుఖానుభవమును జెందఁగోరుదురు. కాని యా సుఖమును భ్రమవశమున సాంసారిక పదార్థములందు వెదుకుచున్నారు. వనమునఁ బోఁగొట్టుకొనిన లొట్టిపిట్ట డబ్బిలో నెట్లు చిక్కఁగలదు? వనములోఁ

ముండినచో నాతఁడు రాఁగలఁడు. ఎవని హృదయము నవ
నీత కోమలముగ నుండునో వానికి మురళీధ్వని వినఁబడును.
ఆ మురళీధ్వనిని వినిన నింక నింటనుండఁజాలరు. అయోగ
దుఃఖముచేఁ జిత్తము చంచలమగును. అన్నిటిని వీడి
అత్యంత రుచికరమగు నాధ్వనియందాసక్త చిత్తమగుటచే
దానిననుసరించును. అంత మురళీగానలోలుని దర్శనమగును.
దర్శనము కాఁగానే ఆతనియందాసక్తి వృద్ధియగును. హృద
యమందాతని యెడలఁ బ్రేమభావము దృఢమగును.
సంయోగ స్వాదనము కలుగును. సంయోగసుఖాభివృద్ధికై
ఉత్కంఠతను వృద్ధిఁబొందించుటకై ప్రియతముఁడంతర్హితుఁ
డగును. ఇంతవఱకు అయోగజన్య దుఃఖముండెను. ఇంక
వియోగజన్య దుఃఖమధికమగును. దానిలోఁ బ్రియతముని
కరగించుటకే ప్రయత్నము జరుగును. ఆతని యన్వేషణమును
వనములఁ దిరుగవలసి వచ్చును. ఆతఁడు దొఱకనే దొఱ
కఁడు, ఆతనిఁ గలిసికొను నాకాంక్ష పరాకాష్ఠ నందు
కొనఁగా, దారులు చూచిచూచి గ్రుడ్లునిలిచిపోఁగా, క్షణ
క్షణము, ప్రతినిమిషము లెక్కించుకొనుచుండగా, కాళ్లరిగి
పోఁగా, పాడిపాడి కంఠము రుద్ధముకాఁగా, నామమును
గీర్తించి నాలుక కాయలు కాయఁగా, నింక నేడ్చుట తప్ప
యింకే సామర్థ్యమును లేకపోఁగాఁ నింకొక సాధన సహా
యము లేకపోఁగా శ్యామసుందరుఁడు నవ్వుచుఁ బ్రకట

మగును. ఏడ్చువారినిఁ గాంచినవ్వుటంత మంచి విష యము కాదు. కాకపోవచ్చును. ఈ ప్రేమ రాజ్యమున నన్నియును మంచి విషయములే. ఇందులోఁ జెడ్డ యనునది లేదు. ప్రేమతో నేడ్చుటయును మంచిదే నవ్వుటయును మంచిదే. శ్యామసుందరుఁడేమైనను సహింపఁగలఁడు కాని ఆతని దర్శన లాలసచే నెవరైన బిగ్గఱగ సుస్వరమున నేడ్చిరా దానిని సహింపఁజాలఁడు, ఎవరైనఁ గొంచెముసేపు కపట రోదన మొనర్చి, దొంగకన్నీళ్లను గార్చినచో వారికేదియో అల్పమగు వస్తువు నొసంగి తృప్తియొనర్చిపంపును. ఆతఁడు జీవుని విడువఁడు. ఎచ్చటికిని దూరముగఁ బోఁడు. ఆతని కత్యంత సమీపమున దాగియుండును. కాని జీవుఁడాతనిఁ జూడఁజాలఁడు. కన్నులకుఁ గాటుక పెట్టుకొని నప్పుడది కన్నులలోనికిఁ దాకినను గన్నులా కాటుకను జూడఁజాలవు. అశ్రువులతోఁ గలిసి అది బయటకు రావలయును అరచేతు లతోఁ గాటుక కలిసిన నశ్రువులను దుడిచినపుడు నల్లని యా కాటుక కనఁబడును. జీవుఁడు సంతసించును, కృత కృత్యుఁడు కాఁగలఁడు ఆతనితో రాస విలాస మొనర్చును. హోళీ నాడును, గాఢ గంభీరజలదమునుండి అమృతమును స్పృశించును. దానిలో నాతఁడు తడిసి నిమగ్నుఁడగును. మరల నొకసారి మహావియోగక్లేశమును సహింపవలసి వచ్చును. కాని యా మహావియోగమే నిత్యసంయోగసుఖ

జనకము. దానినిఁ బొందిన తరువాత మరల నెన్నటికిని వియోగము కలుగదు. నిత్యసుఖప్రాప్తి కలుగును. నిత్యరాస సుఖము లభించును. ఇదియే కృష్ణప్రాప్తికి సంక్షిప్త ప్రక్రియ, బిగ్గఱగా నేడ్వనిది కృష్ణుఁడు లభింపఁడు. తల్లి చిన్నపిల్లవాని నుయ్యాలలోఁ బరుడఁబెట్టి గృహకార్యములలో మునుఁగును. పిల్లవాఁడు కొంచెముగ నూఁ ఊఁ యనిన నామె పలుకక తనపనినిఁ దాను జూచుకొనుచుండును. ఇంక బిగ్గఱగ నేడ్చినా శీఘ్రముగ వచ్చి వానికి తీపి మిఠాయిల నొసఁగి, ఆటవస్తువుల నొసంగును. వానినిఁ గైకొని యేడ్చుటను మాని ఆడనారంభించును. తల్లి మరలఁ బనులలో మునుఁగును. ఆ పిల్లవాఁడా మిఠాయీలను, ఆటవస్తువుల నావలఁబాఱవైచి యేడ్చుచుండినచోఁ దల్లి వచ్చి వానినిఁ గౌఁగిలించుకొని, తియ్యని అమృతోపమానమగు దన స్తనపానము నొసంగును. దానితోఁ దృప్తియగును. కావున నో జీవులారా! మీరు నవజలధరశ్యాముఁడగు గుటిల ధూర్త గోపాలునిఁ బొందఁదలఁచినచో నేడ్వుఁడు. నిరంతర మేడ్వుండు. ఆటవస్తువులను బాఱవేయుఁడు. చక్కెర, నేయి, ఉప్పు, కారము మొదలగు రసరూపములగు మిఠాయిలను బాఱవేయుఁడు. తల్లి, తండ్రి, పతి రూపుఁడగు శ్రీకృష్ణుఁడు నవ్వుచు నవ్వుచుఁ బ్రకటమై

నీతో రాసకేళి సల్పును. ఏడ్చు శక్తియును శ్యాముఁడే యొసఁగును. అభాగ్యులమగు మన మేడ్వఁజాలము.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలు గీతములను బాడిపాడి యలసిరి; కాని శ్రీకృష్ణుఁడు వినివిని విసుగును జెందలేదు. ఆతఁడెచ్చటనో దూరమున దాగియుండ లేదు. రసమయులగు గోపికలనువీడి ఆతఁడు పోవుదమను కొన్నను బోఁజాలఁడు. ప్రేమ ఒక్కరివలనఁ గలుగునది కాదు. ఇరువైపులను నాకర్షణము కలుగును. శ్రీకృష్ణుఁడు రసికులలోఁ దక్కువవాఁడుకాఁడు. ఆతని వైపున కెవఁడైన నొక్క బారను జాపిన నాతఁడీతని వైపునకు నూఱుబారలను జాచును, గోపికలెట్లాతని రూపమునం దాసక్తినిఁ జెందిరో ఆతఁడును నా గోపికల ముఖకమల భ్రమరమైనాఁడు. ఆతఁడు వారికి సన్నిహితుఁడుగనే యుండెను. ఆతఁడు పీతాంబరమును దాచి చీరెను ధరించెను. ఆతనికి సిగ్గు బిడియములు లేవు. నలుగురు నవ్వెదరను నభిమానమును లేదు. ఆడుదయ్యెను. తన్మయుఁడయ్యెను. గోపికలు తమలో వెదుకుకొనుట లేదు. ఆతని గుణములను గానము చేయుచుండిరి. తమ గుణగానమందఱకును ప్రియముగనే యుండును. 'స్తోత్రం కస్య నరోచతే' స్తుతి యెవరి కిష్టముగ నుండదు. శ్రీకృష్ణుఁడు వినుచునే యుండెను. మెదలకుండెను. ఊఁ అనలేదు, ఆఁ అనలేదు, తన యునికినిఁ దెలుపలేదు.

తన జాడను దెలుపలేదు. మొదలకఁ గూర్చుండి శ్యామ సుందరా, కితవ, ధూర్త, కపటీ, ఆర్తిహరాది సంబోధనను వినుచుండెను. వారు పాడిపాడి అలసిపోఁగా, దర్శనలాలసచే వెక్కి-వెక్కి యేడ్చుచుండఁగా నాతఁడు దూరమున నుండి రాలేదు. ఆ గోపికల మధ్యనుండియే ప్రకటమయ్యెను. అందఱు నాశ్చర్యపడిరి. సమస్త శోక సంతాపములు దూరములయ్యెను.

ఆ సమయమున శ్యామసుందరుఁడు తన సౌందర్య ధనము నంతను దనమీఁద వైచుకొని వచ్చెను. లేక గోపికల యుత్కంఠత ఆతనికి శృగార మొనర్చినదేమో! ఏమైనఁ గానిండు శ్యామసుందరుఁడా సమయమున సుందరాతి సుందరుఁడుగను, అతిశయ సుందరుఁడుగను వేషమును వైచుకొని యుండెను. కోటి కందర్పదర్ప దళన దయితుఁడగు దామోదరుఁడు మధుర మందహాసమయ ముఖారవిందముచే మందహాస మొనర్చుచుండెను. ఆతఁడు తళతళ మెఱయుఁ బీతాంబరమును ధరించి యుండెను. మోఁకాళ్లవఱకు వ్రేలాడు పంచరంగులుగల వనమాలను ధరించెను, ఆమాల కదలి కదులుచు, గృష్ణుని యూరువులను, వక్షఃస్థలమును మాటి మాటికిని స్పర్శించుచుఁ దన సౌభాగ్యమునకు గర్వించుచుండెను. ఆడుచుండెను. ఊఁగుచుండెను. గోపికలకుఁ గోప

మును దెప్పించుచుండెను. వారి హృదయములందు హఠ పూర్వకముగ సాపత్న్యభావము నుత్పన్నము కావించు చుండెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! హటాత్తుగఁ బ్రియతముఁడు తమ మధ్యనే మందహాసమొనర్చుచుండుటను గాంచఁగనే గోపికల హృదయమునందు ప్రేమతరంగములు లేచెను. వారికి భరింపరానంతటి ఆనందము కలిగెను, వారి యావేగమును సంబాళించుకొనఁజాలకపోయిరి. వెంటనే అందఱును సంభ్రమముతో లేచి నిలుచుండిరి. మృతదేహము లోనికి మరలఁ బ్రాణములు వచ్చినచో నిశ్చేష్టములగు నింద్రియములు మరల నొక్కసారిగాఁ దమతమ పనుల నొనర్చునట్లు, ఇంతవఱకును వాడియుండిన వారి ముఖముల మీఁద నానందోత్సాహ ప్రేమానురాగచేష్టలు స్పష్టముగఁ గనఁబడు చుండెను. సంకుచితమైన వారి మనముకురము వెంటనే శ్రీకృష్ణచంద్రుని దర్శనము చేవికసించెను. అత్యంత క్షుధార్తిచేఁ గుందువానికి సమ్ముఖమున స్వాదిష్టములగు నాహారపదార్థముండిన వానిమీఁద బడినట్లును, అత్యంత దప్పికను జెందినవాఁడు స్వాదిష్టములగు మధుర జలములు లభింపఁగనే అంజలిపుటములచేఁ ద్రావినట్లును, ఇనుపసూది సూదంటు రాతినిఁ జూడఁగనే అంటుకొనునట్లును, సూర్యుఁ డుదయింపఁగనే చక్రవాక మిథునము కలిసికొనునట్లును,

కృపణుఁడు, పోఁగొట్టుకొనిన ధనమును మరలఁబొందిన నెంతటి యానందమును జెందునో అట్లే ఆనందమున నా గోపిక లాతని గట్టిగాఁ బట్టుకొనిరి. ఆతఁడు మరలఁ బారి పోకుండునట్లుగఁ బట్టుకొనిరి. ఆ సమయమున వారికి విచిత్ర మగు స్థితి కలిగెను, వారి శరీరమంతయును రోమాంచిత మయ్యెను, ప్రేమావేగమున వారి శరీరములు కంపించు చుండెను. వారు గడగడ వణఁకుచుండిరి. ప్రియుని సంస్ప ర్శించుటచే హృదయముప్పొంగుచుండెను. శరీరమంతయును బులకరించుచుండెను. ఇంద్రియములన్నియును రసపాన మొనర్పఁ దలంచుచుండెను. ప్రపంచమున నే ప్రియుని సుఖ స్పర్శ ప్రాప్తించవలఁనో అది లభించిన నింకఁగావలసిన దేమియుండును? ప్రియుతముని స్పర్శ లేనివాని జప, తప. యోగానుష్ఠాన, ధారణ, ధ్యాన,సమాధి మొదలగు సాధన ములు వ్యర్థములే. నిరర్థకములే యగును. గోపికలు తమ హృదయ ధనమును బొంది పరమ ప్రముదితలైరి. సఖులైరి. ఆనందితలైరి. వారు శ్యామసుందరుని సంయోగ సుఖము నేవిధముగ నాస్వాదించిరో ఆ వర్ణనమును జేయుటకు నాకు శక్తి లేదు. యోగ్యతయును లేదు. అయినను జెప్పెదను. మీరు వలదన్నను మారుకొనను. ఏలననఁగా దానిని స్మరించుటయే జీవున కైకైక పరమాతి పరమ పంచమ పురు షార్థము.

# శ్యామ సంస్పర్శ జన్య సుఖము

(౮౯౦)

శ్లో॥ సర్వాస్తాః కేశవాలోక పరమోత్సవ నిర్వృతాః ।
జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథాజనాః ॥
శ్రీభాగ. ౧౦ స్కం. ౩౨ అ. ౯ శ్లో॥

క॥ హరి సురుచిర లలితాకృతిఁ
దరుణులు గని ముక్త విరహ తాప జ్వరలై
పరమోత్సవంబు సలిపిరి
పరమేశ్వరుఁ గనిన ముక్త బంధుల భంగిన్ ॥
శ్రీమదాంధ్ర భాగవతము,

సుఖానుభూతి మనస్సుచే నింద్రియములద్వారా కలుగును. చేతులు, కాళ్లు, వాక్కు, గుదము, శిశ్నము, అను నీ యైదింద్రియములచేఁ గర్మలొనర్పఁబడును. అందువలన వీనినిఁ గర్మేంద్రియములందురు. కన్నులు, చెవులు, నాసిక, జిహ్వ, చర్మము అను నీ యైదింద్రియములద్వారా విషయ జ్ఞానము కలుగును. అందువలన వీనిని జ్ఞానేంద్రియములందురు. ప్రపంచమునఁ బృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము ఇవి పంచభూతములు. సమస్త ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితులు వీనివలననే జరుగును. అందువలన నీ జగత్తు

పాంచభౌతికము, ప్రపంచమని పిలువఁబడుచున్నది. ఈ పంచ భూతములకును గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము ఈ యైదును వీని గుణములు. ఈ యైదింటి ద్వారముననే పంచేంద్రియములచే జీవుఁడు సుఖదుఃఖముల ననుభవించును. సుగంధ దుర్గంధములయొక్క జ్ఞానము నాశికవలన జరుగును. రసము జిహ్వావలనను, రూపము చక్షువుల వలనను, శబ్దము కర్ణముల వలనను, స్పర్శము చర్మమువలనను జరుగును, శబ్ద, రూప, రస, గంధములను నాలుగు విషయముల ఉప భోగము శరీరమందలి ఒక్కొక్క అంగముచేఁ గలుగును, శబ్దమును గర్ణములే వినును. కాని కన్నులు శబ్దములను వినఁ జాలవు. బాగుగాఁ జెవులను మూసికొనినచో శబ్దమగు చున్నను శబ్దమును వినఁజాలము. అట్లే రూపములను గన్నులే చూడఁగలవు. కన్నులను మూసికొనినచో సుందరసుందర వస్తువు లెదురుగ నున్నను గనఁబడవు. కన్నులను రసాను భవమును రసనయే చేయఁగలదు. ఎంతటి స్వాదిష్ట పదా ర్థమునైనను గన్నులలోఁ బెట్టుకొనినను, చెవులలోఁ బెట్టు కొన్నను దానిరుచి తెలియదు. సుగంధ, దుర్గంధములు నాసికవలననే తెలియును గట్టిగా ముక్కులు మూసికొనినచో నా సుగంధ దుర్గంధములను దెలిసికొనఁజాలము. ఇంతకు సారాంశ మేమనఁగా శరీరములోనొక యింద్రియముచేనొక్క విషయమే తెలియఁగలదు. ఒక గోళకముచే దానికి సంబంధిం

చిన విషయమును గ్రహింపవచ్చును. చేతులతో రెండు కన్నులుమూసికొనినచో నేమియునుగనఁబడదు. ఏలననఁగాఁ జూచుశక్తి శరీర ఛిద్రములన్నిటిలో లేదు. లలాటమునకు గ్రింద రెండు నల్లని కుటిల భ్రుకుటులుకలవు. వానిక్రింద రెండు ఱెప్పలుకలవు. ఆ రెప్పలలో దాగి రెండు ఛిద్రములు కలవు. వానిలో రెండు మెఱయుచుండు గ్రుడ్లుకలవు. నాసిక ఆ రెంటిని విభాగించుచున్నది. ఒకటి కుడికన్ను, రెండవది ఎడమకన్ను. ఒక గట్టు రెండు చేలను విభాగించు నట్లు రెండు కన్నులకు ముక్కు గట్టుగనున్నది. ఆ కన్నులకు పైననొక ఱెప్ప, క్రిందనొక ఱెప్ప. ఈ ఱెప్పలు రెండు నేత్ర రూపమగు నింటికి రెండు తలుపులవలె నున్నవి. ఱెప్పలను గొట్టినను నేమియును గనఁబడదు. నాలుకకు తలుపులు పెదవులు. ముక్కులును జెవులును దలుపులులేని యిండ్లు, వీనినిఁ జేతులతో మూయవచ్చును. ఏలననఁగా నీ ఛిద్రములు శరీరమున కొక మూల నున్నవి, చిన్నవి. పరిమితములు. ఈ నాలుగు జ్ఞానేంద్రియముల నుపభోగించుటకు శరీరమందు చాల కొద్ది సంకుచిత స్థానమున్నది; కాని స్పర్శేంద్రియము సమస్త శరీరమునఁ దన యధికారమును స్థాపించు కొన్నది. కాలి చివర వేలిపై జీమ ప్రాకినచో వెంటనే స్పర్శేంద్రియము మనస్సునకుఁ జెప్పును. కన్నులు, చెవులు, ముక్కు, నోరు, చేతులు, కాళ్లు, మర్మేంద్రియము, గుదా, నాభి, హృద

యము ఇంతయేల శరీరమున స్పర్శేంద్రియము వ్యాపింపని స్థలమే లేదు, మంచుగడ్డ కఱగిన నీరును ద్రాగుము. నోటి నుండి ఉదరము వఱకును జిల్లుమనచుంబోవును. స్పర్శేంద్రియము దాని గుర్తును జెప్పును. పాలలో ఘృతము వ్యాపించి నట్లు శరీరమంతటను లోపలను బయటను స్పర్శేంద్రియము వ్యాపించియున్నది. శరీరమున నేయవయవమునుండి స్పర్శేంద్రియము పోవునో అది వ్యర్థమగును. దానిని పక్షాఘాత మందురు. చేయి అట్లే యుండును. స్పర్శేంద్రియముపోయెనా చేయి యుండినను వ్యర్థమే. పనినిఁ జేయఁజాలరు. అందు వలన నన్నియింద్రియములలో స్పర్శేంద్రియమే వ్యాపకమైనది. శ్రేష్ఠమైనది. చాలామంది అంధులు చేతితో స్పర్శించి దాని రంగును జెప్పఁగలుగుచున్నారు. రతిసుఖాదులలో స్పర్శయే లేకున్నచో రతి సుఖముండనే యుండఁజాలదు. ఈ యింద్రియము లన్నియును స్పర్శేంద్రియ సహాయతను గొనవలయును. పాట యొక్క ధ్వని హృదయమును స్పర్శింపనంతవఱకు నీవు కర్ణములతో నెంతవిన్నను రసము రాదు ఆ గానము హృదయమును స్పర్శించిననే సుఖము 'హృదయస్పర్శగానము జరిగిన'దని లోకులనుచుండ వినుచుందుము. ''వీని మాటలు గొప్పమర్మస్పర్శను గలిగించును.'' యోగులును బ్రహ్మానంతఃకరణము స్పర్శించుచుందురు. ''బ్రహ్మసంస్పర్శ మశ్నుతే' అందురు. స్పర్శిం

చుటచేఁ బ్రేమ మిక్కిలి వృద్ధియగును. గోవులు తమకుఁ బుట్టిన బిడ్డను పుట్టఁగానే దాఁకును అది నాఁకిన కొలఁది దాని ప్రేమ వృద్ధియగును. ఈ రోజులలో భౌతిక వాదులు ప్రసవించు గోవు కన్నులకు పట్టీనిఁ గట్టుదురు బిడ్డ పుట్టఁగనే గోవును నాకనీయరు. దూడను బొదుగును దాఁకనీయరు. వేఱుగాఁ దీసికొనిపోయి పెంచి, యింకొక గోవుపాలను త్రాపించెదరు. దీనివలనఁ దల్లికి పిల్లమీఁదను బ్రేమ యుండదు. ఏలననఁగా బ్రేమస్పర్శచేతనే వృద్ధియగును. తల్లులు పిల్లలను స్పర్శింపక, తమ స్థనముల పాలీయకుండి నచో వారికి పిల్లల మీఁదఁబ్రేమ పెరుగదు. పిల్లల నెంతగా వడిలోనికిఁ దీసికొని అన్నము బెట్టి, ముఖమును ముద్దుబెట్టుకొనిన నంతగాఁ బ్రేమవృద్ధియగును. శరీరమంత టను దాకుటకంటె ముఖమును దాకినచోఁ బ్రేమ అత్యధి కముగ వృద్ధినిఁ జెందును. అందువలనఁ బిల్లలను బ్రేమించు నపుడు మాటిమాటికి వారి ముఖమును ముద్దుబెట్టుకొందురు. తల్లులెప్పుడును బిల్లలముఖము దమ ముఖమునకు హత్తు కొందురు. నిద్రించునపుడును వారి ముఖమున ముఖమును బెట్టి నిద్రించెదరు. ఎవరెంత రుగ్ణతగా నుండినను దల్లి దండ్రులు వారి ముఖముమీఁద ముఖమునుబెట్టి నిద్రించెదరు. అప్పుడు రోగియగు పిల్లవానికి సుఖము కలుగును. మనకు గురుని పాదముమీఁద శిరమునిడి పడియాడిన నెంతటి సుఖ

ముందునో అనుభవమేకదా! పిల్లలు తల్లి యొడిలో నేల కఱచుకొని కూర్చుందురు ? వారు భూమిమీఁదఁ గూర్చుం డరు, వడిలోనే కూర్చుండెదరు. నిద్రించిన వడిలోనే నిద్రిం చెదరు. ఏలననఁగా వారికి దల్లితండ్రుల శరీరముచు స్పర్శిం చుటచే నత్యధిక సుఖము కలుగును. శృంగార రసమందును నంతే పరస్పరము రూపముచు జూచుటచేతను. శబ్దమును వినుటచేతను, పరస్పరము శరీరగంధమును వాసన చూచుట చేతను సుఖము కలుగును. కాని స్పర్శింపకుండినచో సుఖ మంతయును వ్యర్థమే యగును. కావున రస శాస్త్రమున స్పర్శసుఖమే సర్వశ్రేష్ఠ సుఖముగఁ జెప్పఁబడినది. ప్రియుని స్పర్శలో నెంతటి సుఖము కలదో నది వాక్కుల కందనిది. చెప్పుటచే దాని మహాత్త్యము తగ్గును. చెప్పఁజాలరు కూడాను. ప్రేమసాధనకు చరమ లక్ష్యము ప్రియుని స్పర్శిం చుటయే. ప్రియుఁడు మనలను స్పర్శించుటయును, ప్రియుని మనము దర్శించుటయును నొక్కటే. తాకు తాకనుటయును, దూరదూరమున నుండుమనుటయును నియమ విషయములు. సమాజ వ్యవస్థలో నియమము లవసరములే. కాని ప్రేమలో నియమముండదు. ప్రేమ యొక్క లక్ష్యము ప్రియునిలోఁ గలియుటయే. తన శరీరము నాతని శరీరమునఁ గలిపి ఏకము కావించును. ఏకత్వము లేనిచోట అద్వైతము లేనిచోట - సుఖము లేదు. శాంతిలేదు. రసానుభూతి లేదు. అచ్చట

భయముండును. ఏకత్వములోనే సుఖము కలదు. ఏకత్వము లేక బ్రహ్మస్పర్శ యెట్లు కలుగఁగలదు చిరకాల ప్రతీక్షా నంతరమునఁ బ్రియుని స్పర్శలభింపఁ జేసికొనినవారు ధన్యులు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శ్రీకృష్ణుఁడు హఠాత్తుగఁ దమమధ్య ప్రత్యక్షముకాఁగానే గోపికలందఱు నేడ్పుటను మఱచిపోయిరి. ఆతని సందర్శించుటకు వారు పరు లిడిరి. మృదువులును, గోమలములునగు గెందామర రేకు లను దిరస్కరించు దమకోమల కరములచే నాతని కర కమలములను బట్టుకొని, ప్రేమకోపమున నిట్లనెను:- "మోసగాఁడా! ధూర్తుఁడా! కితవా! ఇప్పుడింక నెట్లు తప్పించుకొని పోఁగలవో చూచెదనుగాక!

ఇంకొక సర్పశరీరమువలె బలిసి, నునుపై చందన చర్చితమగు భుజములను దన భుజముపై వైచుకొని, తన బాహుపాశముచే బిగించి యిట్లనెను:- "ఇఁకనీవు మమ్ము లను వదలి పోవుగదా!"

ఒకర్తుక యిట్లనుకొనెను:- "అన్నిటికంటె నధిక స్పర్శశక్తి జిహ్వయందు గలదు. ప్రియుని జిహ్వకుఁ దగిలిన వస్తువినా జిహ్వకులభించినచో నీ జిహ్వయొక్క తపన తీరి పోవును. శ్రీకృష్ణుఁడు మందహాసమొనర్చుచుం దమలమును నములుచుండెను. ఆమె దోసిలిపట్టెను, తన యుచ్ఛిష్టము

నితరుల కొసంగుట నిషేధమైనను, ఎవని యుచ్ఛిష్టమైనను దినుట పాపమైనను భగవానుని యుచ్ఛిష్టము నుచ్ఛిష్టమను వాఁడు మహాపాపి యగును. భగవంతుఁడుచ్ఛిష్టమొనర్పక ఆతనికి నివేదింపక తినినచోఁ బాపమును దినుటయే యగుచున్నది. పురుగులనుదినుచున్నట్లే యగుచున్నది. తనభక్తురాలును అనురక్తయునగు గోపికయొక్క అంజలినిఁగాంచి సగము నమలిన తాంబూలమును శ్యామసుందరుఁడామె యంజలి యందుమిసెను, ఆమె యాయధరామృత ఉచ్ఛిష్ట తాంబూలమును దిని ధన్యయయ్యెను.

ఒకర్తుక హృదయమందు మిక్కిలి బాధ కలుగుచుండెను అచ్చటనుండి అగ్నిమంటలు రేగుచున్నట్లుండెను. దాని కిప్పుడే యౌషధమును వేయవలయును. శ్యామసుందరుఁడు కాళ్లు చూచుకొని కూర్చుండియుండెను. శరచ్ఛీతల సైకతములో దిసికాళ్లతో వచ్చియుండెను. కాళ్లు కొంగరులు వోవుచుండెను. హిమకణములలో నడచినట్లుండెను. ఆమె వానినిఁ దీసికొని తన ఱొమ్ముమీఁదఁ బెట్టుకొనెను. ఆమె సంతప్త హృదయము శీతలమయ్యెను. అత్యంత కోమలవస్తువు చల్లనిదియుం మధురమైనదియునగుచో నది హృదయమున గీటు గీయుచు పిస్తా, కుంకుమపువ్వు కలిసిన మీఁగడ మంచుగడ్డ దంత

ములను గదలించుచు నోటిని శీతలముగను, మధురముగ నుల్లాసమును గలిగించుచు హృదయమును హర్షితమొనర్చు నట్లు మిక్కిలి సుఖమును గలిగించును. కమలములకంటె నధికకోమలములగు చరణములయొక్క సుఖద, శీతల స్పర్శచే నాగోపికయొక్క చిత్త చాంచల్యము వీడిపోయెను.

ఒకానొక గోపిక తన ప్రియునిపై ప్రణయ గోప మును ప్రదర్శించుచుండెను. సైగలతో సంకేతమొనర్చుచు భ్రుకుటి రూపమగు ధనుస్సుపైఁ గటాక్షరూపములగు బాణ ములనెక్కిడి, తన దంతములచేఁ దన క్రిందపెదవులను గఱ చుచు, కోరచూపులు చూచుచు. సగముగ నుండిన మేలి ముసుఁగునుండి బాణములను విసురుచుండెను. వ్యాధినివలె వనమాలిని వేధించుటకు తదేక దృష్టితో నాతని చూపు లను దన చూపులు కలుపుచుండెను.

ఒక గోపిక ఆఁకలి దప్పికలను జెందిన అనాథయును, దీనయునగు నబలవలె శ్రీకృష్ణముఖారవిందపాన మొనర్చు టకు తదేకభావమున నాతనివైపు భక్తగణము భగవంతుని చరణకమలములను గాంచుచు నాత్మవిస్మృతిని జెందినట్లాత్మ విస్మృతిని గాంచుచుఁ జూచుచుండెను.

ఇంకొక యామె యిట్లనుకొనెను:- "అంతస్స్పర్శలో నున్న సుఖము బాహ్యస్పర్శలో లేదు. కావున నామె

ఆమోహామున మాధురీ మనోహర రూపమును కనుపాపల ద్వారా తనయంతఃకరణములోనికిఁ గొనిపోయి, మరల నా చోరుఁడెచ్చటికిఁ బారిపోకుండునట్లు కనురెప్పలను గవాటములను మూసికొనెను, హృదయాంతరాళమునకుఁ గొనిపోయి, ఆతని గట్టిగా దృఢాలింగన మొనర్చుకొని యిట్లనెను:- "చెప్పుమిప్పుడెట్లు తప్పించుకొని పోఁగలవో? నేను నాయంతఃకరణమును జీఁకటి కొట్టులో నాభుజములను రజ్జువుచే గట్టిగ బిగించి బంధించితిని. చోరశిరోమణీ! చాల రోజులకుఁ జిక్కితివి. ఇంక నీయాటలు సాగవు," ఇట్లు శ్రీకృష్ణుని మానసికాలింగన మొనర్పఁగా నామె రోమములు నిక్కఁబొడిచెను. ఆమె యోగినివలె సమాధియందు నిమగ్నయై యీ ప్రపంచమును మఱచిపోయెను. ఆమె పరమానందమునఁ దదాకారయయ్యెను. తన్మయయయ్యెను.

సూతుఁడిట్లనెను: మునులారా! మహాభాగ్యవతులగు నాగోపికల దివ్యాతిదివ్య పరమానందోల్లాసమును వర్ణించుటకు నావద్ద శబ్దములు లేవు. వారి సౌభాగ్యములను వర్ణించి చెప్పుటకు నావద్ద నుపమానము లేమియును లేవు, మీ యెదుట నుంచుటకు నాకట్టి యనుభూతి లేదు. ప్రియుని దర్శన, స్పర్శన, ఆలింగనములను బొంది వారు సిద్ధులు సిద్ధులను బొందినట్లును, దప్పికచేఁ జావఁబోవువానికి జలమబ్బి

నట్లును, ఆఁకలిచే బాధపడువాని కన్నములభించినట్లును, చలిచే బాధపడువారి కగ్నిలభించినట్లును, నీటిలో మునిఁగిన వానికి నావచిక్కినట్లును, సంసారతాపముచే బాధపడు ముముక్షువునకు శ్రోత్రియుండును, బ్రహ్మనిష్ఠుఁడును నగు గురువులభించినట్లు పరమానందము కలిగెను. ఆతని రూపాసవ మును నొక్కసారిగా బానమొనర్ప వలయుననియును, ఆతని మాధుర్యమును నాలుకద్వారా నాకివేయవలయుననియు గోరుకొనుచుండిరి. ఆతఁడు సదా హృదయమున కంటుకొని యుండవలయుననియు, నెన్నటికిని దూరముకాఁగూడ దనియు, నిరంతర మాతనిచే చూచుచుండవలయుననియు, సదా యిదే విధముగ తమ దగ్గఱనే కూర్చుండవలయు ననియు, నెన్నటికిని నచ్చటినుండి పోఁగూడదనియు, నెల్లప్పు డును దమ వైపునకుఁ జూచుచు మందహాస మొనర్చుచుండ వలయునను కొనుచుండిరి.

ఈ విధముగ నా గోపికలందఱును నాబోతును జుట్టు కొని గోవులున్నట్లును, కుబేరుని జుట్టుకొని యక్షకన్యలున్న ట్లును, సంకర్షణుని జుట్టుకొని నాగకన్య లున్నట్లును, పురాణ పురుషుఁడగు బరమాత్మను జుట్టుకొని శక్తులున్నట్లు శ్యామ సుందరుని జుట్టుకొని వ్రజవనితలు శోభించుచుండిరి.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! తర్వాత నేమైనది?

సూతుఁడిట్లనెను:- "స్వామీ! తర్వాత నేమైనదో దానిని వర్ణించుటకు నావద్ద శక్తిలేదు. మీపాదములు ముట్టి ప్రార్థించుచున్నాను. మీరిప్పుడేమియును నన్ను అడుగ వలదు. నేను చెప్పఁజాలను."

శౌనకుఁడుత్సాహముతో నిట్లనెను:- "సూతా! అట్లానర్పకుము. అది మంచిది కాదు. ఎంతగాఁ జెప్పఁగలవో అంతే చెప్పుము. భగవంతుని చరిత్ర అపారము. దాని నెవరు సమగ్రముగ వర్ణింపఁగలరు? సరే, దర్శన స్పర్శనము లైనవి, దర్శన స్పర్శనానంతర మేమైనదో దానినిఁ జెప్పుము."

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ! దర్శన స్పర్శ నానంతర మేమగునో మీరే చెప్పవలయును."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! మేము నీరసులము. స్వాహాస్వాహా అని పలికి పలికి మారక్త మాఱిపోయినది. కన్నులలో యజ్ఞధూమము నిండినది, ఈ రసవత్తమమగు కథను విని మా హృదయములు పచ్చబడినవి. ఇదియే మా భాగ్యమనుకొనుచున్నాము, నీవే చెప్పుము తర్వాత నేమైనదో?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! మనకత్యంత ప్రియుఁడైనవాఁడు దూరమునఁ గనఁబడినచో నాతని వైఖరిచే నవ శ్యమాతఁడేనని యూహించెదము, రాఁగానే ఆతనిఁ జూడఁ

గానే అంగప్రత్యంగములానందమున నుప్పొంగును. పరుగిడి పోయి ఆతని చరణములం బడెదము. పాదములను బట్టు కొందుము. పాదములనంటి ఆతని అంగస్పర్శను గావించి సుందరమగు నాసనమునఁ గూర్చుండఁబెట్టుము. తర్వాత మధురములగు ప్రేమ ప్రసంగములు జరుగును. అనురాగ విషయములను, వ్యంగ్యభరితములగు పరియాచకములును జరుగును. అట్టివే కృష్ణునకును గోపికలకు మధ్య జరిగినవి. మునులారా! నేను వాని వర్ణన మొనర్పఁజాలను. నన్ను వివశునిఁ గావింపవలదు. ఏదో సంకోచమునఁ గొలఁదిగఁ జెప్పుదును. నా కథన మసంపూర్తిగనే యుండును. కాని యెట్లున్నను మీరందఱును సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.”

—॥—

# వ్రజ వనితల వ్యంగ్య ప్రశ్నలు

( ౯౯౧ )

శ్లో॥ భజతాఽను భజన్తేక ఏక ఏత ద్విపర్యయమ్ ।
నోభయాశ్చ భజన్త్యేక ఏతన్నో బ్రూహి సాధు భోః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౨ అ. ౧౬ శ్లో॥

కం॥ కొలిచినఁ గొలుతురు కొందఱు
గొలుతురు దముఁ గొలువకున్నఁ గొందఱు పతులం
గొలిచినను గొలువకున్నను
గొలువరు మఱికొంద ఱెలమి గోపకుమారా ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

జీవుఁడు ప్రియుని దర్శనము కొఱకు తిరుగుచున్నాడు. ఏవిధముగానైనను ప్రియుఁడు లభించెనా జీవనము సార్థకమగును. ప్రియుఁడు లభించినపుడు ఆస్థితి విచిత్రముగనుండును. ప్రియుఁడు కనఁబడిన తరువాత నట్లు మాట్లాడెదను, ఇట్లు మాట్లాడెదనని చిరకాలమునుండి అనుకొనినవారప్పటి కన్నిటిని మఱచి పోయెదరు. ప్రియునెట్లు సంతోషపెట్టవలయునో, ఎట్టి అనురూపమగు నాసనమును వేయవలయునో, ఏమి పెట్టవలయునో, ఆతనికి స్వాగత సత్కారము లెట్లు చేయవలయునో యేమియును దోచదు. ఆతని పాదములకు ముండ్లు గ్రుచ్చుకొనకుండుటకై కనురెప్పలను బఱచవలయునని యుండును హృదయకమలమును దీసి ఆసనమును బఱచవలయునని యుండును. అధరామృతము నొసంగి ప్రియుని దప్పికను దీర్పవలయునని యుండును. ఆ సమయమున మాటలాడఁ దలఁచున దొకటియును, మాటలాడున దొకటిగ నుండును. శరీరస్థితి విచిత్రమగును. అది

చెప్పఁదగిన స్థితిగానుండదు. అనుభవగమ్యమైనది. ఇదివఱ కెన్నడును ప్రియాగమనమునఁ తన సర్వస్వము నర్పించి స్వాగత సత్కారము లొనర్చని వారి స్థితి యెట్లుండుననఁగా రెండు మూఁడు సంవత్సరముల బాలికా సమ్ముఖమున సుర తసుఖమును గూర్చి చెప్పుట యెట్లుండునో అట్లుండును. ప్రియుఁడు కలిసినప్పుడు దర్శనస్పర్శనములైన తరువాత సంభాషణము జరుగును, ఆమాట లర్థములేనివిగ నుండును. వాని కన్నిటికి నొక్కటియే యర్థము. నీవెంతగా నన్ను ప్రేమించుచున్నావనిన, దానికిఁ బ్రత్యుత్తరముగ నీప్రేమ భారమును నేను భరింపలేను. ఋణపడియున్నాననును. ఈ విషయములను వివిధములఁ జెప్పుచుందురు, నేయి, పిండి, పంచదార ఈ మూఁటిచే వివిధములగు మిఠాయిలు తయా రగుచుండును.

సూతుఁడిట్లనెను:- ''మునులారా! సఖుల మధ్య శ్యామసుందరుఁడు ప్రత్యక్షమైన స్థానము యమునకుఁ గొంచెము దూరమున నున్నది, ఏకాంత క్రీడకై సలిల సాన్ని ధ్యమున; యమునాపావన పులినము నావశ్యకమగును. అందువలనఁ బ్రియుల భుజములపైఁ జేతులను వేసికొని శ్యామసుందరుఁడా స్థానమునుండి బయలుదేరి ప్రకృతినిర్మిత రాసస్థలి దగ్గఱకు - యమునా తటమునకు వచ్చెను. తమ ముఖకాంతులచే దశదిశలను బ్రకాశింపఁజేయుచు నీలాకాశ

మునఁ బూర్ణచంద్రునిఁ జుట్టుకొని యుండిన తారకలవలెను, కమలకర్ణిక చుట్టునున్న రేకులవలెను, భగవంతుని చుట్టును వారుండిరి. ఆ రాసస్థలి శోభ అపూర్వముగ నుండెను. కాళిందియును నేఁడభిసారిక యయ్యెను. దానిలోఁ గుముదినీ పుష్పములు వికసించి యుండెను. అవి ఆమెకు రోమాంచ మైనట్లుగ నుండెను. ఆమె తన తరంగరూపమగు బాహువుల చేఁ బ్రియునాలింగన మొనర్చుకొనుటకు ఉత్కంఠత చెందు చున్నట్లుండెను. శ్యామసుందరుని నిరంతరము చింతించు చుటచే ఆమెయును ఆమె తన యావర్తరూపమగు నాభినిఁ జూపుచు నచ్యుతునాహ్వానించుచుండెను. చంద్రకిరణములు ప్రతిబింబించుటచే నీలజలరూపమగు చీరలోనుండి ఆమె ముఖచంద్రము కనఁబడుచున్నట్లుండెను. ప్రియునిఁ గూర్చుండఁబెట్టుటకై ఆమె తన తరంగరూపమగు బాహువులచే వాలుకారూపమగు సుకోమల ఆసనమును బఱచినట్లుండెను. పులినమునకు నాల్గువైపులను సుందర, కుంద, మందార, కేతకీ, పాటలాదిక సుగంధ సుమములు వికసించి యుండెను. మాలతీ, మాధవీ, మల్లికా, యూదికా, చంపక, జాజి మొదలగు లతావితానములు విస్తృతముగ నుండెను. అసంఖ్యాకములగు సంఘన నికుంజములుండెను. వానిలోఁ గోమల, మృదుల, సుఖకర, వాలుక పఱవఁబడియుండెను. దానిమీఁదఁ గిసలయ సుగంధ పుష్పములయొక్క సుఖద

శయ్యలేర్పఱుపఁబడెను. శీతల, మంద, సుగంధ సమీరము సశంకిత భావముతో వీచుచుండెను. చిత్రవిచిత్రములగు దమతమ గూండ్లలోనుండి ప్రభువుకొఱకు ప్రతీక్షించు చుండెను. పాదములు తమ శిరస్సులందు సుమనముల నెత్తు కొని శ్యామసుందరునకు స్వాగతమొసంగుటకుఁ బ్రతీక్షించు చున్నట్లుండెను. మధుకరము లిప్పటినుండియే మాధవా గమనమునకు గీతములను బాడుఁచుండెను. శరశ్చంద్రుని యొక్క కమనీయ కిరణములచే వనస్థలి తళతళ మెఱయు చుండెను. అట్టి నాస్థానమునకుఁ తన కాశ్రితలగు వ్రజ వని తలనుగూడ తీసికొని వ్రజచంద్రుఁడు విచ్చేసెను.

శ్రీకృష్ణ దర్శనాహ్లాదముచే వికసించిన. ముఖకమ లములు కలవారును, ప్రియస్పర్శచే నిక్కబొడిచిన రోమ ములు కలవారును, కృష్ణుఁడాదరించుటచేఁ దమ శరీరమునఁ జక్కలిగింత కలవారును, కంపిత శరీరములు కలవారు అచ్యుతనాలింగన మొనర్చుకొనుటచే శాంతిఁ జెందిన శరీర తాపములు కలవారు నగు నా గోపికలు జ్ఞాన శ్రుతులవలె పూర్ణమనోరథలై ఆప్తకామలైరి. శ్రీకృష్ణుఁడును నాపుణ్యా పులీనశోభను గాంచి ముగ్ధుఁడయ్యెను. ఆతఁడు స్నేహాభరిత హృదయముతో నిట్లనెను:- "ఇచ్చటనే కొంచెముసేపు కూర్చుండి ప్రేమప్రసంగమును జేసికొందమా? చెప్పుఁడు మీ యభిప్రాయమేమియో?"

వారిలో నొకర్తుక యిట్లనెను:- "కృష్ణుని అభిప్రాయ ము ను, సఖుల యభిప్రాయమును వేఱువేఱు కాదు. అందఱు నచ్చట కూర్చుండుట కంగీకరించిరి."

రాధికాదేవి యిట్లనుకొనెను. కృష్ణుని ఆసనమును నాతని కనురూపముగ నుండవలయును. ఆతని యాసనము మృదులముగను సుఖకరముగను, సుగంధయుక్తముగను నుండవలయును. మదనమోహనునకు హృదయమున నలఁదిన కేసరగంధమత్యంత ప్రియము," అని యిట్లాలోచించుకొని తన కుచకుంకుమ కర్దమ రంజితమైన దన పంచరంగుల మేలి ముసుఁగును దీసి, మడచి యా యిసుకతిన్నెపైఁ బఱచెను. కామశాస్త్రమునకు ఉపయుక్తమగు నాసనమును బొంది యోగుల హృదయకమలము నందల్పకాలమైనను నిలువని శ్రీకృష్ణుఁడు కౌతుకముగను, క్రీడాసహితముగను సహర్షముగను గోపికలు పఱచిన నాసనము మీఁదఁ గూర్చుండెను. రాధికాదేవి ఆతని సుందర సుకోమల కరుణావరణ చరణముల ననురాగముతోడను, నాహ్లాదముతోడను దన యంకమున స్థాపించుకొని, ఆమె వారిని మెల్లమెల్లఁగాఁ దన సుకోమలములగు హస్తములతో నొత్త నారంభించెను. ప్రపంచమందలి సమస్తశోభకును నేకమాత్రాశయుఁడును, ఆనందమునకు సుఖదస్రోతయును, సౌందర్యమునకు నిలయ

మైనవాఁడును, ప్రేమ పయోధియునగు శ్యామసుందరుఁడు సాకారసుకుమార శరీరమును ధరించి శత్రువులకు సాధ్య రూపుఁడై, యా రాసస్థలియందు సఖులతోఁ గూర్చుండి యుండెను.

ఇరువైపులను బరస్పరము రూపాసవమును దనివి దీఱ ద్రాగుచుండిరి. కాని యెవ్వరికినిఁ దృప్తి జనింపలేదు. అందఱ కంఠములును రుద్ధములయ్యెను. ప్రశ్నించున దెవరు? సమాధానమును జెప్పున దెవరు? అయినను బ్రేమలోఁ బ్రశ్నో త్తరములు జరుగవలయును. ప్రశ్నోత్తరములు ప్రేమకుఁ బ్రధానమగు నంగము, దీనివలనఁ బ్రేమ వృద్ధినిఁ జెందును. గోపికలకుఁ గామోద్దీపనమునకుఁ గావలసిన సమస్త సామ గ్రులును సుసిద్ధముగ నుండెను. శ్యామసుందరుఁడు వాని కధీనుఁడు. ఆతఁడనురాగభరిత దృక్కులతో వ్రజవనితలను గాంచుచుండెను. వారును మధుర మందహాసమయలీలా కటాక్షభ్రూ విక్షేపములద్వారా శ్యామసుందరుని ముఖమును నత్యధికముగఁ జమత్కృత మొనరించుచుండిరి. ఆతని చర ణారవిందములను దమ వడిలో నుంచుకొని పరమ సుఖద స్పర్శ ననుక్షణ మనుభవించుచుండిరి. ఆతని పాణిపల్లవ మును దమ సుకోమల కరములు నదిమి పట్టుకొని అలౌకిక రసాస్వాదన మొనర్చుచుండిరి. ఈ విధముగఁ బ్రియునివలన

నాశాతీతమగు సన్మానమును బొంది, సర్వసమర్పణ రూప మగు సన్మానప్రదానమును గావించి కొన్ని ప్రశ్నలనడుగ నారంభించెను. గోపికలిట్లనిరి:- "శ్యామసుందరా! మేము నిన్ను కొన్నిటి నడిగిదెము, జవాబిచ్చెదవా? అనురాగ రసము నందఱ వికసిత వదనములపైఁ జల్లుచున్నట్లే యడు గుఁడనెను.

గోపికలిట్లనిరి:- "అన్యథా తలంపవుకదా!"

నవ్వుచు శ్యామసుందరుఁ డిట్లనెను:- "అన్యథా తలంచుటకిందే మున్నది? ఎచ్చటనైనఁ బ్రేమలో నన్యథా తలంచుట యుండునా? అడుగఁ దలఁచినదేమో నిస్సంకోచ ముగ నడుఁగుడు. నేను యథామతిగ దానికిఁ బ్రత్యుత్తర మొసంగెదను,"

గోపికలిట్లనిరి:- "ప్రపంచమున మూఁడు విధములగు మానవులుందురు. వారిలో నీవెవనిని శ్రేష్ఠునిగాఁ దలచు చున్నావో మేమెఱుఁగఁ గోరుచున్నాము."

శ్యామసుందరుఁడిట్లనెను:- వారి ముగ్గురినిగూర్చి వ్యాఖ్యానింపుఁడు. ఆముగ్గురు లెట్టివారు?"

గోపికలిట్లనిరి:- "ఒకఁడు ప్రేమించువానినిఁ బ్రేమిం చును. అనఁగా నీవు మమ్ములను గోరిన మేము మిమ్ములను గోరెదమనినట్లు ఇరువైపులను బ్రేమయుండును. ఇంకొకఁడు

తనను ప్రేమింపకుండినను వీరినిఁ ప్రేమించువాఁడు. ఇఁక మూఁడవవాఁడు తన్నితరులు ప్రేమించినను ప్రేమింపకుండినను నెవరినిఁ ప్రేమింపఁడు. ఈ ముగ్గురిలో నీవెవరిని శ్రేష్ఠునిగాఁ దలఁచుచున్నావు? నీయభిప్రాయమున వీరిలో నెవఁడు శ్రేష్ఠుఁడు?''

సూతుఁడిట్లనెను:— ''మునులారా! సర్వాంతర్యామి యగు శ్యామసుందరుఁడు సఖుల మనోగత భావములను గ్రహించెను. వీరు నా యపరాధమును మనస్సులోఁ బెట్టుకొని ప్రశ్నింపుచు, నానోటనే చెప్పించుటకుఁ బ్రయత్నించుచున్నారు. అందువలన నాతఁడును బ్రశ్నలను విని నవ్వుకొనెను. సంబాళించుకొని ప్రత్యుత్తర మొసంగుటకు సిద్ధపడెను.

మునులారా! గోపిక లీప్రశ్నలను నాక్షేపదృష్టితోఁ బ్రశ్నింపలేదు. నేనీవిషయమును మాటిమాటికిని జెప్పుచున్నాను. ముందునునట్లే చెప్పెదను. ఇది నాకథన రూపమగు పదమునకు పల్లవి అనుకొనుఁడు. ప్రేమయందు పలుకు శబ్దమొకటిగను, దాని యర్థమింకొక విధముగను నుండును. ప్రేమ వృద్ధికై మాటలాడు మాటలు పైకిచూచినచో అజ్ఞానముగ నున్నట్లుండును. కాని వానిలోపల రసము నిండియుండును. మహానుభావులారా! గోపికలడిగిన నీపావన

ప్రశ్నలకు శ్రీకృష్ణుఁడెంత కౌశలముగ నెంతస్పష్టముగఁ బ్రత్యుత్తర మొసంగెనో, ఆ వర్ణనమును నేనొనర్చెదను. మీరందఱును సమాహిత చిత్తులరై దీనిని శ్రవణ మొనర్పుఁడు.

—//—

## గోపికలకు శ్రీకృష్ణుని ప్రత్యుత్తరము

(౯౯౨)

శ్లో॥ నాహం తు సఖ్యో భజతో ఽ పి జంతూన్
భజామ్యమీ షామనువృత్తి వృత్తయే ।
యథాధనో లబ్ధధనే వినష్టే
తచ్చింత యాన్యన్నిభృతోన వేద ॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౨ అ. ౨౦ శ్లో ॥

మ॥ నను సేవించుచు నున్నవారలకు
నేనారూపముం జూపఁ జూ
చినఁ జాలించి మదించి వారు
మఱినన్ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు సెడ్డ నెపుడుం
దత్పారవశ్యంబుఁ దా
ల్చిన భంగిన్ ననుఁబాసి మత్ప్రియుఁడు
దాఁ జింతించు నా రూపమున్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

వస్తువులన్నియును బహుమూల్యములే లేక అన్నియు నమూల్యములే. ఏలననఁగా నన్నిటికి యొక్క ఉత్పత్తి పంచభూతములచే నైనది. పంచభూతముల నెవరును మూల్య మిచ్చి కొనలేదు. కాని వ్యవహారమందీ వస్తువులమూల్యము దేశకాల పాత్రాను సారముగఁ దరుగుచుండెను, పెరుగుచుండును. గంగాతీరమున సమభూమియందెన్నో మామిడిచెట్లు పెరుగుచుండును కాని వానినడుగు వారెవరు నుండరు. వానినే శీతప్రధాన దేశములకు గొనిపోయిన నచ్చట మామిడి యుండదు. కావునఁ జాల ప్రియముగ నుండును. మూల్యమెక్కువ. గంగాతీరమున గంగకు విలువ లేనేలేదు. కాని దానినే మరుభూమికి గొనిపోయినచో దాని బిందువుకొఱకు ఉవ్విళ్లూరుచుందురు. ఇది దేశ జన దృష్టాంతము. ఇఁకఁ గాలజన్యమును జూతము. చలికాలమున మంచుగడ్డ నమ్మిన నెవరు తీసికొందురు? దానినే యెండ కాలమునఁ వైశాఖ జ్యేష్ఠములందు నమ్మినచో నందఱును మిక్కిలి యుత్కంఠతతోఁ గావలె నందురు, ఈ విధముగనే పాత్రము విషయమునను జూచుకొనవలయును. ఒకానొక సాధారణుఁడొక వైద్యునికడకు మందుకొఱకై పోయినచో దాని నూరక యొసంగును. దానినే ధనికుఁడడుగఁబోయినచో బహు మూల్యమును గ్రహించును. వస్తువొక్కటియే. కాని స్థితి, భావనానుసారముగ దానిలో భేదముండును. ఈ

ప్రపంచమంతయును ప్రేమమీఁద నాధారపడియున్నది. న్యాయశాస్త్ర సిద్ధాంతమిది. ప్రపంచమున నన్నిటికిని వేఱు వేఱు పరమాణువులు కలవు. ఆ పరమాణువులు పరస్పరము కలిసికొని ప్రేమించుకొనినచో సృష్టి జరుగును. అవి వేఱు పడినపుడు అనఁగాఁ బరస్పరము ప్రేమించుకొనుట మానినచోఁ బ్రళయము కలుగును. మీరు జాగ్రత్తగాఁ జూచినచోఁ బ్రేమలేక సత్తాయే లేదు. ఈ నిలువఁబడిన భవనములు ప్రేమచేతనే నిలువఁబడినవి. ఇటుకలు, సున్నము, పరస్పరము ప్రేమతో నంటుకొనకుండినచో, విరియఁబడిన నింక భవనమేముండును? వస్త్రములోని పడుగు పేకలు కలుసుకొనకుండినచో వస్త్రముండునా? పరివారములోనివారు పరస్పరము ప్రేమపూర్వకముగ నుండినచో సమిష్టి కుటుంబముగ నెట్లుండఁగలదు. ఇంతకు జెప్పున దేమనఁగాఁ బ్రపంచమందలి వస్తువులన్నియును ప్రేమ సంబంధము వలననే ఉండుననియే. తినుట, త్రాగుట, కలిసికొనుట, సంబంధము పెట్టుకొనుట, లేచుట, కూర్చుండుట, మాటలాడుట, నడచుట, వ్యాపారము, వ్యవసాయము, పఠనము, పాఠనము, యజ్ఞము, అనుష్ఠానము, శాసనము, సేవ, మొదలగు వ్యవహారములన్నియును ప్రేమ సహాయముననే జరుగుచున్నవి. ఇంతకు భేదమేమనఁగా దేశ, కాల, పాత్ర, పరిస్థితి, భావనానుసారముగఁ బ్రేమ భేదించు

చుండును. ఉత్కృష్టప్రేమ, స్వార్థజన్యప్రేమ, నిస్వార్థప్రేమ ఇదియే భేదము, ప్రేమకొఱకు ప్రేమించు ప్రేమయే ప్రేమ. అదియే నిత్యమైనది. అదియే స్థానముగా నుండునది. దానిని హరి, కృష్ణ, ఈశ్వర, పరమాత్మయని యెట్లైన ననవచ్చును. సాంసారిక స్వార్థసాధనకొఱకు ప్రేమించు ప్రేమను అజ్ఞానము, మోహము, విషయానురాగము, సంసారము, నశ్వరమని యందురు. ఎవనిహృదయమునఁ బ్రేమకొఱకై ప్రేమయుత్పన్న మైనదో ఆతఁడే ప్రేమికుఁడు. ఇట్టి ప్రేమికుల పాదపద్మపరాగ ముచే విశ్వము పావనము కాఁగలదు. ఇట్టి ప్రేమకు సాకార స్వరూపుఁడే శ్రీనందనందనుఁడును, ఆతని అనన్యోపాసికలు వ్రజాంగనలు. లోకములోఁ బ్రేమానుదర్శనమును గోపికలను గాకయింకెవరినిఁ జెప్పఁగలము? వారు సాంసారిక వ్యక్తినిఁ ప్రేమింపలేదు. పరమాత్మను బ్రేమించిరి, అదియును జార భావముతో జారభావమున నెంతటి యాకర్షణమున్నదో దానినిఁ జెప్పఁజాలము. భాగ్యవంతులగు వ్రజాంగనల సమస్త కార్యములు ప్రేమ శ్రీవృద్ధి కొఱకే వారి నడకలు, సౌందర్యము, కూర్చుండుట లేచుట, నవ్వులు, ప్రశ్నోత్త రములు మరియు నితర చేష్టలును లోకమునఁ బ్రేమా దర్శనమును నెలకొల్పుటకే.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలు భగ వానుని మూఁడు ప్రశ్నలడిగిరి. ఒకఁడు ప్రేమకు బదులుగాఁ

బ్రేమించువాఁడు, ప్రేమింపకున్నను బ్రేమించువాఁడును, ప్రేమించువారినిఁ బ్రేమింపని వారినిఁగూడ ప్రేమింపని వాఁడు; ఇట్లు మానవులలో మూఁడురకములవారిని జెప్పి వీరి ఉత్తమత, మధ్యమత అధమతా సంబంధమున నడుగఁగా భగవానుఁడీ ప్రశ్నలకుఁ గ్రమముగఁ బ్రత్యుత్తరమొసంగుటకు సిద్ధపడెను.

భగవానుఁడిట్లనెను:- "గోపికలారా! మీరు ప్రేమకు సంబంధించిన ప్రశ్నలనడిగి మిక్కిలి మంచిపనినిఁ జేసితిరి. ప్రేమ సంబంధమునఁ గొంచెముగఁ జర్చించుటకు నాకవకాశమును గలిగించితిరి, అందఱును బ్రేమపిపాసువులే. జీవులు ప్రేమ కొఱకు తిరుగుచున్నారు. ప్రేమ పిపాసను జెంది ప్రేమామృతమును వెదుకుకొనుచుందురు. ప్రపంచమున నొకరినొకరు ప్రేమించుకొనుచుందురు. ప్రేమలేక వ్యవహారమే జరుగదు. మీరు ప్రేమికులను మూఁడు తరగతులుగ విభజించి ప్రశ్నించితిరి. నేను దాని ననుసరించి ప్రత్యుత్తర మొసంగెదను,

కొందరేదో వారివలన మనకిట్టి కార్యము కావలయునని ప్రేమించుచుందురు. వీరు కేవలము స్వార్థమునఁ బ్రేమించువారే. దానిలో విశుద్ధధర్మము లేదు. వ్యాపారముండును. ఆంతరిక సౌహార్ద్రిద యుండదు. పనిని నెరవేర్చు

కొను నుపాయముండును. ఒక తోటలో నొక అంధుఁడు కూర్చుండియుండెను. వానికి పండిన మామిడిపండ్ల సుగంధము వచ్చుచుండెను. మామిడిపండ్లు పండి పైనున్నవి. వానికి నోరూరుచుండెను. పండు లభించుటెట్లు? ముక్కుల ద్వారా సుగంధము వాని లోపలికిఁ బోవుచుండెను. కాని చేయఁగలిగినదేమున్నది? కన్నులతోఁ బండ్లను జూడఁ జాలఁడు. ఇంతలో నొక మొండికాళ్ల వాఁడచ్చటికి వచ్చెను, బాగుగా పక్వమైన నా పండ్లను జూడఁగనే ఆతనికి నోరూరెను. వానికి రెండు కాళ్లును లేవు. ఆతఁడెదురుగా నుండిన గ్రుడ్డివానినిఁ గాంచెను, ఇద్దరికి నొకే స్వార్థమున్నప్పుడు పరస్పరము స్వార్థసిద్ధికొఱకు ప్రేమించుకొనుచుందురు, కుంటివానికి కండ్లున్నవి. అంధునియొక్క భావభంగిమములను గాంచి, పండ్లవాసనచే వాని అంతఃకరణము ఉవ్విళ్లూరుచున్నదని యాతఁడు తెలిసికొనెను, ఆతఁడు దగ్గి సకిలించి యిట్లనెను:- "సూరదాసా! రాం రాం విశేషములేమి? క్షేమముగ నున్నావా? ఇచ్చటఁ దిరుగుచుంటివేల?"

వాక్కును విని యాతఁడా కుంటివాఁడేనని తెలిసికొనెను. అంధులు కంఠస్వరమును బట్టియు, జేతితోఁ దాఁకియు వెంటనే ఫలానివారని కనుగొనఁగలరు. ఆతఁడిట్లనెను:- "రాం రాం! ఈ మామిడి పండ్లెట్లు పక్వమైనవో చూడుము."

నవ్వి కుంటివాఁడిట్లనెను:- "సూరదాసా ! మామిడి పండు దినవలెనని యున్నదా?"

సూరదాసు వ్యంగ్యస్వరమున నిట్లనెను:- "నాకు తినవలయునని యున్నది, లెమ్ము. నీవు అస్వాదు వ్రితమును బట్టినట్లున్నది. నిజము చెప్పుము. నీకు దినవలయునని లేదా?"

కుంటివాఁడిదివిని నవ్వి యిట్లనెను:- "సూరదాసా! నీవు మనస్సులోని విషయములనుగూడ కనిపెట్టఁగలవే. అందువలననే నీకు ప్రజ్ఞాచక్షువను, పేరువచ్చినది, ఎర్రగఁ బండిన నీమామిడి పండ్లను గాంచిన నా నోటఁగూడ నీరూరుచున్నది."

సూరదాసిట్లనెను:- 'అయితే చూచెదవేమి? రెండు చేతులతో బాదుము అవి యిప్పుడే టపటప రాలును."

కుంటివాఁడిట్లనెను:- "చేతులతో నెట్లు రాల్పఁ గలను? పండ్లు దూరమున నెత్తున నున్నవి. నాకొక్క కాలైనను లేదు, నిలుచుండఁజాలను."

సూరదాసిట్లనెను :- "అయితే ఒక్కపనినిఁ జేయుము. నీవు నా భుజముపై నెక్కుము. ఇదిగో నా కర్రను దీసికొనుము. పండ్లను గొట్టుము. అన్నియును రాలిపోఁ గలవు. ఇద్దరమును గడుపునిండఁ దినవచ్చును.

కుంటివాఁడట్లే యొనర్చెను. పండ్లు రాలఁగా నిద్దరును దినిరి. తిని, నీరు ద్రావి గ్రుడ్డివాఁడింటికిఁ బోయెను, కుంటి వాఁడు వెడలిపోయెను. ఇచ్చట మామిడిపండ్లు తినవలయు నని యిద్దరకును గలదు. అందువలన గ్రుడ్డివాఁడు కుంటి వానినిఁ దన భుజముమీఁద నెక్కించుకొనెను, కావున నీ ప్రేమ నికృష్టమైనది. ప్రపంచమున సర్వత్ర యిట్టి స్వార్థ జన్యమగు ప్రేమ దొఱకును. ఆవులను గేదెలను అవి పాలిచ్చునంతవరకు యజమాని గడ్డిగాదమును ప్రేమతో నొసఁగును, పాలిచ్చుట మానఁగనే వాని వైపునకుఁ జూడ నైనఁ జూడఁడు. ఎద్దు బాగుగ బలిసియుండి బాగుగా నఱ కను దున్నుచున్నంతవరకు రైతు దానికి మేఁత, గుగ్గెళ్ళు పెట్టును. అదియే ముసలిదైనచోఁ దొక్కుడు గడ్డినైనను వేయఁడు. ఇంటినౌకరు పనిచేయుచున్నంతవరకు అందరు నాతనిఁ బ్రేమించెదరు. ముసలివాఁడైనచో వానిని బయ టకు నెట్టివేయుదురు. నౌకరును స్వార్థవశమున, వేతన లోభముచేఁ బనినిఁ జేయును. వానికి జీతము ముట్టక, గృహస్వామి దరిద్రుఁడయ్యెనా ఆతండింకొక తావునకుఁబోయి నౌకరు చేయును.

యజమాని పురోహితుని వలన యజ్ఞమును జేయించు కొనవలసి యున్నంతవరకు పండితులవారూ పండితులవారూ

అనును. పని కాఁగానే ఆయన వారింటికి మనము మన యింటికి రావలసినదే. మరల దారిలో ఎచ్చటనైనను గనఁబడెనా ఇంకఁ బలుకరించుట యుండదు. తలవంచుకొని పోవుట. కలిసి చూచుకొనుట జరిగెనా ఏదో మొగమోటము వచ్చునను భయము కలుగును. పురోహితుని స్థితియు నంతే. దక్షిణ ముట్టువరకు అయ్యా, బాబు అనును. అది పూర్తియయ్యెనా అయ్యా, బాబు వారింటివరకే కాఁగలఁడు.

వేశ్యాగామియగువాఁడు వేశ్య ముసలిది కానంత వరకును, రోగగ్రస్తురాలు కానంతవరకును నెంతో ప్రేమించును. దానికై ప్రాణములర్పించుటకైకె సిద్ధపడును. దానికి భయంకరరోగము వచ్చినను, లేక ముసలిదైనను దాని వైపునకైనను జూడఁడు. వేశ్యల విషయమును నంతే. పురుషుఁడు తనకు ద్రవ్యము నిచ్చునంతవరకు హృదయమును దీసి యిచ్చును. మాటిమాటికి నిట్లనును "నీవు చెమటను గార్చినచోట నేను రక్తమును గార్చెదను." ఆతఁడు నిర్ధనుఁడై ధనము నీయఁజాలని నాఁడు వానినింటినుండి బయటకు గెంటును.

వ్యాపారినిఁ గాంచుఁడు. కొనువాఁడు వచ్చిన నిట్లు కేకలు వేయును. "పండితులవారూ! ఇటు రండు. బాబూ!

ఒకమాటను వినుఁడు. స్వామీ! వస్తువును గొనవక్కఱ లేదు, చూచిపొండు." వస్తువును గొనునంతవరకు తీపిమాట లను మాటలాడును. దుకాణము మీదే. నాకు మీకడ లాభమక్కఱలేదు. నా పట్టీనిఁజూడుఁడు. కొనిన వెలకే యిచ్చుచున్నాను. నాలుగు పైసలు తగ్గించి యిండు. ఈధర కింకెవ్వరైన నిచ్చినచో నేను మీకూరకనే యిచ్చెదను. మీరే చెప్పుడు, నేను మీకు మోసము చేయుదునా? లాభ మును బొందుటకు కావలసినంత ప్రపంచమున్నది, మీరు మావారేకదా!" అని యీ విధముగఁదియ్యని మెత్తని బులిబుచ్చికపు మాటలను బలికి ప్రేమను జూపించును. వానిని వశపఱచుకొనును. స్వార్థసిద్ధి కాఁగానే యింక మాటలాడుటయే యుండదు. ఎంతని చెప్పఁగలను? ప్రపంచ మున సర్వత్ర స్వార్థమే యుండును, ఎవనివలనఁ దనకుస్వార్థ సిద్ధియగునో ఆతఁడే సర్వస్వమనునంతటి ప్రేమనుజూపును, స్వార్థము నెఱవేఱకున్న నాతనియెడల శత్రుత్వమును వహించును.

భగవానుఁడిట్లనెను:- "సఖులారా! మీరు నాప్రాణ ప్రియులు. సఖీజనము. ఏకాంతమున రహస్యవిషయములను వినువారు. మీకు నా యెడల స్వార్థజన్య ప్రేమలేదు. మిక్కిలి తుచ్ఛమైనది. దానిలో సౌహార్దమును లేదు. దానిలో ధర్మ భావనయు నుండదు. సదా స్వార్థపరతయే

యుండును. ఇట్టి పరస్పరప్రేమ ధర్మశూన్యమును, సౌహార్ద హీనముగను, ప్రయోజనసిద్ధికొఱకే యుండును నీచుల యొక్క పరస్పరప్రేమ యీ నిమిత్తముగనే యుండును.

సుందరులారా! కొందఱు, తమ్ము ప్రేమించినను ప్రేమింపకుండినను ప్రేమించుచుందురు. సేవచేయని వారి నైనను ప్రేమించెదరు. వారిలో రెండురకముల వారుందురు. ఒకరు పరోపకారులునుకృపాళురునగు మహాత్ములు. రెండవ వారు తల్లిదండ్రులు. కృపాళురగు మహాత్ములు. ధర్మప్రేర ణముచే అందఱి యెడలను ప్రేమను ప్రదర్శించెదరు. జల ములోఁదేలు కొట్టుకొని పోవుచుండెను. పరోపకారియగు సాధువు హృదయమున దయ కలిగెను. అది నీటఁగొట్టుకొని పోయినఁ జచ్చును. అందువలన నాతఁడు దానినిఁ దీయఁగా నది కుట్టెను. చేతిని విదిలించుటచే నది మరల నీటఁబడెను. పాపమాతఁడు మరలఁ దీసెను. అది మరలఁ కుట్టెను. సాధువు మాటిమాటికిని దీయుచునే యుండెను. అది మాటి మాటికిఁ గుట్టుచునే యుండెను. చివరకాతఁడు దానిని బయ టఁబడవైచెను. ఇందులో స్వార్థములేదు. కాని కృపకు వశీ భూతుఁడై ధర్మమని భావించి దానిని బయటఁబడవైచెను. ఇవి ఆకృతజ్ఞుని యెడల నాతఁడు చూపించిన ప్రేమ. ఇది ధర్మప్రేరణచే జరిగినది.

తల్లిదండ్రులు తన సంతానము తమ్ముఁ బ్రేమింపకుండి నను బ్రేమించుచుందురు. పుత్రుఁడ యోగ్యుఁడైనను, మూర్ఖుఁడైనను క్రోధి యైనను దల్లిదండ్రులాతని యెడలఁ బ్రేమఁ జూపెదరు. ఆతని మేలునే కోరుచుందురు. పుత్రుఁడు తిట్టినను, గొట్టినను వారు సహించెదరు. ఇది సౌహార్ద్ర ప్రేమ; సంతానము తన ఆత్మరూపమున నుత్పన్నమగును. ఇది దృఢమగు శృంఖల బంధువుల యెడల ప్రేమను గొప్ప గొప్ప వీతరాగులును వదలఁ జాలరు. ఈ స్వాభావిక ప్రేమలో వారు ప్రేమించిననుమనము ప్రేమింపవలయుననునది లేదు. తనకు సంబంధము కలుగఁగనే ఆతఁడెట్టివాఁడైనను దానిని నిర్వహింపవలసినదే, దానిని యావజ్జీవమును బాటించెదరు. అదియే ఆతని సాధుత్వము.

మూఁడవ తరగతివారు తమ్ము నెంతగాఁ బ్రేమించి నను వారు నిన్నుఁ బ్రేమింపరు. ప్రేమించువారినే వారు ప్రేమింపకపోయిన నింకఁ బ్రేమింపని వారిని వారెట్లు ప్రేమించెదరు?

ఇది విని గోపికలు తమలోఁదాము సైఁగలతో నీ కృష్ణుఁడీ మూఁడవ రకము వాఁడనుకొనుచుండిరి. ఈతని మనమెంతో ప్రేమించితిమి. కాని యీతఁడు మన లను వీడి అంతర్ధానమైనాఁడు తన దర్శనమీయక మనలను వంచితుల నొనర్చుచున్నాఁడు.”

సర్వజ్ఞుఁడగు భగవానుఁడు వారి భావమును గ్రహించి యిట్లనెను:- "ఇప్పుడు నేను చెప్పినవారిలో మూఁడవరకము వారియందును నాలుగురకముల వారున్నారు. ఇట్టి వ్యవహారమును నాల్గురకములవారు చేయుచుందురు. ఒకరు రాగద్వేష రహితులను, వీతరాగములును, ఆత్మారామ పరమహంసులగువారు. వారి దృష్టిలో భేధభావముండదు. వారు ప్రపంచమునంతను ప్రకృతి పురుషుల క్రీడాస్థలముగ భావించెదరు. గుణములు గుణములతో వర్తించుచుండునని వారి దృఢభావము. గుణప్రవాహామునందు బడిన ప్రపంచమున మంచియేమి? చెడ్డయేమి? ఉపకారమేమి? అపకారమేమి? శత్రువెవఁడు? మిత్రుఁడెవఁడు? అంతయు నొక్కటియేయైయుండ నెవరియందు రాగము? ఎవరియందు ద్వేషము? వారి కంఠమున సర్పమును వేసినను బుష్పమాలను వైచినను నొక్కటియే. వారికి జందన మలందినను, బురదపూసినను; నొక్కటియే. చందనమునుబూసినఁ బ్రసన్నులునుగారు, బురదనుఁ బూసినఁ గోపపడరు. ఇట్టి పూర్ణకాములగు బూర్ణపురుషుల యంతఃకరణమందు ప్రేమీ అప్రేమికుల భేదముండదు.

ఇంకొక పూర్ణకాముఁడు తన కార్యమును నెఱవేర్చుకొనును. ఆతఁడు తనను ప్రేమించువానినిఁ ప్రేమింపఁడు, తన్నుఁ బ్రేమింపని వానినిఁ బ్రేమింపఁడు. ఆతనికి

నాలుగు రొట్టెలు కావలసియుండిన నవి లభించెనా, ఎవరైన నిందించినను, స్తుతించినను, గౌరవించినను, అవమానించినను నొక్కటియే.

మూఁడవవాఁడు గురుద్రోహి మొట్టమొదట గురు జనులకు సేవాశుశ్రూషలొనర్చును. వారిని సమ్మానించును. తర్వాత పాపబుద్ధి పుట్టఁగా నేదో నెపమున గురుద్రోహ మొనర్పఁబూనును. ఆతని కనిష్టమును వలయును. ఈ పాపము వలన నాతనిబుద్ధి అపకారి యెవఁడో, ఉపకారి యెవఁడో తెలిసికొనజాలనంతగా విహీనమగును. ఆతని హృదయము శత్రువులు మిత్రులు సమానముగఁ జూచునంతగా మాలిన్యము వహించును. అందఱ నను మానించును. ఎవ్వరినిఁ బ్రేమింపఁడు.

నాల్గవవాఁడు కృతఘ్నుఁడు. వీఁడు గురుద్రోహులకు వేఱుగనుండును. గురుద్రోహి తర్వాత నేదో కారణమున గురుద్రోహ మొనర్చును, కాని కృతఘ్నుఁడు జన్మచేతనే తనకుపకార మొనర్చినను అపకారమునే యొనర్చుచుండును. ఆతఁడు తనకుపకార మొనర్చు వారియెడలనే కృతజ్ఞతను బ్రదర్శింపఁజాలకుండిన నింక శత్రువు నెడలను, నుదాసీనుని యెడలను నేమిచేయఁగలఁడు? ప్రపంచమునఁ గృతఘ్నతకు మించిన పాపములేదు. తన కుపకారము చేసిన వారియెడలఁ

గృతజ్ఞతను ప్రకటింపకుండిన వాని కెన్నటికిని నిస్తార ముండదు. తనకు సేవా శుశ్రూషలొనర్చు వారి యెడల నాదరమును ప్రకటింపకుండుటయే కృతఘ్నతకు చిహ్నము. వీరు మిక్కిలి క్రూరులుగ నుందురు, నేను మీ మూఁడు ప్రశ్నములకును సమాధానము చెప్పితిని. ఇంక మీ రేమి యడుగఁ దలఁచినారు?"

కృతఘ్నుని పరిభాషనువిని గోపికలు పరస్పర మొకరి నొకరు చూచుకొని నవ్వుకొనసాగిరి. వారు శ్రీకృష్ణభగ వానుని వైపునకుఁ జూచుచు నవ్వనారంభించిరి. వారి చేష్టల వలన నిట్లనుచున్నట్లుండెను:- "శ్యామసుందరా! మేము నీకొఱకు ఇల్లువాకిలి, కుటుంబము, పరివారమునంతను వదలి వచ్చితిమి. నీవు మమ్ములను వదలిపోతివి. ఇది నీవుచేసిన కృతఘ్నత కాదా?" భగవానుఁడు వారి మనోగత భావ ములను గ్రహించి యిట్లనెను:- "సఖులారా! ఈ మూఁడు రకముల వారిలో నేనే శ్రేణిలోఁ జేరుదునాయని మీ యూహ. ఇదియే కాదా మీరనుకొనునది?"

నవ్వి గోపికలిట్లనిరి:- "స్వామీ! మీకే తెలియవల యును. సరే, స్వామీ! మీరీ మూఁడురకములలో దేనికిఁ జెందినవారు?"

భగవానుఁడిట్లనెను:- "నేనీ మూఁడు రకముల వారిలో నేరకమునకును జేరను. నేను బరమ కారుణి కుఁడను."

గోపికలిట్లనిరి:- "వహ్వా! పరమకారుణికా? నీ కరుణ కభివందనములు, ముందుగా నమృతరసమును ద్రావించి తరు వాత విషము నొసంగుటయేనా నీ కరుణ. ఇదియేనా కరుణ? మొదట మమ్ములను బిలిచి కౌఁగిలించి కొంటివి. తర్వాత దూరము, దూరమనుచుంటివి. ఇదియేనా కరుణ మమ్ములను బలవంతముగ వేణువునాది వనమునకుఁ బిలిచితివి. దర్వాత దాగికొంటివి. ఈ విచిత్రకరుణకు దూరమున నుండియే నమస్కారము.

భగవానుఁడు నవ్వి యిట్లనెను:-"సఖులారా! నేనీయప రాధము నవశ్యమొనర్చితిని, కాని కృతఘ్నతకు వశీభూతుఁ డనై చేయలేదు. నేనిది యంతయును బ్రేమవృద్ధికై చేసి తిని. మీ యుత్కంఠతను వృద్ధిఁబొందించుటకై చేసితిని."

గోపికలిట్లనిరి:- "మధ్యలో మాయమగుటచేఁ బ్రేమ వృద్ధియగునా రసభంగమగునా?"

భగవానుఁడిట్లనెను:- "గోపికలారా! మీరందఱును రసపండితులు, మీకన్నియును దెలియును. నానోట వినవల యునని యుండిన వినుఁడు. ఈ ప్రేమరసమును నాగియాగి

త్రాగవలసినది. అట్లు చేసిన దీనిలో నధిక మాదకత కలుగును. ఒకనొక వస్తువుయొక్క మధురస్మృతిలోనున్న సుఖము దాని ప్రాప్తిలో లేదు. కుంకుమపూవు, కర్పూరము పన్నీరు కలిసిన మధురములగు బిండివంటలను దినినఁ దిను నపుడు స్వాదిష్టముగనే యుండును. తరువాత దాని త్రేపు వచ్చినపుడును, దాని రుచియు, రూపమును స్మరణమునకు వచ్చినపుడును దానిలో నొక యపూర్వమగు సుఖము కలుగును. వస్తువుయొక్క యథార్థమగు గుణము దాని పరోక్షముననే ప్రకటమగును. ఒక మిక్కిలి దరిద్రుఁడుండెను. ఆతనికి ధనసుఖము ప్రాప్తింపలేదు. కేవలము దాని ప్రశంసనే వినియుండెను. హఠాత్తుగ నాతనికి ధనము ప్రాప్తించెను. కొన్నిదినము లాధనమునుగూడ అనుభవించెను. మరల నా ధనము నష్టమైనపుడు వాని చిత్తము తన్మయమగును. నిరంతరము దానినే చింతించుచుండును. ఆతనికి ధన ప్రాప్తియొక్క ఉత్కంఠ ఇంకను నధికమగును. ఏలననఁగా నాతఁడు దరిద్రుఁడుగా నున్నంతవఱకు ఆతనికి ధనముయొక్క సుఖము తెలియదు. ఆతనికాధనసుఖము తెలియగానే, మరల దాని ప్రాప్తికొఱకు అధీరుఁడగును. ఆతని కాహార పానీయములును, లేచుట కూర్చుండుట ఇవేమియును సహింపవు. తన సంబంధులు తనకు సరిపడరు. ధన మెట్లు లభించునాయనియే ఆలోచించుచుండును.

అట్టి స్థితియే నా వియోగమున మీకుఁ గలిగినది. మీరు నా కొఱకు లోకలజ్జను వదలివైచితిరి. జీవనమును ధర్మపూర్వకముగ గడుపుకొనువారును, ధర్మము మీఁదనే ఆసక్తికలవారును సమస్తమును వదలి వేయుదురు. కాని ధర్మమును మాత్రము విడువరు. పతివ్రతలగు మీరు నా నిమిత్తమై లౌకిక పతులనుగూడ పరిత్యజించితిరి. నా కొఱకై ధర్మమును దుచ్ఛముగఁ దెలిసికొంటిరి. అన్నిటి కంటె నెక్కువ మోహము కుటుంబీకులకే యుండును, తన ప్రేమచేఁ బ్రాణులను బంధించుచుందురు. వారే బంధువు లనఁబడుదురు. అట్టి బంధువులను నే సహృదయుఁడు తనకు దానుగాఁ బరిత్యజింపఁగలఁడు. మీరు నా కొఱకై బంధు బాంధవులనుగూడ వదలితిరి. గృహస్థుల కింటిలో సమస్త విధములగు సుఖములుండును, కూర్చుండుటకు, నిలుచుండు టకు నియత స్థానములుండును. ఆవశ్యక సామగ్రులన్ని యును నింటిలో నుండును. సమస్త ఋతువులలోను గావల సిన వస్తువులు సంపన్న గృహస్థులవద్ద నుండును. మీ యిండ్లలో సమస్త వస్తువులును గలవు. మీ పరివారము లోనివారు మిమ్ములను ప్రేమించుచున్నారుకూడ; కాని కేవ లము నా ఒక్కనికొఱకే మీరు ఇండ్లవాఁకిండ్లను, కుటుంబ పరివారమును వదలి యీ నిబడ వనమునకు వచ్చితిరి. నా కొఱకై కంకరురాళ్లు కలిగిన నీ రాతినేలయందు సమస్త

కష్టములను సహించుచున్నారు. మీరు నా ప్రేమకొరకు చాలత్యాగ మొనర్చితిరి.

నా హృదయపూర్వకమగు కోరికయును మీ మనస్సులు సదా నాయందుండవలయుననియే. మీరనన్య భావముతో నన్నే ప్రేమించుఁడు. మీ చిత్త వృత్తులను నాయందే స్థిమిత మొనర్పుఁడు, నేను నిరంతరము మీతో నుండినచో మీకు నన్నుఁబొందవలయునను దీవ్ర ఉత్కంఠత యింతగా నెన్నడును నుండదు. అందువలన మీకొక్కసారి ఆలింగన సుఖము నొసంగి, కొంతకాలము మీ యధీరతను నినుమడించుటకై దాగితిని. దాగి దూరముగఁ బోయితినా? అట్లును జేయలేదు. మీరు నన్నుఁ జూడకుండునట్లు మీ సమీపముననే - మీ యెదుటనే - నేను దాగి యుంటిని. కావున నో ప్రాణాధికలారా! ఓ నా హృదయాధీశ్వరులారా! మీరు నాపైఁ గోపమును జెందకుఁడు, కృతఘ్నుఁడనను దోషారోపణమును జేయకుఁడు, నేను మీ ప్రియులకంటెఁ బ్రియుఁడను, ప్రేష్ఠుఁడను, మీ వాఁడనే.

నా ప్రియురాండ్రగు మీ యెడల దోషబుద్ధి నెవరు కలిగియుందురో వారు నరకమును బొందువారగుదురు. మీరు నన్నుఁగలిసికొనుట సర్వథా నిర్దోషము, మీరు నన్ను మానవుఁడనుకొని నాకడకు వచ్చి యుండినచోఁ బాపమే యుండెడిది. మీరు నా భగవత్త్వమును జాలసారులు

ప్రత్యక్షముగఁ జూచియున్నారు. మీకు నా యెడల దృఢ ధారణ కలదు. మీరు నన్నుఁ బ్రాకృత పురుషునిఁగఁజూచు చుండుట లేదు కాఁబట్టియే, మీ దుస్తర సాంసారిక శృంఖలలను ద్రెంచుకొని నన్నొక్కనినే ఆశ్రయించితిరి. మీకు నాకు కలిగిన నీ కలయిక సర్వథా దోషరహితమైనది. ఇందులో నిసుమంతైన బాపముకానిండు, స్వార్థము కానిండు లేదు. మీరు ధరించు వస్త్రములు మీ కొఱకు ధరించుట లేదు; కేవలము నా ప్రసన్నత కొఱకే ధరించితిరి. మీమీ కుటిల కుంతలములపై నలఁదిన సుగంధతైలమును, మాలతీ మాధవీ పుష్పమాలలఁ దురుము కొనుటయును మీ సుఖము కొఱకు కాదు, నా కానందమును గలిగించుటకే. మీరు ధరించు కాటుకయును, బొట్టుయును, సిందూరమును, నమలు చుండు దాంబూలమును గేవలము నా నిమిత్తమే చేయు చున్నారు. మీకు స్వాదు అక్కఱ లేదనియుఁ, దినుట యందు మీ కాసక్తి లేదనియు నాకుఁ దెలియును. నేను బ్రసన్నుఁడ నగుటకే మీరు తినుచున్నారు. నా యుచ్ఛిష్ట ప్రసాదమును దినుచున్నారు. ఇంతకు సారాంశ మేమనఁగా, మీరు సమస్తమును నా కొఱకై చేయుచున్నారు. నా కొఱకే జీవించుచున్నారు, నా సేవకొఱకే శ్వాసను దీసికొనుచున్నారు. మీరు మీ సదాచారము వలనను, సద్వ్యవహారము వలనను, సుశీలతాది సద్గుణముల వలనను నన్ను మూల్యము

లేకయే కొనిపైచినారు. నేను మీకు క్రీత దాసుఁడనైతిని. ఈ జన్మలో మీ ఋణమును దీర్చుకొనఁజాలను. ఈ జీవితము సంగతి నట్లుంచుఁడు. దేవతలవలె దీర్ఘాయువును గలిగియున్నను. మీరుచేసిన నుపకారములలో నొక్క ఉపకారమునకైనను ఋణమును దీర్చుకొనఁజాలను. మీకు కృప కలిగి నన్ను ఋణవిముక్తునిఁ గావించిన నది వేఱువిషయము. నేను ఋణవిముక్తినిఁ జెందుటకును గాంక్షించుట లేదు. ఋణవిముక్తినిఁ జెందిన నాకును మీకును గల సంబంధము తెగిపోవును. ఆ సంబంధమును త్రెంచుకొనుట నా కిష్టము లేదు. నే నెల్లప్పుడును మీకు ఋణపడియే యుందును. మీరు నేను ఋణిననుటకుఁ బెట్టుబడిదారు కావలెను. దీనిలోనే నాకు సుఖమున్నది. మీరు నన్నుఁ గృతఘ్నునిఁగా భావింపకుఁడు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ ప్రేమమార్గ మెంతో విలక్షణమైనది. సర్వేశ్వరుఁడును, సమస్తమునకును స్వామియు, బ్రహ్మాది దేవతలును, ఇంద్రాదిలోకపాలకులును నెవని భృకుటీ విలాసముచే గడగడ వణఁకుచుందురో, అట్టివాఁడు నేఁడు ప్రేమకధీనుఁడై గోకులమందలి గోపభామినుల ముందు నధీరతను బ్రకటించుచున్నాఁడు. వారి యుపకారమునకుఁ బ్రత్యుపకార మొనర్చుటకు దానసమర్థుడ ననుకొనుచున్నాఁడు, ప్రేమలో నిరువైపులను నధీనత యుండును.

అది వారి సర్వస్వమును సమర్పింపఁజేయును. ఎవరు తన్నెట్లు భజించెదరో వారినిఁ దానట్లు భజించెదనని భగవానుని ప్రతిజ్ఞ. ఎవరు తమసర్వస్వమును నాకు సమర్పించెదరో వారికిఁ దన సర్వస్వమును సమర్పించి దాసుఁడనౌదునని.

గోపికలు తమ ప్రాణధనమగు శ్యామసుందరుని శ్రీముఖమునుండి యిట్టి ప్రేమపూరితమైన శబ్దములను విని తన్మయలైరి. కృతకృత్యలైరి. వారి హృదయములుప్పొంగెను. వారు తమ ప్రేమ వేగమును నాపుకొనఁజాలకపోయిరి. శ్యామసుందరునిఁ గౌఁగిలించుకొని ప్రేమాశ్రువులుచే నాతని పీతాంబరమును దడిపిరి. భగవానుని సుమధుర వచనములచే వారి విరహాజన్య దుఃఖము దూరమయ్యెను. ఆతనియంగ సంగమునుబొంది అందఱును సఫల మనోరథలైరి.

—//—

# రహస్యకేళి

(౩౩)

శ్లో॥ ఇత్థం భగవతో గోప్యః శ్రుత్వా వాచః సుపేశలాః ।
జహుర్విరహజం తాపం తదంగోపచితాశిషః ॥

శ్రీభాగ, ౧౦ స్కం, ౩౩ అ. ౧ శ్లో॥

క॥ చక్కఁగ హరి యిటు పలికిన
చక్కని వాక్యముల నతని సంగమున లో
నిక్కిన వియోగ తాపము
లొక్కట విడిచిరి లతాంగు లుర్వీనాథా॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రేమ ఐకాంతికవిషయము. అది ఏకాంతమున నిర్జన ప్రదేశమునఁ బ్రకటమగును. అందఱ యెదుట ప్రేమ విషయములను జెప్పరాదు. ప్రేమను సాధ్యమైనంతవఱకు అందఱ యెదుట దాఁచవలయును, నిర్ముక్త ప్రేమ ఏకాంతమందే యుండును. అందఱ యెదుట శిష్టాచార పాలనముండును. ఏకాంత స్థలమైయుండి, ఒక్క వ్యక్తియైనను దగ్గఱ లేకుండి, యెవ్వరివలనను నేవిధమగు సంకోచమును లేకున్నపుడు ప్రేమసాగరము పొంగును. పెద్దతుపాను చెలరేగినట్లుండును. అది యెప్పుడును నట్లే చెలరేగుచుండును. అందులో నిరంతర మతృప్తియే యుండును. రెండు శరీరములకును నింక భేదమేమియు నుండదు. గొప్ప, కొద్ది అను భేదముండదు. పరస్పరము తా నెట్లో అట్లే అలంకరించుకొందురు. ప్రియుని శరీరము నలంకరించుకొనుటలోఁ దన కధికసుఖము కలుగును. ఏ విధమగు దాపరికము లేకుండునట్లు మధుర సంభాషణము జరుగును. ఈ రహస్య కేళి క్రీడలత్యంత గోపనీయములు. వ్రజ

మందలి రసికాచార్యులు వీనినన్నిటిని దిగ్దర్శనముగ వర్ణించిరి. కాని యివి యన్నియును జెప్పుటకుఁగాని వినుటకుగాని సంబంధించిన విషయములు కావు. ఈ లీలలోఁ బ్రవేశము కలవారే దాని ననుభవింపఁగలరు, మనబోటి ప్రాకృత పురుషులము దీనిని వర్ణింపఁ బూనినచో దీనిలో మన లౌకిక వాసనలను గలిపి, దీనిని వికృత మొనర్చి అశ్లీల మొనర్చెదరు. ఇవన్నియును భావరాజ్యమునకు సంబంధించిన విషయములు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శ్రీకృష్ణుఁడింతగా నధీనుఁడై, దీనుఁడై గోపికలను ప్రేమభిక్షునడిగి, తాను వారికి ఋణపడియున్నాననఁగా గోపికల చిత్తము వికసించెను. ఈ రస ప్రసంగము నింక నొనర్చుట ఉచితమని అతఁడు భావింపలేదు. వారికి నీతిశాస్త్రవిషయము లవసరములేదు. స్మృతి వ్యవస్థనడుగవలసిన పనిలేదు. కర్మకాండ విషయమును నక్కఱలేదు. ప్రకృతి, పురుష, జడ, చేతన, మహత్తత్త్వాది జగత్పదార్థ సంఖ్యాశాస్త్ర జాలములోఁ బడవలసిన పనిలేదు. పంచీకరణము, అన్వయ వ్యతిరేకములను, వ్యావహారిక పారమార్థిక సత్తాసిద్ధికి సంబంధించిన వ్యవహారములలోఁ బడవలసిన పనిలేదు. "నీ వెంతగా మమ్ములను ప్రేమించుచున్నా"వను నదియే వారికిఁ గావలసినది. అందువలన శ్యామసుందరుఁడు స్పష్టముగ నిట్లు చెప్పియుండెను:-

"ఇప్పుడు నేను ప్రేమించుటకు నా కధికారము లేదు. మీరు నన్నుఁ బ్రేమచేఁ గొనియుంటిరి. ఇప్పుడు నేను మీకుఁ గ్రీతదాసుడ నైతిని. నన్ను మీరిష్టము వచ్చినట్లాడింప వచ్చును."

ఇది విని యిప్పుడు గోపికలు ప్రసంగమును మార్చిరి. ఒకతె యిట్లనెను:- "శ్యామసుందరా! నీకు జడవేయుట చేతనగునా?"

కృష్ణుఁడిట్లనెను:- "నేను జేసినపని యేమున్నది? రాధకు జడనేకదా వేసినది, ఈవిషయమున లలితయే నాకు గురువు."

ఇంకొకతె యిట్లనెను:- "శృంగార మొనర్చుట తెలియునా?

నందనందనుఁడిట్లనెను:- "నాకింకొక పని యేమున్నది? సృష్టించుకార్యమును జతుర్ముఖుఁడగు బ్రహ్మ యొనర్చును, పాలన కార్యము చతుర్భుజుఁడగు విష్ణువొనర్చును. సంహార కార్యము పంచముఖుఁడగు రుద్రుఁడొనర్చును. నేను ద్విభుజుఁడను, నాకు రెండే కార్యములు, రాధ సలంకార మొనర్చుటయును, ఆమెను సంతోష పెట్టుటయును,"

అంత నింకొక ర్తుక యిట్లనెను:- "అయితే నీవు రాధికకు శృంగార మొనర్చుము, శృంగార మొనర్చిన తర్వాత రాస జరుగును."

కృష్ణునకు నిధి దొఱకినట్లయ్యెను, రాధకు శృంగార మొనరించుకొనుట బాగుగాఁ దెలియును, ఇది యామెకుఁ గ్రొత్తకాదు. అచ్చట సఖులెవరును గ్రొత్తవారుకారు, సంకోచింపవలసినపని యేమున్నది ? శ్రీకృష్ణుఁడు విధ్యుక్తముగ రాధికకు స్వయముగ శృంగార మొనరించెను, తన చేతులతో నామె కోమల పదనఖములకు రంగువైచెను. కాళ్లకు పసుపు పారాణమును బెట్టెను. ఆమె కాళ్లకు గల కడియములు, అందెలు, గొలుసులు, చేరులు యథాస్థానమున నలంకరించెను. అంత నాతడు స్వయముగఁ దన చేతులతో నామెకు జడను వైచెను. దానిలో మధ్య మధ్య సుగంధ పుష్పములఁ దుఱిమెను. అతి మనోహరములగు మాలజాలమును నేర్పుఱచి నలువైపులను నలంకరించెను. సుందరాతిసుందర హారములను నామె కంఠమందునను, భుజములందును, సేతులందును, నడుమునకును నలంకరించెను. లలాటమున నర్ధచంద్రాకారమునఁ గేసరముతోఁ దిలకమును దిద్దెను, దానిమధ్య కేసరీ, కస్తూరి మొదలగు వానితో నెఱ్ఱని చుక్కను బెట్టెను. ముఖము నందును, వక్షఃస్థలమందును వివిధ విధములఁబత్త్రావళులను రచించెను. మాడుపైనఁ బాపిడిలో సన్నగ సిందూర రేఖను దిద్దెను. నేత్రములకుఁ గాటుకను బెట్టెను, సహజముగ దొండపండ్లవలె నుండిన యామె అధరముల కింకను రంగు నద్దెను, నోటికి తాం

బూలము నందించెను. ఈ విధముగ నాతఁడు స్వయముగ నామెను విధ్యుక్తముగ సర్వాంగ శృంగారమును గావించెను.

ఇప్పుడు రాధాకృష్ణులు పరస్పరము ఒకరిమెడలో నొకరు కంఠమాలను వేసికొనఁబోవునంతలో రసభంగ మయ్యెను. ఒక పరమ తేజస్వియగు బ్రాహ్మణుఁడు వచ్చుచు దూరముగఁ గనఁబడెను, బ్రాహ్మణునిఁగాంచి రాధికాదేవి సవరించుకొని కూర్చుండెను, శ్రీకృష్ణుఁడును గంభీరుఁ డయ్యెను. ఆ సమయమున నాతఁడు తన శక్తితోఁగూడ దివ్యైశ్వర్యశోభతో శోభించుచుండెను.

బ్రాహ్మణుని ముఖమున బ్రహ్మతేజముట్టిపడుచుం డెను. ఆతఁడెనిమిది చోట్లవంకర కలవాఁడు, కృష్ణవర్ణము జడలు విఱియఁబడినవి, శరీరముపై వస్త్ర మేమియును లేదు, దిగంబరావేషమున నాతఁడు మూర్తీభవించిన తపమువలె నుండెను. భగవానుని సమీపమునకు వచ్చి భూమిపై సాష్టాంగపడి రాధికాకృష్ణుల పాదపద్మములపై మాటి మాటికినిఁ బ్రణామమును గావించుచుండెను. అంత నుచ్చై స్స్వరమున స్తోత్రమొనర్ప నారంభించెను, చివర కాతఁ డొక స్తోత్రపాఠమును గావించి భగవానుని చరణములలో లీనమయ్యెను. ఆతని తేజము భగవానుని చరణములలోఁ గలిసిపోయెను. భగవానుని చరణములందే ఆతఁడు తన నశ్వర శరీరమును బరిత్యాగము గావించెను.

ముని ప్రాణములు పోయినవని తెలియఁగానే శ్రీకృష్ణుఁ డాతని మృత కళేబరమును లేవనెత్తి రెండు చేతులతో నా లింగనము గావించుకొనెను. ఆతడు తన చేతులతో నా శరీరమును నలుపుటకుఁ బ్రారంభింపఁగనే ఆతని శరీరము నుండి భస్మము బయలుదేరెను. భగవానుఁ డేద్చుచుఁ జందన కాష్ఠములతోఁ జితినిఁ బేర్చి, దానిమీఁద ముని దేహము నుంచి నిప్పంటించెను. ముని శరీరము దగ్ధము కాఁ బ్రారంభింపఁగానే కృష్ణుడు మునిని స్మరించి స్మరించి ఉచ్చస్వరమున రోదనముచేయ నారంభించెను. ఆ సమయమున గోలోకమునుండి ఒక దివ్య విమానము వచ్చెను. ఆ ముని ఆదివ్య విమానము నెక్కి దివ్యశరీరముతో గోలోకమునకుఁ బోయెను.

ఇట్టి యాశ్చర్యయుక్తమగు సంఘటనమును గాంచి రాధికాదేవి శ్యామసుందరు నిట్లడిగెను:- "ప్రాణనాథా! ఈముని యెవరు? ఆతని దివ్య తేజము నీ చరణములలో నేల లీనమైనది? ఈతఁడు నీదర్శన మొనర్చి ప్రాణహీనుఁడేల నయ్యెను. ఈతని మృతశరీరమునుండి భస్మమేల వెలువడి నది? ఈతఁడెనిమిది చోట్ల వంకరగా నేలనున్నాఁడు? ఇంతటి దివ్య తేజముగల మహాముని యిట్లు వంకరగుటకుఁ గారణ మేమి? దయతో నీప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మొసంగి నాకుతూహలమును దూరము కావింపుఁడు."

ఇది విని భగవానుఁడిట్లనెను:- "ప్రియా! ఈతఁడష్టావక్రమహామునీంద్రుఁడు. స్వర్గమందలి సర్వోత్తమయగు రంభయొక్క శాపమువలన నీతని కిట్టిరూపము ప్రాప్తించినది. నా భక్తి ప్రభావముచే నీతనికి నా సన్నిధియును, గోలోకమును బ్రాప్తించినది."

అంత వృషభాను కుమారి నిట్లడిగెను:- "ప్రాణవల్లభా! అష్టావక్రమహాముని యెవని కుమారుఁడు? రంభయాతనికి శాపమేల యొసఁగినది? నీ దర్శనము చేయుచుఁ బ్రాణములు వదలుట కీతఁడేమి యుపాసనమును గావించినాఁడు? దివ్యగోలోకము నెట్లు పొందఁగలిగినాడు? ఇట్టి అనన్య భక్తుని యొక్క చరిత్రమును వినఁగుతూహలమగుచున్నది.

భగవానుఁడిట్లనెను:- "ప్రియే! ఈ విషయము చాల రహస్యమయమైనది. ఈ ప్రసంగమును నేనందఱముందు చెప్పను. కాని, నీవు నా ప్రాణేశ్వరివి. కావున నీకీ ప్రసంగమును వినిపించెదను."

పూర్వకాలమున శ్రీమన్నారాయణుని నాభికమలమునుండి చతుర్ముఖ బ్రహ్మపుట్టినప్పుడు సృష్టి చేయవలయునను గోరికతో నాతఁడు సనక, సనందన, సనత్కుమార, సనాతనులను నలుగురు పుత్రులను సృజించెను.

సృష్టిని వృద్ధిచేయుఁడని వారితో ననెను. వారు మోక్ష ధర్మావలంబులగుటచే వీరా విషయము నంగీకరింపలేదు. అప్పుడు బ్రహ్మశరీరమునుండి అత్రి, పులస్త్య, పులహ, క్రతు, మరీచి, భృగు, అంగిర, వశిష్ఠ, వోఢు, కపిల, ఆసురీ, కవి, శంకు, శంఖ, పంచశిఖ, ప్రచేతసులను వారనేకులు తపోధనులగు ఋషులు పుట్టిరి. వీరందఱును సృష్టి విస్తారమును గావించిరి. వీరి పుత్రులు, పౌత్రులు, ప్రపౌత్రుల సంతానముచే నీ ప్రపంచమంతయు నిండిపోయెను.

వీరిలో బ్రహ్మపుత్రుఁడగు బ్రచేతసుఁడుండెను. ఆ ప్రచేతసునకు కుమారుఁడే వాల్మీకి. రెండవవాఁడసితుఁడు. అసితమహాముని బ్రహ్మచర్యమును బూర్తిగావించి వివాహ మొనర్చుకొనెను. పుత్రుని కొఱకు తనభార్యతోఁగూడ వేలకొలఁది వత్సరములు ఘోరతపం బొనరించెను, కాని అతనికి పుత్రుఁడు కలుగలేదు. అందువలన నాతనికి జీవితము భారమై, బ్రాణములనైన వదలుటకు సిద్ధపడెను. అప్పు డశరీర దివ్యవాణి యిట్లు వినఁబడెను:- "తపోధనా! నీవు శరీరము నేల వదలెదవు? నీవు శంకరుని కడకుఁబోయి మంత్రమును గైకొని, మంత్రసిద్ధినిఁ బొందుము. ఆ మంత్రాధిష్ఠానదేవత జపమొనర్చుటచే నీకు వెంటనే సాక్షాత్కారమగును. అప్పుడు నీవు పుత్రుఁడుకావలెనని వరమడుగుము."

ఆకాశవాణిని విని అసితుఁడు శంకరుని కడకుఁబోయి, ఆతనివలన మంత్రదీక్షను గైకొని జపమొనరించెను. ఆ జపముచే నల్పకాలముననే కందర్పసమానుఁడగు పుత్రుఁడు శివాంశమున దేవలుఁడను వాఁడు పుట్టెను. ఇట్టి సుందర పుత్రుఁడు కలుగఁగా నాముని దంపతుల యానందమునకు మేఱలేకుండెను. కాలాంతరమున దేవలుఁడు సకల శాస్త్రములను జదివి సుయజ్ఞుఁడనురాజు కుమార్తెయగు రత్నమాలావతిని వివాహమాడెను.

రత్నమాలావతి అతి సుందరి, ఆమె మహాపతివ్రత, పతినిఁ బ్రాణములకంటె నెక్కుడుగఁ జూచుకొనును. దేవల మహాముని ఆమెతో వేలకొలఁది సంవత్సరములు సాంసారిక సుఖముల ననుభవించెను. చివర కాతనికి సంసార వైరాగ్యము కలిగెను. ఇప్పుడాతనికి సాంసారిక సుఖములు విష సమానము లయ్యెను, ఆతడు సాంసారిక భోగముల యెడల నుదాసీనుఁడుగ నుండెను. కాని, ఆతఁడు తన భావములను నాతని భార్యకుఁ జెప్పలేదు. ఆతని వ్యవహారము వలన ముని తన యెడల నుదాసీనుఁడుగ నున్నాఁడని ఆమె తెలిసికొనెను. తనను విడిచిపోవునేమోనని ఆమె ఆతని నెచ్చటికిని నొంటరిగఁ బోనిచ్చుటలేదు, ఛాయవలె నాతని వెన్నంటియే యుండెడిది. మునికిప్పు డేకాంతమున నుండి తపస్సు చేసికొనవలయునను నుత్సాహముండెను.

ఒక దినమున ముని నిద్రించుచుండెను. సమీపమున శంకిత చిత్తముతో నాతని ధర్మపత్నియును నిద్రించుచుండెను. రాజపుత్రి జాగత్తగ నుండినను విధి విధానముచే నామెకు నిద్రవచ్చెను, ముని యిదే సమయ మనుకొనెను. ఆతఁడు మెల్లఁగా లేచి రాత్రియందే ఘోర వనమునకుఁ బోయెను. కొంచెము సేపటికి ముని పత్నికి నిద్ర మెలఁకువ వచ్చెను. తన ప్రాణనాథుఁడు తన వద్ద లేకపోవునప్పటికి ఆమె బిగ్గఱగా రోదన మొనర్పసాగెను. ఆమె పుత్రులును, పరివారమును నామెను మిక్కిలిగ నోదార్చిరి; కాని ప్రియుని వియోగము సామాన్య విషయముకాదు, విరహాగ్నిచే నామె మండు టిసుకలోని బీజముల వలెఁ గాలి యెగుర నారంభించెను. చివరకామె పతి వియోగమును సహింపఁజాలక యీ నశ్వర శరీరమును త్యజించెను. ఆమె పుత్రులామెకు ఔర్ధ్వదైహిక సంస్కారము లొనర్చిరి.

ఇచ్చట దేవల మహాముని బదరికావన సమీపమున నున్న గంధమాదన పర్వతగుహాలోఁ గూర్చుండి ఘోర తప మొనర్ప నారంభించెను. అసలే ముని, కామదేవునివలె సుందరుఁడు, పైఁగాఁ దపఃప్రభావముచే నా సౌందర్య మినుమడించెను. తపస్తేజముచే నాతని ముఖచంద్రము తళతళ లాడుచుండెను. ఆ సమయమున స్వర్గమందలి సర్వశ్రేష్ఠయగు

రంభ ఆ దిక్కునకు వచ్చెను. తేజఃపుంజమగు నామునినిఁ గాంచఁగానే ఆమె మనస్సు చలించెను.

భగవానుఁడు రాధికతో నిట్లు చెప్పుచుండెను:- "సతులుగాని కామినుల చిత్తము ఏకాంతమున సుందర పురుషునిఁ గాంచఁగనే చంచలమగును. అప్పుడు వారు తమ మనస్సును నిగ్రహించుట కసమర్థులగుదురు. ఏకాంత. శాంతమగు నిర్జనవనమునఁ గందర్ప సదృశుఁడును, రూప లావణ్యాయుక్తుఁడునగు మునినిఁగాంచి రంభ నిలువఁజాలక షోడశశృంగార మొనర్చుకొని, వస్త్రాభూషణాదులచే సుస జ్జితయై, కామ సంబంధమగు ననేక సంకేతము లొనర్చుచు ముని సమీపమునకుఁ జేరెను. ఆ సమయమున ముని ధ్యానము భంగమయ్యెను.

రంభ మందహాస మొనర్చుచు వ్రీడాభావమును బ్రవ ర్శించుచు నిట్లనెను:- "మునివరా! భగవానుఁడు నీకనుపమ రూప లావణ్యము నొసఁగినాఁడు, ఇంతటి సుందర, సుకోమల శరీరము కలిగిన నీవింతటి ఘోరతప మొనర్చుట శోభించుట లేదు, నీవు వ్యర్థముగ శరీరమును శుష్కింపఁ జేయనేల ?

ముని యిట్లనెను:- "శోభనా! మామునులకు దపమే ధనము, బ్రాహ్మణ శరీరము క్షుద్రకామవాసనల కొఱకు

కాదు, ఆతఁడీ లోకమునఁ గష్టములనోర్చి తప మొనర్చి పరలోకమున ననంత సుఖములను బొందును.''

రంభ యిట్లనెను:- ''మునివరా! పరలోకము నెవఁడు చూచినాఁడు, వడిలోనున్న దానిని వదలి కడుపులోని దానికై కారాడుట మూర్ఖత, తపోధనా! భూమి యందలి రాజులును, మహారాజులును గొప్పగొప్ప యజ్ఞానుష్ఠానములను స్వర్గమందలి మావంటి అప్సరసలను బొందుటకే. నేను స్వర్గమందలి సర్వశ్రేష్ఠయగు నప్సరసను. గొప్పగొప్ప తపస్సులును, దేజస్సులును, వేయేల దేవేంద్రుండును నా కృపా కటాక్షము కొఱకై యువ్విళ్లూరుచుందురు. అట్టి నేను స్వాయముగ నిన్నుఁ బ్రణయభిక్ష నడుగుచున్నాను. నేను నీ తపస్సునకు మూర్తీభవించిన సిద్ధిని. నీవు నన్ను స్వీకరింప వలయును.''

ముని యిట్లనెను:- ''భామినీ! నీ వెట్టి మాటలాడుచున్నావు'' నేను సమస్త విషయములను వదలి, యేకాంతమున నిచ్చటఁ దపస్సు చేయుటకు వచ్చితిని, తపస్సునందు స్త్రీసంగము గొప్ప విఘ్నము. కావున దేవీ! నీవు నాపై దయ దలఁపుము. నన్నుఁ దపమొనర్చు కొననిమ్ము. నీ త్రోవను నీవు పొమ్ము.

రంభ వ్యంగ్య స్వరమున నిట్లనెను:- ''నీరసవాక్యములను బలుకు నీవు వట్టి రసహీనుఁడవుగఁ గనఁబడుచున్నావు

నేను నీ కారణమునఁ బీడితను, దుఃఖిత నైతిని. దుఃఖితల యెడల దయను జూపుట పరమధర్మము, కామ పీడితయగు కామినినిఁ దిరస్కార మొనర్చిన వానికి మిక్కిలి పాపము సంభవించును, నీవు మునివి, బ్రహ్మ కామ పీడితయగు మోహినిఁ దిరస్కరించినాఁడు. అందువలననే ఆతనికి పృథివినిఁ బూజ లేకుండఁబోయినది, ఒక వంక లక్షల సంవత్సరములు ఘోర తప మొనర్చుటయును, మఱియొక వంక దుఃఖితుల దుఃఖమును దూర మొనర్చుటయును, ఈ రెంటిలో దుఃఖితుల దుఃఖమును బోఁగొట్టు ముందు ధర్మముగఁ దప మొనర్చుట తుచ్ఛము, కావున నీవు నాపైఁ గృప జూపుము.''

ముని యిట్లనెను:- ''సుందరీ! నీవు సాంసారికుల వాక్యములను బలుకు చున్నావు. గృహస్థుఁడు కామార్త యగు స్వపత్నినిఁ బరిత్యజించుట పాపము. పరస్త్రీ సదా వర్జనీయయే.''

రంభ యిట్లనెను:- స్వామీ! నేను బరస్త్రీని గాను. నాకొక పతి లేఁడు. స్వర్గస్త్రీలమగు మాకిది ధర్మము. సదాచారము, మాకు రతి సుఖమును గూర్చినవాఁడే మాకు పతి. స్వర్గమందు బుణ్యాత్ములగు రాజులు మమ్ములను బొందుదురు. పుణ్యక్షీణము కాఁగానే వారు పతనమగుదురు. అంత మేమింకొక పుణ్యాత్ముని భజించెదము.''

ముని గంభీరముగ నిట్లనెను:- "శోభనా! నీవు చెప్పునది యథార్థమే. నీవేఒక్కనికి బత్నివికావు, అయినను మునులకు స్త్రీపరిగ్రహము నిషేధము, మోహినీ శాపముచే బ్రహ్మకు పూజార్హత లేకపోయినదను విషయమును నేనొప్పుకొందును. ఆయనయును గృహస్థే నేను భార్యాబిడ్డలను బరిత్యజించితిని. నేను ద్యాగిని, నీకు కామపీడయుండినచో నీవింకొక సుందర పురుషుని భజింపుము. నిన్నుఁ గోరువారు ప్రపంచమునఁ జాలమంది యుందురు. గొప్ప గొప్పవారు నిన్నుఁ బొందుటకు జప, తప, యజ్ఞానుష్ఠానాది సాధనల నొనర్చుచుందురు. నీవు వారి కడకు బొమ్ము, నా తల నెఱిసిపోయినది చూడుము. నేను బతివ్రతయగు నాభార్యను బరిత్యజించియిచ్చటికి ఘోర వనమునందు పర్వత కందరముల లోనికి వచ్చి కూర్చుంటిని, నీవు నాతో నిట్టి యనుచిత ప్రస్తావమును గావించెద వేల?"

రంభ అధీరతతో నిట్లనెను:- "స్వామీ! ఇంతటి రూక్షత్వము పనికిరాదు. తపస్సు చేయుటచే నీకెంతటి పుణ్యము లభించునో, దానికి లక్షరెట్లు ఈయబలను గృపఁ జూచినఁ గలుగును, లోకులు నన్నుఁబొందుట కెంతో జప, తపము లొనర్చుచుందురు. అయినను నన్నుఁజూడనైనఁ జూడఁజాలరు. అట్టి నేను నిన్నుఁబ్రార్థించుచుండ నీవు తిరస్కార మొనర్చుచున్నావు. నన్నుఁ గాలఁ దన్నుచున్నావు.

ఇఁక నితర పురుషుని భజించుటయందమా ? మునివరా! ఎవరి మనస్సెవరియందు లగ్నమగునో ఆతఁడు వృద్ధుఁడైనను, కుంటివాఁడైనను, గ్రుడ్డివాఁడైనను, కురూపియైనను, నల్లనివాఁడైనను బాగుగనే యుండును. నీకు తల యంతయును నెరసినను, ముసలివాఁడవైనను నేను నిన్నే కోరుచున్నాను.''

ముని గంభీరుఁడై యిట్లనెను:- ''దేవీ! నీవు నన్నధికముగ బలవంత మొనర్పకుము. నీవు నాకు ధర్మమున మాతవు. నేను నీవైపు కన్నులెత్తియైనను జూడను, నేను క్రోధమునుగూడ చెందను, ఇంక నీతో మాటలాడనైన మాటలాడను, నీ యిష్టము వచ్చినచోటునకుఁ బొమ్ము. ఇచ్చటఁ గూర్చుండ దలఁచినఁ గూర్చుండుము. నేను నా ధ్యానమును జేసికొందును.''

'మాతా' శబ్దమును వినఁగానే రంభ పెదవులదర సాగెను. ఆహా! ఈ తపస్వి యెంతటి శుష్కస్వభావము కలవాఁడు! ఇంతగా ననునయ వినయము లొనర్చినను నీతని హృదయము కరుగలేదు. ఈతని హృదయము వజ్ర కఠినము. ఎంతో ఆశపెట్టుకొని నేనీ రూపవంతుఁడగు దపస్వి కడకు వచ్చితిని. ఈ హృదయ హీనుఁడు నన్ను 'మాతా' యనుచున్నాఁడు. ఆమె క్రోధమున నిట్లనెను:- 'తపస్వీ'! ఇప్పుడింక నిట్టి శబ్దమును బొరపాటుననైన నోట రానీయ

రాదు. కామ సంతప్తయగు గామినిని 'మాతా' యనుట అన్నిటికంటె గొప్పదూషణ. మరల నట్టిశబ్దమును నోటినుండి వెలువరించితివా నీకు దారుణ శాపము నొసంగెదను. ఇప్పుడు నీ యెదుట రెండే విషయములు కలవు, దారుణ శాపమునో లేక నన్నో స్వీకరింపుము.''

ఇది విన్నను మునికి గోపము రాలేదు. అత్యంత సుందరియును, స్వర్గస్త్రీయునగు రంభనోటఁ బ్రణయ, వినయ యుక్తములగు వాక్యములను విన్నను నాతని మనస్సునఁ గామవాసన కలుగనేలేదు. ఆతఁడు గంభీరుఁడై యిట్లనెను:— ''నేను నిన్నొకసారి మాతా యని యంటిని. నీవు నాతో మాటిమాటికిని నిట్టి విషయములను బలుకకుము. నేనింక నట్టి మాటలను వినఁదలఁచుటలేదు.''

కోపముతోడను, గామవ్యథాపీడితయై, మాటి మాటికి నిట్టూర్పులను విడుచుచు, శరీరమునంతను గంపింపఁ జేయుచు నా యప్సరస మర్మస్పర్శ వాక్కులతో దుఃఖితయై యిట్లనెను:- ''మునివరా! కామాగ్ని జ్వాలలచే నా ప్రాణములు కాలుచున్నవి. మనస్సు మండుచున్నది. ఆత్మ సంతప్తమగుచున్నది. చిత్తము క్షోభించుచున్నది. నీవు నామీఁదఁ బ్రణయామృతమును జిలికించినచో నేను జీవించెదను. హాత మొనర్చితివా నేను నాదుఃఖాంతః కరణముతో

నీకు శాపమొసంగెదను, అత్యంత దుఃఖితాంతః కరణముతో, నేత్రముల నశ్రువుల రాల్చుచు, దుఃఖముతో శాపమొసంగినచో, దాని కన్యథా బ్రహ్మయైనను జేయఁజాలఁడు. ఇప్పుడైనను నాలోచించుకొనుము. నన్ను ప్రేమపూర్వకముగ స్వీకరింపుము. లేక శాపమును గ్రహించుటకు సిద్ధపడుము.''

ముని శాంతభావముతో నిట్లనెను:- ''సురసుందరీ! నేను ఒక్కసారి చెప్పిన తరువాత దానినిఁ దప్పను. నేను నిన్నుఁ గామభావముతో స్పర్శింపను. నీవుండిన నుండుము లేక పోయినఁ బొమ్ము. ఇఁక నేను నీతో మాటలాడను.''

అని పలికి ముని యాచమన మొనర్చి మౌనముగ నుండెను. కన్నులను మూసికొని భగవానుని ధ్యానమొనర్పసాగెను.

రంభ కత్యంత మానసిక దుఃఖము కలిగెను. కామపూర్తికాక పోవునప్పటికామె నరనరములందు క్రోధము వ్యాప్తించెను. క్రోధముచే నామె బుద్ధి భ్రష్టమయ్యెను. ఆమె మునికి శాపమొసఁగుచు నిట్లనెను:- ఓయీ! వజ్రహృదయుఁడవగు తపస్వీ! నీవు మిక్కిలి క్రూరుఁడవు, కుటిలుఁడవు, వక్రుఁడవు, నీవు నీరూప, యౌవన, తపోభిమానమున నన్నుఁ దిరస్కరించితివి. కాన నీరూప యౌవనములు నశిం

చుఁగాక! నీవు కాకివలె, అంజనపర్వతమువలె, బొగ్గువలె నల్లగ వికారూపుఁడ వయ్యెదవుగాక! "అని యిట్లు శాప మొసంగి రంభ తన కిష్టమైన లోకమునకుఁ బోయెను."

స్వర్గసుందరులలో సర్వశ్రేష్ఠియగు రంభా వాక్యము అన్యథా కాఁజాలదు. మునిశరీరము నల్లనయ్యెను. ఆతఁ డెనిమిది తావుల వంకర కలవాఁడయ్యెను, ధ్యానములో భగవానుని జూడని దుఃఖమాతనికిఁ గురూపమున రాలేదు. భగవానుని ధ్యానములేని జీవనము వ్యర్థము. దానికంటె మరణించుటయే శ్రేయస్కరము. అని యాలోచించుకొని యాముని చితినిఁ బేర్చుకొని అగ్నిని వెలిగించి, అందు ప్రవేశింపఁబోవు నంతలో నేను ప్రత్యక్షమై ఆతని కిట్లు వర మొసంగితిని:- "మునీ! కామవిజయమును బొందినవారు నాకాత్మ స్వరూపులే. వారికి నాలోకము ప్రాప్తించఁగలదు. వారి జ్యోతి నాతో తదాకారమును జెందును. నీవు శోక మోహములను వీడుము. ఇంకను గొన్ని దినములు తప మొనర్పుఁడు. చివరకు నీకు నాలోకము ప్రాప్తించగలదు."

భగవానుఁడు రాధికతో నిట్లనుచుండెను:- "ప్రియా ఈ విధముగనే నాశ్వాసనమీయఁగా ముని ప్రాణత్యాగ మొనర్చుటను విరమించెను. ఆతఁడు గంధమాదన పర్వత మును వదిలి మలయాచలమునకు వచ్చి ఘోరతపస్సును జేయ నారంభించెను. ఆహారపానీయములు లేకయే అరువది

వేల సంవత్సరములు తపస్సు చేసెను. ఈతఁడు నాకు పరమ భక్తుఁడు. ఈతఁడు కామమునకు వశీభూతుఁడు కాలేదు. ఈతఁడాహారపానీయములను విసర్జించుటచే నీతని యంతఃకరణము భస్మమయ్యెను, అందువలన నీతనికి నాలోకము ప్రాప్తించినది. నేను మీకు సంక్షేపముగ నష్టావక్రుని చరిత్రమును జెప్పితిని."

ఇది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! మోహినీదేవి శాపమువలన బ్రహ్మజగత్తులో నపూజ్యుండైనట్లు రంభయును బలికినది. భగవానుండును నామోదించినాఁడు. ఈ మోహినీదేవి యెవరో, యీమె బ్రహ్మకేల శాప మొసంగినదో దయచేసి యీ కథను జెప్పుఁడు, తర్వాత మీఁదటి కథను జెప్పుఁడు,"

సూతుఁడిట్లనెను:- 'స్వామీ! ఈ కథ చాల పెద్దది. ఈ కథా ప్రసంగమున నింక ననేక కథలు చెప్పవలసి వచ్చును. దీని వలన రస భంగమగును. ఎంతో సుఖద, సరసమైనదియును, గర్ణముల కత్యంత సుఖము నొసంగునదియునగు రాసవిలాస కథ యెక్కడ. శాపములతోఁ గూడిన నీ నరస, కామక్రోధయుక్తములకు గథ లెక్కడ ? ఇప్పుడు నేను జెప్పుటకు మొదలిడినచో నేనా ప్రవాహమునఁ గొట్టుకొని పోవుదును. కావున నన్ను రాసలీలా కథను బూర్తి

కావింపనిందు, తర్వాత మీరేది యడిగిన దానినిఁ జెప్పు దును.''

శౌనకుఁడిట్లడిగెను:- 'సూతా! ఇదంతయును నీ యిష్టముమీఁద నాధారపడి యున్నది. ఇందు రసభంగ మనునది లేదు. ఈ ప్రసంగము లన్నిటిని వినుటచే నందఱ కును నుత్సాహ మినుమడించుచున్నది. ఈ కథలను శీఘ్రాతి శీఘ్రముగ విని, చదివి పూర్తి చేయవలెను. కారణమేమనఁగా ముందేమి జరిగినదో తెలిసికొను నిచ్ఛ కలదు, కావున రసభంగ ప్రశ్నయే లేదు. అందులో భగవత్కథలకు రసభంగ ప్రశ్న యుండదు. ఇది మామిడిపండు వంటిది కాదు రస మును బీల్చి తొక్కను నావలఁబార వైచుటకు, భగవత్కథ కలకండ వంటిది. క్రిందను, పైనను, ప్రక్కలను నింక నెచ్చట రుచిచూచినను మాధుర్యముగనే యుండును. కథ పెరిగినను ఫరవాలేదు. కథను జెప్పుటకే కదా మీరు కూర్చుండినది.''

సూతుఁడిట్లనెను:- 'సరేస్వామీ! నేను మీ యాజ్ఞను పాలింపవలయును. మోహిని బ్రహ్మకు అపూజ్యుఁడవు కమ్మని శాప మొసంగిన వృత్తాంతమును జెప్పెదను. దానిని మీరు దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు,''

—॥—

# రాసలీల

( ౧౧౪ )

శ్లో॥ తత్రారభత గోవిందో రాసక్రీడా మనువ్రతైః
శ్రీరత్నైరన్వితః ప్రీతైర న్యోన్యాబద్ధ బాహుభిః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౨ శ్లో॥

ఉ॥ ఆసమయంబునన్ విభుఁ డనంతుఁడు కృష్ణుఁడు
చిత్రమూర్తియై
చేసెను మండల భ్రమణశీల పరస్పర బద్ధబాహు కాం
తా సువిలాసమున్ బహువిధస్ఫురితానన హస్తపాద వి
న్యాసము రాసముం గృత వియచ్చర నేత్ర
మనోవికాసమున్॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రపంచమున నన్నిటికంటెఁ బతనమునకుఁ గారణ మభిమానమే, ఎవని కేవస్తువువలన నభిమానము కలిగినదో, దాని వలననే వాని కవశ్యము పతనము కలుగును. ఇది నిశ్చిత సిద్ధాంతము, ఎవఁడైన ధనగర్వమున నితరుల నవమానించిన నాతఁడు నిర్ధనుఁడగును. ఎవఁడైనఁ దన ప్రతిష్ఠను జూచుకొని గర్వించిన నాతఁడు ప్రతిష్ఠావిహీనుఁడగును. సదాచారుఁడనను గర్వమున నితరుల నిందింప మొదలిడి, అంద

అను దుచ్ఛలనుగా భావించినచో నాతఁడొకానొక దిన మునఁ దప్పక సంగ్రహియగును. ఇది నిశ్చిత సిద్ధాంతము. ఇందులో మార్పుననది యుండదు. ప్రపంచమున నెవని కైనను బతనము సంభవించిన నది అభిమానమునగాని దర్ప మున గాని సంభవించును. ఆదర్పమును దళన మొనర్చుటకే భగవానుఁడు రాసలీలాభినయ మొనర్చెను. భగవానుఁడు కందర్ప దర్ప దళన మొనర్చుటయేకాదు, ప్రపంచమున నెవని కభిమానము కలిగినను నాతని దర్పమును దయాళుఁ డగు దామోదరుఁడు దళన మొనర్చును. దర్పదళన మొన ర్చుటయే ఆతిని కేకైకవ్యాపారము,అభిమానమే ఆతని కాహా రము. దానినే ఆతఁడు తినును. దానినే ఆతఁడు తన యాశ్రి తుల దర్పమును భంగ మొనర్చి సంతసించును. ఆతఁడు బ్రహ్మ దర్పమును భంగ మొనర్చెను శివుని దర్పమును చెండాడెను, ఇంద్ర, సూర్యాగ్ని, దుర్వాస, ధన్వంతరి మొదలగువారి గర్వ మును గూడ నాశన మొనర్చినాఁడు, భక్తుల హృదయమున నేమాత్రము గర్వము సంభవించినను దానినణఁచివేయును, భక్తుల హృదయములలో నాతఁడభిమానము జేరనీయఁడు. దాని వ్రేళ్లను బాతుకొన నీయఁడు, పాతుకొనినా సమూల ముగఁ బెల్లగించి పారవేయును. అందువలన భగవద్భక్తున కవమానము కలిగినను, అభిమానము చూర్ణ మైనను నది భగవత్కృపయేనని తెలిసికొనవల

యును. తన యిష్టము ననుసరించి యెవ్వఁడును శాపము నొసంగఁడు, వరముల నొసంగఁడు. అంతయును భగవత్కృప వలననే జరుగును. భగవత్ప్రేరణచేతనే జరుగును. ఏది జరిగినను జీవుని కళ్యాణముకొఱకే జరుగును, దానివలన గుణపాఠము కలుగును. భగవంతునిపై విశ్వాసముంచి, నిరభిమానుఁడై జీవుఁడాతని నాశ్రయించినచో నాతని కెన్నటికిని ననిష్టములు జరుగవు. ఆతని కెల్లప్పుడును శుభమే.

సూతుఁడిట్లనెను:- "మునులారా! దేవల మహాముని దేహరూపాభిమానముండి యుండవచ్చును. అందుకనియే భగవానుఁడు రంభను బంపి అష్టస్థానములందు వక్రతను గలుగఁజేసి ఆతని రూపాభిమానమును హరించెను, ఆతఁడభిమాన శూన్యుఁడై భగవంతుని శరణువేఁడఁగా నాతనికి భగవల్లోక ప్రాప్తి కలిగెను. మునులారా! ధన, రూప, విద్యాదులందంతగా నభిమానము కలుగదు, గాని త్యాగ, సదాచారములకు సంబంధించిన నభిమానము మాత్రము తప్పక కలుగును, నా కన్నులతో మేము చూచిన విషయమును జెప్పుచున్నాను. తన బ్రహ్మచర్యము సదాచారము విషయములలో గర్వము వహించి యితరులను నిందించెడువారు. స్త్రీలను సేవగించుకొనెడువారు. వారిని దగ్గఱకును రానిచ్చెడువారు కారు. ఇతరులను గాంచి నవ్వుచుండెడువారు. ఇట్టివారు చివరకు స్త్రీలం

పటులై, స్త్రీలకుఁ గ్రీడా మృగములై వారికిఁ గ్రీతదాసులైరి. మానవులింకే యభిమానమునైనను వదలఁగలరు కాని యీ త్యాగాభిమానమెంతటి సుదృఢాభిమానమనఁగా దీనిని వదలుట చాల కష్టము. త్యాగము, గ్రహణము, సత్యము, అసత్యము, ధర్మము అధర్మము ఈ రెండు విధములగు నభిమానములను వదలనంతవఱకు భగవత్ప్రాప్తి దుర్లభము. మీరు నన్ను బ్రహ్మకు మోహినీశాపమెట్లు వచ్చినదని అడిగితిరి. ఈ కథచాల పెద్దది; కాని దానిని నేనత్యంత సంక్షేపముగ మీకుఁజెప్పెదను. బ్రహ్మకుఁదాను బ్రహ్మాండనాయకుఁడనను గర్వము కలిగెను. అందువలన భగవానుఁడీలీలను రచించెను. ఆ కథ యీ విధముగ నున్నది.

ఇది రైవత మన్వంతరమునకు సంబంధించిన కథ, ఆ సమయమున సుచంద్రుఁడను రాజు బదరీవనమున ఘోరముగఁ దపస్సును జేయుచుండెను. ఆతఁడుదివ్య సహస్రవర్షముల వఱకు భగవంతుని యందు మనస్సును లగ్నమొనర్చి తపస్సును జేయుచుండెను, ఆతని తపస్సునకుఁ బ్రసన్నుఁడై బ్రహ్మ ఆతనికి వరమొసంగఁబోయెను. ఆతఁ డేవరమును గోరక భగవంతుని యందహైతుకభక్తి కావలయునను వరమును గోరెను.

రాజునకు బ్రహ్మ యీప్సిత వరము నొసంగెను, రాజాసమయమున భగవంతునకుఁ బార్షదుఁడై - దివ్యచతు

వృద్ధ రూపమును ధరించి - భగవంతుని లోకమునకుఁ బోయెను. బ్రహ్మ హంసవాహనుఁడై తన బ్రహ్మలోకము నకు బోవుచుండెను. దైవికముగ నాతనికి మార్గమున స్వర్గ మున సర్వశ్రేష్ఠ సుందరియగు మోహినియను నప్సరస కనఁ బడెను. బ్రహ్మ ఆమె వైపునకుఁ జూడనైనఁజూడ లేదు. కాని విధివిధానమున మోహిని బ్రహ్మయొక్క తేజోరూప ప్రభావములను గాంచి దానిపై నాసక్తినిఁ జెందెను. కామ వేగముచే నామె మూర్ఛితయై పృథివి పైఁబడి పోయెను. ఆ స్థితిలో నచ్చటికామె సఖియగు రంభ అచ్చటకు వచ్చెను. ఆమె యామెమూర్ఛను దేర్చి మూర్ఛకారణము నడిగెను. మోహినీదేవి యదార్థము నంతయును జెప్పెను. తన మనస్సు బ్రహ్మపై లగ్నమైనదియు, నాతని యాలింగ నము లభింపకపోయెనా తా.ను మృత్యువు నాలింగన మొనర్తు ననియుఁ జెప్పెను. ఇఁకె మూఁడవసారి నాలింగన మోన ర్పను." అంత రంభ యిట్లనెను:- "నీవు కామదేవునుపా సింపుము. ఆతఁడు స్త్రీలపై శీఘ్రముగ దయఁజూపును. ఆతని సహాయమున నీవు కోరిన కోరికను నెఱవేర్చుకొనఁగలవు."

రంభ సలహా ననుసరించి మోహినీదేవి కందర్పో పాసనను గావించెను. మన్మథుఁడు ప్రత్యక్షమై మోహినికి దర్శన మొసంగెను. వరమడుగుమనెను. మోహినీదేవి తన యభీష్టవరమును బొంది కాముని వెంట బ్రహ్మలోకమునకు

బోయెను. దైవికముగ నప్పుడు బ్రహ్మ ఏకాంతమున నత్యంత సుందరోద్యానవనమునఁ గూర్చుండి యుండెను. మోహిని అచ్చటికిఁబోయి ఆతనిసమ్ముఖమున సుందర గానము నొనర్చెను, నృత్యమొనర్చెను. హావభావ కటాక్షములద్వారా లోకపితామహుని సంతోష పెట్టుటకుఁ బ్రయత్నించెను. మన్మథుఁడునునిప్పుడు తన శక్తి నంతను విని యోగించెను. బ్రహ్మమనస్సు చంచలించెను. ఆతని నేత్రములందనురాగ తంతువులు స్పష్టముగఁ గనఁబడెను, స్త్రీ లాకృతిని గాంచియే భావమును గనిపెట్టఁగలరు. మోహినియొక్క హర్షమునకు మేఁఱ లేకుండెను. ఆమె యింక నెక్కువగఁ కామచేష్టల నొనర్ప నారంభించెను. బ్రహ్మ యిప్పుడు సంబాళించుకొనెను. ఆతఁడిట్లనుకొనెను:- "చాల వ్యాకులత కలుగుచున్నది. నాల్గు కన్నులుకాఁగానే అనురాగ మధికమగును." అని అనుకొని యాతఁడు మోహినీ వైపునుండితన దృష్టిని మరలించి, తలను వంచుకొని, బహు మూల్యమగు హారమును బారితోషికముగ నొసంగి ఆమెను బంపివేయఁ దలఁచెను. కాని మోహిని హారలోభమున వచ్చినదికాదు. బ్రహ్మను లక్ష్యముగఁ బెట్టుకొని మన్మథుఁ డాతని మనస్సును మథింప నారంభించెను. ఆమె బ్రహ్మనో మృత్యువునో ఆలింగన మొనర్చుటకు గృతనిశ్చయమై యుండెను.

బ్రహ్మయొక్క ఔదాసీనతను గ్రహించి ఆమె యిట్లనెను:- 'పద్మసంభవా! నే నేవస్తువు కోఱకును నీకడకు రాలేదు. నేను నీకృపను గాంక్షించుచున్నాను.''

బ్రహ్మ ఉదాసీన భావముతో నిట్లనెను:- ''నాకు ప్రాణులందఱపై సమానమగు గృప కలదు. నేను నీ నృత్య గీతములకుఁ బ్రసన్నుఁడనై తిని, ఇఁక నీవు పోవచ్చును.''

సూతుఁడిట్లనెను; 'మునులారా! ఎవరి మనస్సెచ్చట రమించునో అచ్చట నా వస్తువును నెవఁడును స్వేచ్ఛగా వదలఁడు. మోహినికి తన ప్రయత్నము విఫలమైనదని తెలి యఁగానే ఆమె మన్మథుని స్మరించెను. కాముఁడు సుదృఢ ములగు దన శరములను దీసికొని బ్రహ్మపైఁ బ్రహార మొన ర్చెను, వేదగర్భుఁడగు బ్రహ్మ మారుని ప్రహారములకు మొదట మర్మాహితుఁడై తరువాత జ్ఞానదృష్టిచే సర్వరహ స్యమును గ్రహించెను. ఆతఁడు సుమనున కిట్లు శాప మొసంగెను:- 'నీవు నాకు బుత్రుఁడవయ్యును బ్రహార మొనర్చుచున్నావు. కావున నీ శరీరము నశించుఁగాక !'' ప్రసూనశరుఁడిది విని పాఱిపోయెను.

ఇప్పుడు మోహినీదశ విచిత్రమయ్యెను. ఆమె మర్భర కామావేగముచే నత్యంత దుఃఖితయయ్యెను. ఆమె శరీరము కంపించుచుండెను. ఆమె అనేక విధముల వినయముల నొన

ర్భుచు, ధర్మమని చెప్పుచు బ్రహ్మను బ్రార్థించెను. కాని వేదగర్భుఁడగు బ్రహ్మ కలుఁగ లేదు. ఆతఁడిట్లనెను:- 'నేను చరాచరములకుఁ దండ్రిని, నీవు నాకు పుత్రివి. నీవు నాతో నిట్టి ప్రసంగ మొనర్పకుము. నేను వృద్ధుఁడను, నిష్కాముఁడను, తపస్విని, భగవద్భక్తుఁడగు వైష్ణవుఁడను, కామపీడ చాల కఠినమైనదని నాకు తెలియును. కాని నీవు యువకుఁడగు దేవకుమారునికడ కేగుటకైనను బ్రహ్మ, ఇంద్ర, వరుణ కుబేరులు కలరు వారి పుత్రులు కలరు. అశ్వనీ కుమారులున్నారు. వీరొక్కరి. కంటె నింకొకరు గొప్ప రూపవంతులగు యువకులు, వారిని భజించుము. నేను నీ తండ్రితో సమానుఁడను.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! బ్రహ్మ స్వయముగ సృష్టి వృద్ధి కొఱకే కాముని౯ దన శరీరమునుండి పుట్టించెను. తానే ఆతని వలలోఁ బడెను. పట్టుపురుగు తనలోని దారముచేతనే తాను బంధింపఁబడునుగదా! కాముని మించిన బలవంతుఁడీ లోకమున నెవ్వఁడును లేఁడు. సింహము నోటి కోఱలనైనఁ బెరుకవచ్చును. సుమేరువునఁ బెరుకవచ్చును. సముద్రము నింకింపఁజేయవచ్చును, అగ్నిపానమొనర్పవచ్చును. వాయువును వశమొనర్చుకొని బంధింపవచ్చును. కాని కందర్పుని దర్పదళన మొనర్పఁగల వారరుదుగనుందురు. కామవేగము నాపుకొనుట కష్టము. మోహిని

వేశ్య. ఆమె తనవేగము నాపుకొనఁజాలకపోయెను. ఆమె బ్రహ్మవస్త్రమును బట్టుకొనెను, బ్రహ్మ చిత్తము చంచలమయ్యెను. ఇప్పుడాతఁడేమి చేయఁగలఁడు ? ఈ సమయమున బ్రహ్మకాశ్రయము భగవంతుఁడొక్కఁడే, బ్రహ్మ మనస్సులో భగవద్రూపమును ధ్యానింపఁదొడంగెను. నోట భగవన్నామముల నుచ్చరించుచుండెను. భగవానుఁ డాతని ప్రార్థన మాలించెను. ఆ సమయమున నచ్చటికి జాలమంది ఋషులువచ్చిరి. వారిలో నత్రి, పులస్త్యుఁడు; పులహుఁడు వశిష్ఠుఁడు, క్రతువు, అంగిరుఁడు, భృగువు, మరీచి, కపిలుఁడు, లోముఁడు, పంచశిఖుఁడు,రుచి, ఆసురీ, ప్రచేతుఁడు, శుక్రుఁడు, బృహస్పతి, ఉతథ్యుఁడు, కరకుఁడు, కణ్వుఁడు, కశ్యపుఁడు, గౌతముఁడు, సనకుఁడు, సనందనుఁడు, సనాతనుఁడు, సనత్కుమారుఁడు, కర్దముఁడు, శాతాతపుఁడు, పిప్పలుఁడు, శంకుఁడు, పరాశరుఁడు, మార్కండేయుఁడు, లోమశుఁడు, మృకండుఁడు, చ్యవనుఁడు, దుర్వాసుఁడు, జరుత్కారు, ఆస్తీకుఁడు, విభాండకుఁడు, ఋష్యశృంగుఁడు, భారద్వాజుఁడు, వామదేవుఁడు, కౌశికుఁడు ఇంకను ననేకులగు ఋషులు వచ్చుటను గాంచఁగనే మోహిని సిగ్గుపడెను. ఎట్టి స్త్రీయైనను నపరిచిత పురుషునిఁ జూడఁగనే లజ్జిత యగును. ఆమె వెంటనే బ్రహ్మవస్త్రమును వదలి ఆతనిప్రక్కనే కూర్చుండెను. ఆమె హృద

యము దడదడ కొట్టుకొన నారంభించెను. శరీరము గడ గడ వణఁకుచుండెను. చెమటలు పట్టెను. చిత్తము, చంచల మయ్యెను. బ్రహ్మయొక్క వామపార్శ్వమున మెదలక సిగ్గుతోఁ గూర్చుండెను. తన పుత్రపౌత్రులను గాంచి బ్రహ్మయును సంబాళించుకొని కూర్చుండెను. అందఱును వచ్చి పితామహుని పాదపద్మములకు భక్తితోఁ బ్రణమిల్లిరి. బ్రహ్మయును నందఱను యథాయోగ్యముగ నాశీర్వదించెను.

కుశల ప్రశ్నానంతరము మునులు వినయముతో నిట్లనిరి:- "స్వామీ ! ఈ స్వర్గ వేశ్య మీవద్దనేల కూర్చుండినది ? ఈమెను మేము దేవలోకమునఁ జూచితిమి. ఈమె అప్సరసలలో శ్రేష్ఠురాలగు మోహినిగదా !"

ఈప్రశ్నను వినఁగానే మోహిని ఇంకను లజ్జించెను. మోహిని లజ్జించినదని బ్రహ్మగ్రహించెను. అందువలన నామె లజ్జను బోఁగొట్టుటకిట్లనెను:- "ఏమియును లేదు. చిన్నపిల్ల ఇచ్చటనాడవచ్చినది. ఆడి ఆడి అలసిపోయి, నా దగ్గఱ కూర్చుండినది. ఈమె నాకు పుత్రిక వంటిది." ఇట్లు చెప్పుచుండ బ్రహ్మకు నవ్వు వచ్చెను. దానిలో దన జితేంద్రియత్వముపై గర్వము కలదు. ఆ స్త్రీ పరవశత యందు పరిహాసము కలదు. ఆ మునులు సర్వజ్ఞులు. వారు

రహస్యము నంతను గ్రహించెను. వారును యథార్థమును గ్రహించి నవ్వుకొనిరి.

అందఱును నవ్వఁగనే మోహినీ హృదయమునకు లక్ష తేళ్లు కుట్టినట్లుండెను. పక్వమైన హృదయమున నసంఖ్యాకములగు సూదులు పొడిచినట్లుండెను. మునులారా! అత్యంత క్రోధమునఁ గామము నశించునని ఆయుర్వేద సిద్ధాంతము. అత్యంత కామ భావముచేఁ గ్రోధము నశించును. బ్రహ్మ పరిహాసముచే ఆమెకవమానముగఁ దోఁచెను. ఇప్పుడు కామము స్థానమున నామె హృదయమునఁ గ్రోధము వ్యాపించెను. క్రోధవశమున నామె గడగడ వణఁకనారంభించెను, ఆ కులటా భామినీ కుటిలానన మింక నధికముగఁ గుటిలమయ్యెను. ఆమె నేత్రములు క్రోధముచే మండిపోసాగెను. వానినుండి యెఱ్ఱనెఱ్ఱని జ్వాలలు బయలుదేరెను. పెదవు లదరెను. ఆమె నిండుసభలో లేచి నిలువఁబడి బ్రహ్మను సంబోధించుచు నిట్లనెను:- విధాతా! నీకు జ్ఞానిననుగర్వము కలదు. గొప్ప జితేంద్రియుఁడనని నీవనుకొనుచున్నావు, సరస్వతి యెడల నీవు చూపిన ననుచిత భావమందఱెఱిఁగినదే. నీవు నన్నుఁజూచి నవ్వుచున్నావు. నేను నర్తకిని, వేశ్యను, మమ్ములను దేవుఁడే సర్వగామినులనుగఁ జేసినాఁడు, నీ వెక్కడ నే నెక్కడ? నేను నీ దాసీలకును దాసిగానుండ నర్హను. అయినను నీవు నన్నుఁగాంచి

నవ్వుచున్నావు. అందువలన నేను నిన్ను శపించుచున్నాను. నీకు ప్రపంచమునఁ బూజ్యత్వము లేకపోవును గాక ! నీకెవరును నాలయమును నిర్మింపరు. నిన్నుఁబూజింపరు. అందఱకును వార్షిక పూజయెట్లు జరుగునో అట్లు నీకు జరుగనే జరుగదు. నీ పదవి ఎల్లప్పుడును మాఱిపోవుగాక ! బ్రహ్మ మాఱఁగనే ఇంక నడుగు వారెవరు నుండరు." ఈ విధముగ శాపము నొసంగి మోహినీదేవి మన్మథుని కడకుఁబోయెను. అచ్చటకుఁబోయి అచ్చటఁ దన కోరికను నెఱవేర్చుకొనెను, తరువాతఁ గామవేగము శాంతించిన మీఁదట. తాను స్వర్గ వేశ్యయైయుండి, చతుర్దశ భువనాధిపతియగు బ్రహ్మను శపించితినిగదా యను పశ్చాత్తాపము కలిగెను.

ఇచ్చట నా యప్సరస శాపము వలన సమస్త ఋషులును మునులును ఖిన్నులైరి. అందఱును బ్రహ్మతో నిట్లనిరి:- "పితామహా ! మీరు వైకుంఠనాథుని సమీపమునకు బోయిన నేమైన నుపాయమును జెప్పవచ్చును."

అందఱ సమ్మతిచే బ్రహ్మ శ్రీహరి సమీపమునకు వైకుంఠలోకమునకు బోయెను. అచ్చట, ప్రణామ నమస్కారానంతరము అతనికి సమస్త వృత్తాంతమును జెప్పెను. అంతయును విని భగవానుఁ డిట్లనెను:- "ఇందు నీ పొరపాటును గలదు. నీవు వేదమూలమవు, గురువులకు గురుఁ

డవు. సర్వజ్ఞుఁడవు. ఈ స్త్రీజాతి ప్రకృత్యంశ. స్త్రీ నవమానించినచోఁ బ్రకృతి నవమానించినట్లు, అట్టివాఁడు దాని ఫలము ననుభవించి తీరవలసినదే. మానవులు కామాధీనులైనపుడు, విశేషించి స్త్రీ యిట్టి స్థితిలో నుండఁగాఁ బరిహసించుటయు, నవ్వుటయును, నవమాన మొనర్చుట యును నివి అభిమాన ద్యోతకములు. నీకు బ్రహ్మనను గర్వము కలదు.''

బ్రహ్మ నమ్రతతో నిట్లనెను:– ''ఈబ్రహ్మండమున కధీశ్వరునిగా నీవేకదా చేసినది !''

బ్రహ్మకు దాను బ్రహ్మండాధిపతినను గర్వము సంభవించినదను విషయమును భగవానుఁడు గ్రహించెను. అదే సమయమున ద్వారపాలుఁడు వచ్చి యిట్లనెను:- ప్రభూ! బయట నొక బ్రహ్మ నిలువఁబడి యున్నాఁడు.''

బ్రహ్మచకితుఁడయ్యెను. బ్రహ్మను నేనొక్కఁడనే కదా! ఇంక బ్రహ్మయెవరు? అప్పుడు భగవానుఁడిట్లడిగెను:- ''ఏబ్రహ్మండమునకు బ్రహ్మ ?'' బ్రహ్మ ముఖము పాలిపోయెను. నా బ్రహ్మండముగాక యింకను బ్రహ్మండము కలదాయేమి ?'' భగవానుఁడు ద్వారపాలునితో లోనికి రమ్మని జెప్పుమనెను.

ఆ సమయమున నూఱు ముఖముల బ్రహ్మ చేతులను జోడించుకొని వచ్చి నిలుచుండెను. బ్రహ్మ కింతవఱకు నాల్గుముఖములు గలవాఁడను నభిమానము కలదు. ఇప్పుడు నూఱు ముఖముల బ్రహ్మను జూడఁగనే ఆతఁడడలిపోయెను. అదే విధముగ సహస్రముఖముల, లక్షముఖముల బ్రహ్మలును వచ్చుటకు వచ్చిరి. వీరందఱను గాంచఁగనే విష్ణు సదృశుఁడు కావలెను, మోహము దూరమయ్యెను, ఆతఁడు మూర్ఛితుఁడయ్యెను. ఆతఁడు లేచి చూచుచుండఁగనే భగవానుని యొక్క ప్రతిరోమ కూపమునను ననంతకోటి బ్రహ్మాండములు కనఁబడెను. వానికి వేఱువేఱుగ నింద్రులును మనువులును, ప్రజాపతులును, దేవతలును గలరు." దీనినిఁ గాంచగనే ఆతఁడు గర్వముడిగి భగవంతునకు భక్తుఁడయ్యెను. ఆ వచ్చిన బ్రహ్మలందఱును భగవానునకు ప్రణామము కావించి వెడలిపోయిరి.

బ్రహ్మకు మిక్కిలి లజ్జకలిగెను. అయ్యో నేనెంతటి యపరాధమును గావించితిని! ఆతఁడు లజ్జితుఁడై భగవంతుని యెదుటఁ దలవంచుకొని కూర్చుండెను. బ్రహ్మలజ్జను బోఁగొట్టు నుపాయమేమిటని భగవంతుఁ డనుకొనెను.

అంత శౌనకుఁడిట్లనెను:–"సూతా! తర్వాత నేమైనది? భగవానుఁడు బ్రహ్మ సంకోచము నెట్లు దూరమొనర్చెను?"

సూతుఁడిట్లనెను:- "మునులారా! భగవల్లీలలన్ని యును గల్యాణము కొఱకును, భక్తుల సుఖముకొఱకును నొనర్చుచుండును. బ్రహ్మ లజ్జితుఁడై కూర్చుండి యుండఁగా శంకరుఁడచ్చటికి వచ్చెను. ఋషులును, మునులును, దేవతలును నచ్చటికి వచ్చిరి. వారచ్చటికి వచ్చి భగవదాజ్ఞచే రాసకు సంబంధించిన దివ్యగానము నొనర్చిరి. ఆ గానమును విని సమస్త దేవతలును, ఋషులును, మునులును, చివరకు భగవంతుఁడును ద్రవీభూతులైరి. తర్వాత భగవానుఁడు తన యోగప్రభావముచే నందఱను వేఱు వేఱుగ నొనర్చెను. ఆ జలము ధారారూపమునఁ బ్రవహింపసాగెను. అది వైకుంఠమునుండి అది స్వర్గమునకు వచ్చెను. స్వర్గము నుండి పృథివికి వచ్చి గంగయను ఖ్యాతినిఁ బొందెను. భగవానుఁడిట్లనెను:- "బ్రహ్మ! నీవీగంగలో స్నానమొనర్పుము. నీవు శుద్ధుండవే. నీవలన నిది శుద్ధము కాఁగలదు." భగవదాజ్ఞచేఁ బద్మాసనుఁడు గంగలో స్నానమొనర్చెను. ఆతని లజ్జ దూరమయ్యెను. అంతనాతఁడు సరస్వతి నుపాసించెను, సరస్వతి ఆతని స్వీకరించెను. ఆమెతో నాతఁడు సుఖముగ నుండుచు బ్రహ్మాండమును బాలించుచుండెను.

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! బ్రహ్మ వేదగర్భుఁడు. గొప్పజ్ఞాని. అట్టివాఁడు మోహిని నేలఁ బరిహాసము కావించినాఁడు?"

సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! పరిహాస మెందులకా? ఇదంతయును భగవల్లీల. బ్రహ్మ అన్యుఁడు కాఁడు. భగవత్స్వరూపమే. ఆతఁడెప్పుడెట్టి క్రీడ నొనర్పఁ దలఁచునో అప్పుడా వేషమును ధరించి క్రీడ యొనర్చును. ఆతఁడు గొప్ప క్రీడా ప్రియుఁడు. నటకుఁడు, మాయావి.

కామము లేకున్న సంసారోత్పత్తి లేనే లేదు. సంసారమే లేకున్నఁ గ్రీడ యేమి యున్నది. సాలీడువలె వలనల్లుకొని తానే దానిలో విహరించును. కాదనుకొనినఁ దనలోనికిఁ గొనిపోవును, భగవానుఁడు సృష్టికొఱకు బ్రహ్మను సృష్టించెను, బ్రహ్మ సృష్టి యొనర్చుటకు బుత్రుల నుత్పన్నము కావించెను. వారెవరును సృష్టి యందు ప్రవృత్తిని జెంద లేదు. అప్పుడు బ్రహ్మ ఒక కన్యకను గాముని నుత్పన్నము కావించెను. కామునకు బాణముల నొసంగి యిట్లనెను:- "నీవు సర్వవిజయుఁడవు కాఁగలవు. అందఱును నీకు వశులు కాఁగలరు."

భస్మాసురునివలె మన్మథుఁడు మునుముందుగా బ్రహ్మపైననే తన యమోఘాస్త్రమును బరీక్షించెను బ్రహ్మాస్త్రమమోఘము. ఎదుటనుండిన దన పుత్రికపై నాతని దృష్టి పడెను. తర్వాత లజ్జించి నాతఁడు తన శరీరమును ద్యజించెను. ఆ కన్యకయును మరణించెను. ఋషులు భగవంతుని స్మరించిరి. భగవానుఁడు వచ్చి తన

యోగ ప్రభావమున బ్రహ్మను బ్రదికించి యిట్లుపదే శించెను:- "బ్రహ్మ! నీవు సృష్టి యొనర్పవలయును. కామముచేతనే సృష్టి. కాని ఆ కామము ధర్మావిరుద్ధముగ నుండవలయును. ధర్మ విరుద్ధమగు గామము నెవరు సేవిం చెదరో వారు నరకమును బొందెదరు, ప్రపంచమున రెండే పాపములు కలవు, అవి పరస్త్రీ పరధనములను గోరుట. పరస్త్రీని సేవించినవారికి క్షయరోగాదులు సంభవించును. వారి జ్ఞానము నశించును. ఈ లోకమున వారికపకీర్తి కలు గును. ఉత్తమ పురుషుఁడు సదా భగవంతునిఁ జింతిఁచు చుండును. మధ్యమ పురుషుఁడు సదాసత్కర్మములందు లగ్నమై యుండును. అధమ పురుషుఁడు స్త్రీలంపటుఁడై యుండును. వారెల్లప్పుడును స్త్రీరూపమునే చింతించు చుందురు. ఏకాంతమున స్త్రీని జూడఁగనే పురుషునకును, బురుషుని జూడఁగనే స్త్రీకిని మోహము కలుగును. ఈ కామదేవు నాతఁడందులకే సృజించినాఁడు. ఈలీల కామ దేవుని ప్రభావమును జూపుటకే జరిగినది. ఇంక నీ మనస్సు విచలితము కాఁజాలదు. ఈ పిల్ల మరల జీవితయై కాము నకు బత్ని కాఁగలదు. ఈమె రతీయనఁబడును. ఈరతీ మన్మథులిద్దరును బ్రపంచమును మోహమునఁ బడవైచె దరు. దాని వలన సృష్టివ్యాపారము జరుగునుఁ "ఇప్పుడింక నేస్త్రీనైనను గామభావమునఁ జూడకు"మని చెప్పి భగ

వానుడంతర్థానుఁడయ్యెను. బ్రహ్మసృష్టిలో నిమగ్నుడయ్యెను. భగవద్వ్యాపదేశమాతనికి, జ్ఞాపకమున్నది. అందువలన నెంతగాఁ బ్రార్థించినను బ్రహ్మ మోహినికి వశపడలేదు."

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! ఇందు విరించి దోషమేమున్నది? ఆతఁడు భగవదాజ్ఞను బాలించినాఁడు. అట్టియెడ కులటయగు నప్సరస శాపమువలన నాతఁడపూజ్యుఁడేలనైనాఁడు? ఇది తల క్రిందులైనది."

అంత నవ్వి సూతుఁడిట్లనెను:- "ఈ వేశ్యా పరిత్యాగము వలనను, ఆమె శాపమువలనను బ్రహ్మ అపూజ్యుఁడు కాలేదు. బ్రహ్మకు దానే బ్రహ్మాండ నాయకుండ ననియు, జగదధీశ్వరుఁడననియు నభిమానము కలదు. ఆ యభిమానమును నాశ మొనర్చుటకై భగవానుఁడీ లీలను రచించినాఁడు. మోహినిచే శాపము నిప్పించినాఁడు, తన యైశ్వర్యమును జూపినాఁడు. స్వామీ! గర్విష్ఠుల గర్వమణంచుటయే శ్రీహరి కార్యము, ఆతని నామము మదహరి. ప్రపంచమున గర్వమున్నవారి గర్వమును భగవంతుఁడణంచును. గర్వమున్నచోట భగవానుఁడుండఁడు. అభిమానమునకు భగవంతుఁడు శత్రువు. భక్తుని హృదయములోనికి గర్వము వచ్చెనా, ఏదో మాయను రచించి దానినిఁ జూర్ణమొనర్చును. ధనైశ్వర్య సదాచార, ప్రభుత్వాద్యభి

మానములేవి మనస్సులోనికి వచ్చినను మదము పెరుగును. ఆ యభిమానము తన భక్తునిఁ బతనము గావించునని ఆ గర్వము నణఁచును. బ్రహ్మమదము నాతఁడెట్లణఁచెనో శంకర, పార్వతీ, చంద్ర, సూర్యోగ్ని, దుర్వాస, ధన్వంత ర్యాదుల మదమునుగూడ క్రమముగ నణఁచెను,

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! శంకర, పార్వతీ, చంద్ర, సూర్యాగ్ని, దుర్వాస, ధన్వంతురలకు మదమేల గలిగినది? భగవానుఁడు వారి మదము నెట్లణఁచెను. దయ చేసి యీ కథలను మాకు జెప్పవలెను."

అంత సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీరిట్టి ప్రశ్న లను వేయఁబ్రారంభించినచో రాసలీల అయినట్లే. నాకు రాసలీలను వర్ణింపవలయునని కుతూహలముండఁగా మీరు మదభంగమైన కథల నడుగుచున్నారు. స్వామీ! ఈ కథల పరంపర కంతముండదు. ఈ కథ లపారములు, ఏ రాసలీలను గానమొనర్చుటచే ఋషులును, మునులును, దేవతలును, చివరకు భగవానుఁడు గఱఁగిపోయిరో అట్టి రాసలీలను వినుఁడు."

అంత గంభీరుఁడై శౌనకుఁడిట్లనెను:- "సూతా! రాస లీలా ప్రసంగము నొనర్చుటకు నీ వెట్లువ్విళ్లూరు చున్నావో, మేమాదివ్య ప్రసంగమును విన నువ్విళ్లూరు

చున్నాము, మహాభాగా! ప్రసంగవశమున వచ్చినదానిని వినుటచే నీవిషయమునందుత్కంఠత యింకను నధికమగును. నీ వీ కథలను విస్తరింప వలదు. అత్యంత సంక్షేపమున సార రూపముగఁ జెప్పుము. ఈ కథలవలన మంచి గుణపాఠము కలుగును. ఇప్పుడీ బ్రహ్మ కథవలన వివశతను గాంచి యెగతాళి చేయఁగూడదను నీతిని, ఎవరిని వ్యంగముగఁ బలుకఁగూడదనియు, అట్లొనర్చిన నాతఁడు సాక్షాత్తుగ బ్రహ్మయైనను నపూజ్యుఁడగుననియు, బ్రపంచమున వారి కీర్తి నశించుననియును, గుణపాఠమును నేర్చుకొంటిమి. ఈ కథలవలన నేమి గుణపాఠము లభించునాయని చూచుకొన వలయునుగాని బ్రహ్మయే జారిపోయిన నింక మనగతి యేమి కావలయునని అనుకొనరాదు. భగవానుఁడిట్టి లీలలను గుణ పాఠముకొరకేర్పఱచును. నీవు మా ప్రార్థనమును మన్నిం పుము. ఈ కథలను సంక్షేపముగ మాకు జెప్పుము. తద నంతరము రాసవిలాసముయొక్క సరససుందర సారమయ సరితను బ్రవహింపఁ జేయుము.

సూతుఁడిట్లనెను:- "సరే, స్వామీ! మీ యాజ్ఞాను సారమే చేయుదును. నేను కథను జెప్పవలయునుగదా! ఇవి యును బరమశిక్షా ప్రదములగు భాగవత చరిత్రల లోనిదే. ముందుగా నేను వానినే చెప్పెదను."

## శివ దర్పభంగము

### (౧)

మునులారా! ఒకసారి శివునకు దాను మహాదేవుఁడననియు, దేవతలందఱిలో శ్రేష్ఠుఁడనియు, ఆశుతోషుఁడననియు, వరప్రదాతలలో శ్రేష్ఠుఁడననియు గర్వము సంభవించెను. అందువలన భగవానుఁడు లీలను రచించెను. మహానుభావులారా! శివకేశవు లిద్దరుకారు. శివుని హృదయమున సదా విష్ణువు నివసించును. విష్ణువు హృదయమున సదాశివుఁడు నివసించును. శివుని యిష్టదైవము విష్ణువు. విష్ణుని యిష్టదైవము శివుఁడు. ఏదైన లీలయొనర్చునపుడిద్దఱిలో నొకఁడు స్వామియగును. ఒకఁడు సేవకుఁడగును. నాటకమున నిదియే జరుగుచుండును. తండ్రి కొడుకగును, కొడుకు తండ్రియగును. వృకాసురుఁడను వాఁడుండెను. ఆతఁడు శివునారాధించి యెవని శిరస్సున జేతులను బెట్టిన వాఁడు నశింపవలయునను వరమును బొందెను. శివుఁడు తథాస్తనెను. ఆ దుష్టుఁడు గౌరిని హరింపవలయునను లాలసతో శివుని నెత్తియందే చేతులను బెట్టఁబోయెను. అప్పుడు శంకరుఁడు భగవానుని శరణువేఁడెను. భగవానుఁడు గొప్ప యుక్తిచే వాని శిరస్సుననే చేతులను బెట్టుకొనునట్లొనర్చెను ఇట్లు శివుని దర్పణమణఁగెను. అప్పుడు భగ

వానునే సర్వశ్రేష్ఠుఁడని తెలిసికొానెను. ఇచ్చట నీ కథను నేను సంకేతమాత్రముగఁ జెప్పితిని. ముందు నేను దీనిని విస్తారముగఁ జెప్పెదను.

(౨)

## దుర్గా దర్ప దళనము

దుర్గాదేవి దుష్టులను వధించి దక్షపుత్రియగు సతీ రూపమున నవతరించెను. ఆమె పొరపాటున సీతారూప మును ధరించెను. అందువలన నామెను శంకరుఁడు పరిత్య జించెను, అచ్చట తన తండ్రికి ప్రజాపతి పతినైతినను గర్వము కలిగెను. ఆతని గర్వమును నాశ మొనర్చుటకై సతీదేవి ఆతని యజ్ఞమున శరీరమును త్యజించెను. శివుఁడు వీరభద్రుని ద్వారా దక్షుని గర్వమును ఖర్వమొనర్చెను. ఈ కథను విస్తారముగ నేనిదివరకే చెప్పితిని. ఆ సతీదేవియే హిమవంతునికడ పార్వతిగా నవతరించెను. హిమవంతుఁడు తన కుమార్తెను శివునికిచ్చి వివాహము చేయఁదలఁచెను. కాని శివుఁడు నిస్పృహుఁడు, త్యాగి, విరాగిగా నుండెను. అట్టివాఁడు పెండ్లి యెట్లు చేసికొనును. తన కుమార్తె త్రైలోక్యసుందరి కావున నామె యందమును జూడఁగానే ఆమెను పెండ్లాడునని హిమవంతుఁడాలోచించి శివునికడకు బోయి యిట్లనెను:- "స్వామీ! నా పుత్రిక మీకు సేవ

చేయుచుండిన హానియేమి కల"దనెను. "హాని యేమి యును లే"దని శివుఁడనెను.

ఇప్పుడు పార్వతి నిత్యము సేవకొఱకై వచ్చు చుండెను. శివుఁడామె సేవచే నత్యంత సంతుష్టుఁడయ్యెను. ఆతఁడు సర్వదా ఆమెకు వశుఁడయ్యెను. శివుఁడు తన రూపమును గాంచి ఆసక్తుఁడైనాఁడని పార్వతికి గర్వము కలిగెను. కామ వశుఁడై నాఁడనుకొనెను, శివుఁడిట్లను కొనెను - నా ప్రియా హృదయమున నిట్లు గర్వము కలు గుట ఉచితముకాదు. ఆ సమయమున నాతఁడు తన మూఁడవ కంటిచే మన్మథునిఁ గాల్చివైచెను. పార్వతి యెడల నుదాసీనుఁడయ్యెను. దీనినిఁ గాంచఁగనే పార్వతి యొక్క గర్వమంతయును నణఁగిపోయెను. ఆమె ఘోర తపస్సును గావించి శివునిఁ బ్రసన్నునిఁ గావించుకొని మరలఁ బొందెను. ఇదివఱలో నేనీ కథను విస్తారముగఁ జెప్పనే చెప్పితిని.

3

## ఇంద్ర దర్ప నాశనము

ఇంద్రుని దర్పనాశన కథను గూడ నే నిదివఱలోఁ జెప్పియుంటిని. నేను త్రిలోకాధిపతిని, బృహస్పతి రాఁగానే లేచుటేమియును గర్వము కలిగెను. ఒక దినమున గురువు

రాఁగానే సింహాసనమునుండి లేవలేదు. దీనివలన నాతని శ్రీ నష్టము కాఁగాఁ బదభ్రష్టుఁడై అటునిటుఁ దిరుగుచుండెను. అభిమానవశమున నాతఁడు గౌతమపత్నియగు నహల్యతో ననుచిత వ్యవహారమొనర్చెను. తన పురోహితుఁడగు విశ్వరూపుని వధించెను. దీనివలన నాతనికి బ్రహ్మహత్య సంభవించెను. ఋషులు యజ్ఞమొనరింపఁ జేసి నిష్పాపుని గావించిరి. ఆతఁడు మరల స్వర్గైశ్వర్యమును భోగింప నారంభించెను. ఎనలేని దివ్యనగరమును నిర్మించుమని ఆతఁడు విశ్వకర్మ కాజ్ఞాపించెను, దానిని రాత్రింబవళ్ళు నిర్మించుచుండిరి. నూరు వర్షములైనను నింద్రునకుఁ దృప్తి కలుగలేదు. మేడపై మేడలు లేచుచుండెను. విశ్వకర్మ కొలిచి కొలిచి అలసిపోయెను ఆతఁడెప్పుడింటికి పోవలయునని ప్రార్థించినను ఇంద్రుఁడాతని గద్దించి పనినిఁ బూర్తి కావించి పోవలె ననెను.

విశ్వకర్మ చాల భయపడెను. ఈతని పని యెప్పటి కగునా యనుకొనెను. ఆతఁడు భగవంతునిఁ బ్రార్థించెను:- "ప్రభూ! నన్ను యింద్రుని బారినుండి తప్పించుకొననిమ్ము." భగవంతుఁడన్నిటిని వినును. ఆతఁడొక చిన్నపిల్లవాని రూపమును ధరించి ఇంద్రునికడకు వచ్చెను. ఇంద్రుఁడు బాలకునకు సత్కారమును గావించి వచ్చిన కారణమడిగెను.

బ్రాహ్మణుఁడిట్లనెను:- "సురేంద్రా! నీవీ నగరమును మిక్కిలి సుందరముగఁ గట్టించుచున్నావు, ఇట్టి నగరము నిదివఱలో నే యింద్రుఁడును నిర్మించలేదు. ఏ విశ్వకర్మయును గట్టను లేదు."

పిల్లవానినోట పెద్దమాటలను విని యింద్రుఁడు నవ్వి వ్యంగ్య స్వరమున నిట్లనెను:- "దాతగారు! మీరెంతమంది యింద్రుల నెఱుంగుదురు?"

బాలకుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "దేవేంద్రా! నీ వింద్రుల నడుగుచున్నావు. నేను మీతండ్రియగు గశ్యపు నెఱుఁగుదును. ఆతని తండ్రి మరీచి నెఱుఁగుదును. మరీచి తండ్రియగు బ్రహ్మ నెఱుఁగుదును. ఆతని తండ్రియగు నారాయణుని గూడ నెఱుఁగుదును. బ్రహ్మ పగట పదునలుగురు ఇంద్రులు పుట్టెదరు. ఆతనికి 360 రోజులైన నొక సంవత్సరమగును. అట్లు బ్రహ్మ నూటయెనిమిది సంవత్సరములు జీవించును. తర్వాత నింకొక బ్రహ్మ వచ్చును. ఇట్లసంఖ్యాకులగు బ్రహ్మలైరి. వారి నందఱను నే నెఱుఁగుదును. ఈ బ్రహ్మాండమెట్లున్నదో అట్లే అసంఖ్యాకములగు బ్రహ్మాండములుత్పన్నములగును. ఆ బ్రహ్మాండములన్నిటిలో వేఱు వేఱుగ బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్రమను, దేవతా, ప్రజాపతి, ఋషిగణములుందురు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఆ బాలుని నోట యీ మాటలు వినఁగానే యింద్రుని కాశ్చర్యము కలిగెను. ఆ సమయమున నచ్చట నొక బిలమునుంచి చిన్న చిన్న చీమలు కోట్లకొలఁదిగ వెలువడుచుండెను. ఆ చీమ దండు లను గాంచి ఆ విప్రబాలకుఁడు నవ్వనారంభించెను.

ఇంద్రుఁడిట్లనెను:- "బాలకా! నీవు నవ్వుచుంటివేల?"

బాలక రూపముననున్న హరియిట్లనెను:- "నేను నవ్వుటేల ననఁగా నీ చీమలెన్నికలవో, నీ తరువాతఁ గ్రమ ముగ వీరందఱును నింద్రులయ్యెదరు."

ఇంద్రునకు జాల యాశ్చర్యము కలిగెను. ఇంతలో నచ్చటకు లోమశ మహాముని వచ్చెను. ఆతని "నీనెవఁడ" వని భగవానుఁడడిగెను.

ఆతఁడిట్లనెను:- "స్వామీ! నన్ను లోమశుఁడందురు. ఒక బ్రహ్మ పోఁగానే నేను నా రోమము నొక్కదానినిఁ బీకి పాఱవైచెదను. అసంఖ్యాకులగు బ్రహ్మలు నాముందు పోయిరి."

ఇది వినఁగానే యింద్రునకు జ్ఞానము కలిగెను. ఆతఁడు వటు రూపమున నున్న భగవానునకుఁ బ్రణామము కావించెను. విశ్వకర్మను వెంటనే పంపివైచి, ఆతఁడు బ్రహ్మ

జ్ఞాని యెయ్యెను. తానే త్రైలోక్యాధిపతినను గర్వ ముడిగెను.

౮

## సూర్య దర్ప భంగము.

ఇట్లే ఒకసారి త్రిలోకములకుఁ దానే ప్రకాశ మొసంగెదననియు, తనకు మించినవా రెవరనియు సూర్యు నకు గర్వము కలిగెను. ఆ సమయమున మాలి, సుమాలి యను దైత్యులిద్దఱుండిరి. వారు శివునిఁ బ్రసన్నునిఁ గావించుకొని ఒక విమానమును సంపాదించుకొనిరి. సూర్యుఁడస్తమించఁగానే వారిద్దరును విమానము నెక్కి ప్రకా శముచే రాత్రిని గూడ పగలుగఁజేసిరి. సూర్యుఁడు క్రోధించి తన వజ్రముచే వారినిఁ జంపివైచెను, కృపాళుఁడగు శంక రుఁడు వచ్చి వారిద్దరను బ్రదికించగా వారు సూర్యునిఁ జంప నాతని వెంటఁబడిరి. రక్షింపుమని సూర్యుఁడు బ్రహ్మను శరణు వేఁడెను. బ్రహ్మ దివ్య స్తోత్రముచే శివుని స్తుతించి ఆతనిఁ బ్రసన్ను నొనర్చుకొనెను. శివుఁడు బ్రహ్మస్తోత్ర ముచే సంతుష్టుఁడై యిట్లనెను:- "మంచిది. నేను నీవు చెప్పుటచే సూర్యుని వదలుచున్నాను. ఇంక నీతఁడిట్లు గర్వము చెందరాదు. "శివుని ఉపదేశమును విని సూర్యుఁ డాతని చరణములపై బడి తన గర్వమును త్యజించెను. ఈ విధముగ సదాశివునివలన సూర్యుని దర్పమడఁగెను.

౫౧

## అగ్ని గర్వ మడఁగుట

అగ్నికిని ఒకసారి యిట్టి యభిమానము కలిగెను. భృగు వాతనికి సర్వభక్షకుఁడవు కమ్మని శాపమొసంగెను. దాన నాతనికిఁ గోపము వచ్చెను. ఆతఁడిట్లనెను:- "నేనే దేవతల ముఖమును, అందఱ కాహారము నందించెదను. ప్రాణుల శరీరమందుండి అందఱకును జీవనదాన మొనర్చెదను. అట్టి నాకీ చిన్నముని యిట్టి దారుణ శాపమొసఁగినాఁడు. ఇఁక నేను ముల్లోకములను భస్మమొనరించెదను" అని పలికి ఆతఁడు నూఱు తాళ్ళెత్తు మంటలతోఁ ద్రిలోకములను భస్మమొనర్ప నుద్యమించెను. అతని గర్వమును గాంచి భగవానుఁడు బాలకుని వేషమును ధరించి, ఆతని సమ్ముఖమునకు వచ్చి, మంటల కేమియు భయపడక నవ్వుచు నగ్ని నిట్లడిగెను:- "హుతాశనా! నీవేల నింతగాఁ గ్రోధముతో నున్నావు?"

అగ్ని క్రోధముతో నిట్లనెను:- "భృగుముని నన్ను సర్వభక్షివి కమ్మని శపించినాఁడు. కావున నేను ద్రిలోకములను భస్మమొనర్తును."

నవ్వి బాలకరూపుఁడగు హరియిట్లనెను:- "ఇది బాగున్నది. దేవదత్తుఁడు దొంగిలింపఁగా యజ్ఞదత్తు నుఱి

కెక్కించినట్లున్నది. భృగువు నిన్ను శపించినాఁడు కావున భృగువునే భస్మమొనర్పుము. త్రిలోకములు నిన్నేమి చేసినవి? అపరాధము లేకయే త్రిలోకములను గాల్పనేల ? ఈ త్రిలోకములను బ్రహ్మ సృజించినాఁడు, విష్ణువు పాలన మొనర్చుచున్నాఁడు, రుద్రుఁడు సంహార మొనర్చుచున్నాఁడు వీనినిఁ గాల్చుటకు నీకేమి అధికారమున్నది?''

అగ్ని యిట్లనెను:- "నేనే పాలన మొనర్చుచున్నాను. నే నన్నమును బచన మొనర్పకుండిన నే దేవుఁడైన బ్రదుకునా ? నా శక్తి వలననే ప్రపంచమందలి సకల కార్యములును జరుగుచున్నవి.''

భగవానుఁడిట్లనెను:- "నీలో నేమి శక్తియున్నది?''

అగ్ని యిట్లనెను:- "నా ముందే వస్తువున్నను గాల్చివేయు శక్తికలదు.''

ఇది విని వటురూపియగు భగవానుఁడు తన చేతిమీఁద నొక యెండుటాకు నుంచుకొని యిట్లనెను:- "ఇప్పుడు దీనినిఁ గాల్చి చూపింపుము.''

అగ్ని తన బలమునంతను బెట్టి కాల్చఁజూచెను, కాని యా యాకును గాల్పఁజాలక పోయెను. అప్పుడగ్నికి మిక్కిలి లజ్జ కలిగెను, ఆతని దర్పమంతయును దళితమయ్యెను.

ఆతఁడు గడగడ వణఁకుచుఁ దన శక్తికి ముఖ్యకారణము భగవంతుఁడని తెలిసికొనెను.

౬

## దుర్వాస దర్ప భంగము

దుర్వాస మహామునికిని దనకు శాపమొసంగు శక్తి కలదను గర్వము కలదు. ఆతఁడు శివునియొక్క అంశావతారము. ఈతనికిని అంబరీషునికడ గర్వభంగమయ్యెను. ఈతని కథను నేనిదివఱలోఁ జెప్పనే జెప్పితిని.

౭

## ధన్వంతరి దర్ప దళనము

ఒకసారి భగవానుని అంశావతారమగు ధన్వంతరికిని దన నెవరును నోడింపఁజాలరను గర్వము సంభవించెను. విష హారిణీ విద్యను గరుత్మంతుఁడు శివునినుండియును, గరుడుని వలన ధన్వంతరియును నేర్చుకొనిరి. ఈ సంబంధమున ధన్వంతరి గురువు గరుడుఁడు, పరమ గురువు మహాదేవుఁడు ఒకసారి ధన్వంతరి తన పరమ గురువగు పరమేశ్వరుని కడకు బోవుచుండ నాతనికి దారిలోఁ దక్షకనాగము పడియుండుటను గాంచెను. ఆతని ఫణాగ్రమున దివ్యమణులు వెలుఁగుచుండెను. ఆతనికి ఉల్బణ విషమున్నదను గర్వము కలదు.

ఆతని వెంట లక్షలకొలఁది సర్పములుండును. అవన్నియును శిష్యసమేతుఁడై పోవుచుండిన ధన్వంతరిని గఱచుటకుఁ బరువిడెను. వారి మూర్ఖతను గాంచి ధన్వంతరి నవ్వెను. ఆతనికి దంభుఁడను శిష్యుఁడుండెను. ఆతఁడు మంత్రములద్వారా తక్షకుని జృంభిత మొనర్చెను. ఆతఁడు మంత్ర ప్రభావముచే మూర్ఛితుఁడయ్యెను. దంభి దాని నెత్తి త్రాటినిఁ ద్రిప్పినట్లు త్రిప్పి, దాని మణిని హరించెను. దాని నట్లే చచ్చినదాని వలెఁ బడవైచెను. అది అచేతనముగఁ బడి యుండెను. దాని యనుచరులు నాగరాజగు వాసుకికిఁ దెలిపిరి. సమాచారమును విని వాసుకి ద్రోణ, కాళీయ, కర్కోటక, పుండరీక, ధనంజయాది అయిదుగుర సేనాపతిత్వముక్రింద చాలమంది నాగులను బంపెను. ధన్వంతరి వారి నందఱను మంత్ర ప్రభావముచే నిశ్చేష్టుల నొనర్చెను.

వాసుకి యీ విషయమును వినఁగానే తన సోదరియగు మానసినిఁ బంపెను. ఆమెయును శివుని శిష్యురాలే. ఆమె పోయి ధన్వంతరితో ననేకాస్త్రశస్త్రములద్వారా యుద్ధ మొనర్చెను. ఆమె కుమారి. కన్యక. చివరకామె ధన్వంతరియొక్క అస్త్రశస్త్రములనన్నిటిని, మంత్రములను నోషధులను వ్యర్థ మొనర్పఁగా నాతఁడు క్రోధమున శివుని శూలము నెత్తెను. ఆ సమయమున నచ్చటికి శివుఁడును,

ఆతనివెంట లక్షలకొలఁది సర్పములుండును. అవన్నియును శిష్యసమేతుఁడై పోవుచుండిన ధన్వంతరిని గఱచుటకుఁ బరువిడెను. వారి మూర్ఖతను గాంచి ధన్వంతరి నవ్వెను. ఆతనికి దంభుఁడను శిష్యుఁడుండెను. ఆతఁడు మంత్రములద్వారా తక్షకుని జృంభిత మొనర్చెను. ఆతఁడు మంత్ర ప్రభావముచే మూర్ఛితుఁడయ్యెను. దంభి దాని నెత్తి త్రాటినిఁ ద్రిప్పినట్లు త్రిప్పి, దాని మణిని హరించెను. దాని నట్లే చచ్చినదాని వలెఁ బడవైచెను. అది అచేతనముగఁ బడియుండెను. దాని యనుచరులు నాగరాజగు వాసుకికిఁ దెలిపిరి. సమాచారమును విని వాసుకి ద్రోణ, కాలీయ, కర్కోటక, పుండరీక, ధనంజయాది అయిదుగురి సేనాపతిత్వముక్రింద చాలమంది నాగులను బంపెను. ధన్వంతరి వారి నందఱను మంత్ర ప్రభావముచే నిశ్చేష్టుల నొనర్చెను.

వాసుకి యీ విషయమును వినఁగానే తన సోదరియగు మానసినిఁ బంపెను. ఆమెయును శివుని శిష్యురాలే. ఆమె పోయి ధన్వంతరితో ననేకాస్త్రశస్త్రములద్వారా యుద్ధ మొనర్చెను. ఆమె కుమారి. కన్యక. చివరకామె ధన్వంతరియొక్క అస్త్రశస్త్రములనన్నిటిని, మంత్రములను నోషధులను వ్యర్థ మొనర్పఁగా నాతఁడు క్రోధమున శివుని శూలము నెత్తెను. ఆ సమయమున నచ్చటికి శివుఁడును,

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! రసమని దేని నందురు?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! మనస్సుద్వారా, నాకి, చూచి, విని, వాసనచూచి, తాఁకి ఆనందమును బొందుదుమో అదియే రసము, దీని యభివ్యక్తి యెనిమిది విధములుగ నుండును. కావున రసశాస్త్రిజ్ఞులు శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, బీభత్స, శాంత అను నీ యెనిమిది రసములని చెప్పఁబడినవి అన్నింటిలో శృంగారము ప్రధానమైనది. శృంగారమునకే యివి రూపాంతరములు.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! శృంగారమని దేని నందురు?"

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ! శృంగారమును గూర్చి యేమి చెప్పఁగలను? మీరు మాటి మాటికి లోతుగ నడుగుచున్నారు. ఆనందముగ నుండునదియును, మెఱయునదియును, స్వచ్ఛమైనదియు, సంపూర్ణమైనదియును, మనోజ్ఞమైనదియును, ఇంత యేల? ప్రపంచమున సుందరమును, నాకర్షకమును, స్వచ్ఛమును, హృదయమునకు సుఖము నొసంగు నదియునగు పదార్థములన్నియును శృంగారరసముతో సంబంధము కలవియే. రూక్షమై, శుష్కమైన గడ్డ

ములను మీసములను బెంచి, గోచీలుపెట్టి, బూడిదను శరీరము నిండఁ బులుముకొను వారందఱును రసములగు నీరసులే.''

నవ్వి శౌనకుఁడిట్లడిగెను:- ''సూతా! శివుఁడు నీరసుఁడా యేమి ?

సూతుఁడిట్లనెను,- ''అయ్యా! మీరు శివునిగూర్చి అడుగవద్దు ఈతఁడును మిక్కిలి రసజ్ఞుఁడే అసలు రసమునకు సాక్షాత్స్వరూపుఁడీతఁడేయని చెప్పవలసియుండును. రాసలో నీతఁడు జడలను వేణిగను, విభూతి నంగరాగముగను, పులి చర్మమును జీరగను, చెవుల కుండలములను లోలకులుగను, లంగాను ధరించి, కంకణాదులను ధరించి పురుషుఁడు స్త్రీగ నయ్యెను, స్వామీ! శృంగార రసానుభూతి స్త్రీకిగాక అనుభవమునకురాదు. శృంగారము నుద్దీప్తము కావించునది సంగీతము.

'సంగీతమన నేది సూతా! '' అని యుత్సాహముతో శౌనకుఁ డడిగెను.

సూతుఁడిట్లనెను:- 'స్వామీ! నృత్య, వాద్యములతోఁగూడినది సంగీతము, వాద్యగానములతో నటీనటులు కలిసి నృత్య మొనర్చుచు, ఒకరి నొకరు పట్టుకొని విచిత్రముగ హావభావ కటాక్షములను ప్రదర్శించుచుండు దానికి

రాసయని పేరు. ఈ రాసయందు ప్రేమికులగు స్త్రీపురుషులు కలిసి రాస యొనర్చెదరు. కొన్ని అవతారములలో దెబ్బలాడుటయును, కొన్నిటిలో శరసంధాన మొనర్చుటయును, కొన్నిటిలో భిక్షమడుగుకొనుటయును, కొన్నిటిలో దరిద్రుల వెంటఁబడుటయు జరిగినది. కాని యీ త్రివక్ర గోపాలుడు, శృంగార రాసేశ్వరుఁడు వీని నేమియును గ్రహింపక సదా మురళీగాన మొనర్చుచుండును. మందహాస మొనర్చుచుండును. ప్రియురాలితో నాడును, బాడును, రాసక్రీడ నొనర్చును. ఆతఁడు మూర్తీభవించిన శృంగార రసశ్యామసుందరుఁడు. ప్రియురాలగు రాధికాదేవితో నాతఁడు చేయు క్రీడకే రాసయనిపేరు, స్వామీ! నే నింతకంటె నెక్కువగ రాసనుగూర్చి యేమి వ్యాఖ్యానింపఁగలను ?"

శౌనకుఁడిట్లనెను:-"సూతా ! నీవు ముందుగా మాకు సంగీత స్వరూపమును జెప్పుము. ఆ తరువాత రాసయొక్క రసయుక్త ప్రసంగమును జెప్పుము."

అంత సూతుఁడిట్లనెను:-"స్వామీ! సంగీతశాస్త్రము మిక్కిలి గహన విషయము, నా వంటి నీరసునకు దానిలోనికిఁ బ్రవేశముకూడ ఉండదు. దానిని విస్తారముగఁ జతుర్ముఖ బ్రహ్మయైనను వర్ణింపఁ జాలఁడు. అయినను నేను

గురుముఖమున వినిన దాని నత్యంత సంక్షేపమున, సూత్ర రూపమున - మీకుఁ జెప్పెదను. మీ రందఱును దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.

# రాసారంభము

శ్లో॥ రాసోత్సవః సంప్రవృత్తో గోపీమండల మండితః ।
యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ద్వయోర్ద్వయోః।
ప్రవిష్టేన గృహీతానాం కంఠే స్వనికటం స్త్రియః ॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౩ శ్లో ॥

వ. మురళీ వివరంబులు సారించి పూరించుచు సరిలేని భంగిం ద్రిభంగియై కమల కర్ణికాకారంబున నడుమ నిలిచి మఱియు గోపసుందరు లెందఱందఱకు నందఱయి సుందరుల కవల యెడలం దానును దనకవల యెడల సుందరులును దేజరిల్లిరి.

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రపంచమున రసాభివ్యక్తి సాధనములు సంగీత సాహిత్యములు రెండే. ఇవి లేనివారు పశు సదృశులే. సాహిత్య ప్రభావము పశువుల మీఁదఁబడునో లేదో తెలియదు కాని సంగీతప్రభావ మవశ్యము పశువుల మీఁదఁ బడును. గాంధారమునఁ బాడినచో గోవులన్నియును

నొక్కచోటునకు వచ్చును. చెవులు నిక్కబొడుచుకొని విన నారంభించును. హరిణములు గానమునకు వశపడియే, ప్రాణములను గోల్పోవును. వ్యాఘ్రుఁడు మధుర స్వరమున వీణను వాయించును. హరిణములా గానమును విని ఆత్మ విస్మృతినిఁ జెందును. ఆ సమయమున వ్యాఘ్రుఁడు వానిని వధించును, లేదా పట్టుకొనును. సర్పములు కన్నులతోడనే వినును. వానికి జెవులుండవు. అయినను నది సంగీతమును విని యూగ నారంభించును. ఈ విధముగఁ బ్రపంచమందలి జీవులందఱును బ్రకృతియొక్క యీ మనమోహక సంగీతమునకు వశపడి తమ్ముఁదాము మఱచు చున్నారు. ఆత్మ విస్మృతి కలిగించి, తన్నుఁదాను మఱపించనిది సంగీతము కానేకాదు. అది రోదనమే, రోదనమైనను సుస్వరముగ నుండవలెను. సంగీతము లేక యే దేవతయును లేఁడు. సంగీత శాస్త్రమం దే దేవత యేస్వరమునఁ బాడునదియు విస్తారముగ వర్ణింపఁబడినది. అగ్ని షడ్జమ స్వరమునఁ బాడును. బ్రహ్మ రిషభస్వరముపఁ బాడును. చంద్రుఁడు గాంధార స్వరమునను, విష్ణువు మధ్యమమందును, నారదుఁడు పంచమమునను, ధైవత నిషాదమునఁ దుఁబురుఁడును బాడుచుండును. ఏదో విధమగు వాద్యములేని దేవత లేనేలేఁడు. సరస్వతి యెల్లప్పుడు వీణను బట్టుకొనును. శివుఁడు డమరు వాయించును, విష్ణువు పాంచజన్య శంఖమును వీడనేవీడఁడు.

నొక్కచోటునకు వచ్చును. చెవులు నిక్కబొడుచుకొని విన నారంభించును. హరిణములు గానమునకు వశపడియే, ప్రాణములను గోల్పోవును. వ్యాఘుడు మధుర స్వరమున వీణను వాయించును. హరిణములా గానమును విని ఆత్మ విస్మృతినిఁ జెందును. ఆ సమయమున వ్యాధుఁడు వానిని వధించును, లేదా పట్టుకొనును, సర్పములు కన్నులతోడనే వినును. వానికి జెవులుండవు. అయినను నది సంగీతమును విని యూగ నారంభించును. ఈ విధముగఁ బ్రపంచమందలి జీవులందఱును బ్రకృతియొక్క యీ మనమోహక సంగీతమునకు వశపడి తమ్ముఁదాము మఱచు చున్నారు. ఆత్మ విస్మృతి కలిగించి, తన్నుఁదాను మఱపించనిది సంగీతము కానేకాదు. అది రోదనమే, రోదనమైనను సుస్వరముగ నుండవలెను. సంగీతము లేక యే దేవతయును లేఁడు. సంగీత శాస్త్రమం దే దేవత యేస్వరమునఁ బాడునదియు విస్తారముగ వర్ణింపఁబడినది. అగ్ని షడ్జమ స్వరమునఁ బాడును. బ్రహ్మ ఋషభస్వరముపఁ బాడును. చంద్రుఁడు గాంధార స్వరమునను, విష్ణువు మధ్యమమందును, నారదుఁడు పంచమమునను, ధైవత నిషాదమునఁ దుంబురుఁడును బాడుచుండును. ఏదో విధమగు వాద్యములేని దేవత లేనేలేఁడు. సరస్వతి యెల్లప్పుడు వీణను బట్టుకొనును. శివుఁడు డమరు వాయించును, విష్ణువు పాంచజన్య శంఖమును వీడనేవీడఁడు.

జతుర్విధ వాద్యములు వినఁబడును, సంగీత మెచ్చటినుం డియో రా నక్కర లేదు. ఈవిశ్వమంతయును సంగీతముచేఁ బరిప్లావితమై యున్నది. కేవలము దాని యనుభూతిని జెందవలయును, దానినిఁ దెలిసికొనవలయును. అనుభవింప వలెను.

భగవంతుఁ డెట్లనంతుఁడో సంగీతశాస్త్ర మట్లనం తము, సంగీతము జీవులకే కాదు భగవంతునకును బ్రియ మైనదే. ఒక దినమున భగవంతుని నారదుఁ డిట్లడిగెను:- "స్వామీ! కొందఱు మీరువైకుంఠమునఁనధికముగ నుందువందురు. కొందఱు శ్వేతద్వీపమందును క్షీరసాగరమం దును, యోగులహృదయమున నష్టదళపద్మమందును మీరు నివసించెదరఁట. కొందఱునిన్ను సర్వవ్యాపకుఁడందురు. ఇప్పుడు నాకు మీ దర్శనము కొఱకు నిత్యము నువ్విళ్లూరు చుందును. నేనప్పుడప్పుడు వైకుంఠమునకుఁబోయిన నచ్చట గనఁబడ కుండిన నాకు మిక్కిలి దుఃఖము కలుగుచుండును. ఎచ్చటికిఁ బోయిన నిరాశచెందక నిశ్చయముగ మీ దర్శనమగునో ఆ చోటును జెప్పవలయును." ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను:- "నారదా! వైకుంఠము నాలోకమే. నేనచ్చ టికి వెళ్లవలసి యుండును. నేను పోకపోయినచో నా గృహిణి లక్ష్మి అప్రసన్నురాలగును. ఇష్టము లేకున్నను భార్య భయ

ముచే నింటికి పోవలసియుండును. కాని అచ్చట నేనుండను. అటు నిటుఁ దిరిగి లక్ష్మిని మోసగించి, ఆమాట యీ మాటను జెప్పి పరువిడి వచ్చుచుందును.

కాని నాయనా! ఈ యోగులు మిక్కిలి రూక్షహృదయులుగ నుందురు. వీరి జడలును, గడ్డము, మీసములును రూక్షములుగ నుండును, ముక్కులతో వాయువును వేగముగఁ బీల్చుటచే వారి శరీరమును రూక్షముగ నుండును. నా కొఱకని యిన్ని కష్టము లనుభవించుచున్నారు. కావున వారి హృదయమున గర్తవ్యవశమున నుండవలసి వచ్చును; కాని నేనచ్చట నుండను. నిలుచుండి దర్శన మిచ్చివేయుచుందును. కాని నారదా! నా భక్తులందరును గలిసి తాళస్వరాదులతో సంగీత శాస్త్రానుసారముగ గానమొనర్చెనచో నచ్చట నేను పీఠము వైచుకొని కూర్చుండెదను. అది పూర్తియగు వఱకు నేను లేవనే లేవను, శుద్ధ సంగీతముతో సంకీర్తన జరుగునో అచ్చట నీవు నన్నుఁ దప్పక వెదకుకొనుము. నేనచ్చటఁ దప్పక లభింపఁగలను.'' నారదుడిట్లనెను:- ''నేను సంగీతజ్ఞుల నెచ్చట వెదకికొందును? అని ఆతఁడు తన తండ్రియగు బ్రహ్మకడకుఁబోయి యిట్లనెను:- 'తండ్రీ! నాకు సంగీతము నేర్పుము'' బ్రహ్మ వేదగర్భుఁడు. ఆతఁడు నారదునకు విధ్యుక్తముగ సంగీతమును నేర్పి, స్వరబ్రహ్మ విభూషితమగు వీణ నొకదాని నొసంగి యిట్లనెను:-

"దీనిని ప్రయోగించుచు భగవన్నామములను గాన మొన ర్చితివా దగ్గఱ గదిలో నుండినవాఁడు పిలువఁగానే వచ్చినట్లు భగవంతుఁడు వెంటనే రాఁగలఁడు. ఆనాఁటినుండి నారదుఁడు వీణను మీటుచు భగవన్నామ గుణ సంకీర్తన మొనర్చుచుఁ జతుర్దశ భువనములను స్వచ్ఛందుఁడై తిరుగుచుండెను. గానమును సహృదయులందఱును ప్రేమించెదరు. సంగీతమనఁగా ముందుగాఁ బాడుటయును, వాయించుటయు, గీత వాద్యముల ననుసరించి నృత్యమొనర్చుటయే.

సర్వప్రథమముగ శబ్దబ్రహ్మప్రణవము పుట్టినది. దానినే అనాహతమందురు. ఆ ఓంకారము వలననే సమస్త వేదశాస్త్రముల విస్తారము జరిగినది. ప్రాణములను ధరించినవాఁడు జీవుఁడు. ప్రాణములయందు స్పందనము రాగము చేతఁ గలుగును. అందువలననే రాగమందఱకును ప్రియమైనది. రాగమని ఆసక్తిక నెదరు. దేనియందుమనస్సు తల్లీనమగునో దానినే రాగమందురు. అది సంగముచేఁ గలుగును. సంసారమందు మనస్సు రంజిత మగుటను రాగమందురు. ఆ రాగమే భగవంతునియందు గలిగినచో దానినిఁ ప్రేమయందురు. రాగమందును ప్రేమ యందును దాత్వికముగ భేదము లేదు. రాగమే రసమును ప్రకట మొనర్చును. అన్ని రసములందును శృంగారరసము సర్వశ్రేష్ఠమైనది. కావున

మనస్సును దల్లీనమొనర్చు నానందమును రెండే. విషయా నందము, బ్రహ్మానందము. సాంసారిక శృంగారమందు రాగము కలిగినచో సాంసారిక విషయములందు లగ్న మగును. ఆ రాగమే రాధాకృష్ణ శృంగారరసమందు లగ్న మగుచో నాతఁడు నిత్యరాస కధికారి యగును. రూపము లేక రాగముండదు. రాగ రూపములు రెండును గలిసినచో రాస ఆరంభమగును. ప్రపంచమున శ్రీకృష్ణగోపికలకు మించిన రూపవంతులు లేరు. వారి రాగాను రాగముల వంటివి ప్రపంచమున నెవరికిని లేవు. రాగముయొక్క మర్మ మును విరహవంతులే యెఱుఁగుదురు. హృదయమునఁ బ్రేమ రాగము లేకున్న నేమి తెలియఁగలఁడు. గేదె కడకుబోయి గీతమును బాడిన దాని కేమి తెలి[illegible]నుఁ?"

ఆర్య శాస్త్రకారులు సమస్త రాగములను నాఱు భాగములుగ విభక్త మొనర్చిరి. అందువలననే మనకు భైరవి, మాల్కోసు, హిందోళి, దీపక, శ్రీ, మేఘరంజని రాగములనే ముఖ్యముగఁ జెప్పిరి. ఈ యాఱు రాగముల కైదేదుగురు భార్యలు కలరు. ఈ విధముగ ముప్పది రాగములయ్యెను. వీని నన్నిటిని గలగలుపుచేయఁగా ననంత రాగములయ్యెను. అవన్నియును సంకరజాతికి సంబంధించినవి. శుద్ధరాగములను నేఁ కొందఱో పాడఁగలుగుదురు. అంద

ఉను బాడునది సంకరరాగములనే. శుద్ధరాగములను బాడి నచో జడములును జైతన్యములగును. భైరవ రాగమును శుద్ధముగఁ బాడిన నూనె గానుగ యంత్రము దానికదియే కదలును. మాల్కోసును బాడిన రాళ్లుకఱఁగును. హిందోళమును బాడినఁ దానే యూఁగును, మేఘరంజని రాగమును బాడిన మేఘములువచ్చి వర్షించును. శ్రీరాగమును బాడిన నెండిన వృక్షము పచ్చబడును. దీపకరాగమును బాడిన నాఱిపోవు దీపము మఱల వెలుఁగును. ఇట్లైన రాగము శుద్ధమైన దనుకోనవలయును.

ఆర్యశాస్త్రములలో సమస్త వస్తువులకును నాధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక రూపములున్నవని వర్ణింపఁబడినది. ఈ యాఱు రాగములును, ముప్పది రాగిణులకును రూప, వర్ణ, వాహనాది వర్ణనము కలదు. ఇచ్చట గ్రంథ విస్తరభీతిచే వాని వర్ణన మొనర్చుటలేదు. అన్నిరాగములను నన్నివేళలందు బాడరాదు, అన్నిఋతువులందును బాడరాదు. అన్నిటికిని సమయము నిర్ధారింపఁబడినది. అన్నిటికిని ఋతువులు నిర్ధారింపఁబడినవి. తెల్లవారుజామున భైరవిరాగమునే పాడవలయును, దానికి రాగిణులు భైరవి, బంగాళి, వైరాటి మధు, మాధవీ. సింధవీ వీనినిగూడ అప్పుడు పాడవచ్చును. సూర్యుఁడుదయింపఁగనే ప్రాతఃకాల

మున మాల్కోసు రాగమును, దానికి తోడి, గౌరి, గుణకలీ, ఖంబాయతములను రాగిణులను పాడవలయును. జాము ప్రొద్దెక్కిన తరువాత హిందోళి రాగమును పాడవలయును. దానికి రమకలీ, పట, మంజరీ, దేవసాఖి, లలిత, విలావల రాగిణులనుగూడ పాడవలయును: సరిగా మధ్యాహ్నమున దీపకరాగమును, నట, కాన్హర, కేదార, కమోద, ప్రమోదములను గాన మొనర్ప వలయును. నాల్గవజాము నుండి సూర్యాస్తమయమువఱకు శ్రీరాగమును, దానికి రాగిణులగు ధన్యాశ్రీ, ఆసావేరి, మారు, వసంత, మాలసిరీ లను పాడవలెను. కొన్నిరాగముల నన్నికాలములందును పాడవచ్చును కొన్ని రాగములను విశేషసమయములందే పాడవలసియుండును. మేఘరాగమును మేఘములున్నప్పుడే పాడవలయును. ఫాల్గుణ మాసమున సమస్తరాగములను సమస్తకాలములందును పాడవచ్చును. ఆ సమయమున హోళీ జరుగును. వసంతఋతువున సమస్తరాగములను రాత్రులందుఁ బాడవచ్చును. అప్పుడొక రకమగు విశ్రాంతి నొసంగుచు పాడవలయును. భైరవరాగమునకు ఉత్తమ కాలము శరదృతువు. మాల్కోసుకు శిశిరమును, హిందోళమునకు వసంతమును, దీపకమునకు హేమంతమును, గ్రీష్మమును, మేఘరాగమునకు సర్వశ్రేష్ఠ సమయము వర్ష ఋతువు.

స్వరోత్పత్తి హృదయము, కంఠము, శిరము వీనిలోఁ బుట్టునని శాస్త్రకారులు చెప్పిరి. మంద్ర, మధ్య, తార ములను నీ మూఁడును స్వరములు, మంద్రస్వరము హృదయమునఁ బుట్టును, మధ్యస్వరము కంఠమున తారము విశేషముగ శిరస్సునఁ బుట్టును. షడ్జమ, మధ్యమ, గాంధారములు గ్రామములు. ఏడేడు స్వరము లొక్కటిగ మండును. షడ్జ, (స), రిషభ (రి), గాంధార (గ), మధ్యమ (మ), పంచమ (ప), ధైవత (ధ) నిషాధ (ని) ఇవి యేడు స్వరములు. ఇరువదొక్కటి మూర్ఛనములు. ప్రతి గ్రామమునకును నేడేడు మూర్ఛనములు చెప్పఁబడినవి. వీని నిచ్చట విస్తారముగఁ జెప్ప వీలు లేదు.

స్వరములను గుర్తించుట చాల కష్టము. ఇది గొప్ప గహన శాస్త్రము. మయూరము షడ్జస్వరమునఁ గూయును. గోవు ఋషభస్వరమునను, మేఁక గాంధారమునను, క్రౌంచము మధ్యమ స్వరమునను, వసంతఋతువునఁ గోకిల పంచమ స్వరమున కుహూఁ కుహూఁ అనియు, గుఱ్ఱము ధైవతస్వరమున సకిలించును. ఏనుఁగు నిషాద స్వరమున గీపెట్టును. ఈ స్వరము లన్నిటికిని వేఱు వేఱు జాతులును, వర్ణములును గలవు. శాస్త్రమున సర్వవిశేషములు విస్తారముగఁ గలవు. శుద్ధ సంగీతమున రసోత్పత్తి కలుగును.

రసమే బ్రహ్మయొక్క రూపము. "రసోవైసః" ఆ రస రూపుఁడు సాక్షాత్తుగ శ్రీకృష్ణుఁడే, ప్రక్కన శ్రీ లేనంత వఱకు కృష్ణుఁడే. శ్రీ ఉండఁగానే ఆతఁడు రసరూపుఁడై శ్రీకృష్ణుఁ డనబడును.

గానమునకువాద్యమవసరము. ప్రపంచమున వేలకొలది వాద్యములుకలవు. వానినన్నిటిని శాస్త్రకారులు నాల్గు రకములుగవిభజించిరి, సంస్కృతమునవీనికితత, సుసిర, ఘనఅవనద్ధ సంజ్ఞలుకలవు. తీఁగెతో వాయింపఁబడువీణ, తాంబూర, సారంగీ మొదలగునవి. వీనిలోను రెండు భేదములు కలవు, మీటుటచే మ్రోగునవి, సితారు, తాంబూర, వీణాదులు. రెండవ రకము కమానుతో మ్రోగునవి - సారంగి, మోర్వీణ, వాయులీనము వంటివి. సుషిరములనఁగా నూదిన మ్రోగునవి. వేణు, మురళీ, అలగోజా, సహనాయి వాద్యములు. తాళము నొసంగునవి ఘనము. కంచుతోఁ జేయఁబడిన మంజీర, కరతాళాదులు, అవనద్ధ మనఁగాఁ జర్మముఁతో గప్పఁబడినవి. ఇవి చేతితో వాయింపఁబడును. మృదంగము, కోలు, తబలా, డోలక్, నగారాదులు.

గానమునందు స్వర, తాళ, లయాదులు నియమానుసారముగఁ గలుప వలయును. ఫలాని గీతము నేయే స్వరములలో గానము చేయవలయునో దానికి స్వరప్రస్తార

మొనర్చి పాడుట కాలాపన అనిపేరు. వాద్యములలో నే స్వరమును బలికింపవలయునో దానిని గమక మందురు. స్వరములలోని గమకమును స్పష్టముగఁ బ్రకటించుటలోనే వాద్యములలోఁ జాతురి కలదు. మొదట నన్ని వాద్యములను గలుపుదురు. స్వర, తాళ, లయము లొక్కటైనపుడు సంగీతమున రసమువచ్చును. తాళముయొక్క మధ్యభాగమునకు లయమనిపేరు, లయ మూఁడురకములుగ నుండును. ద్రుత, మధ్య, విలంబితములు, 16 మాత్రలను 32 మాత్రలలో శీఘ్రముగ వాయించుట మధ్యమందురు. దానినే 64 మాత్రలలో వాయించుట ద్రుతమందురు. ఈ విధముగఁ గంఠ, వాద్యాది స్వరములు తాళ, లయము లొక్కటి కాఁగా నే శబ్దము నోటినుండి వచ్చునో, అదియే స్పష్టముగ వాద్యముచేతను వినఁబడవలయును. వానిని భావముద్వారా వ్యక్తమొనర్చుటకే నృత్యమందురు.

ఇతరుల కృత్యముల ననుకరించుటకు నాటకమందురు. దాని సంస్కారమునకు నృత్యమందురు. నృత్యమందు మనస్సునందలి సమస్త భావములను జేష్టలద్వారా ప్రకట మొనర్పఁబడును. నవరసములను నోట బలుకకయే కేవల మంగ నిక్షేపములద్వారా వ్యక్త మొనర్పఁబడును. ఈ శాస్త్రమును మిక్కిలి గహనమైనది. నృత్యము రెండు విధ

ములు, నాట్యనృత్యము, లాస్యనృత్యము, నాట్యనృత్యము నాటకాభినయములందు జేయఁబడును. దీనికి రంగ స్థల మవసరము. ఈ రంగస్థలము నాట్య మంటపముననే ఉం డును. లాస్య నృత్య మెచ్చటనైనను జేయవచ్చును. ఏ నృత్యము భావ, రససమన్వితమై యుండునో, తాళ, కావ్య, గీతాను సారముగ నడుపు సుఖప్రదమగు నృత్యమే రస వృద్ధికి హేతువుగఁ జెప్పఁబడినది. నృత్య భావభంగిమ ములలోఁ జాల భేదములు కలవు. ఈ వర్ణన మంతయును భరతనాట్యశాస్త్రమున విస్తారముగ వ్రాయఁబడినది. విష్ణు ధర్మోత్తరము నందును, నారద పురాణముననను దీనినిగూర్చిన వర్ణనము కలదు. ఇచ్చట నేను కేవలము విషయము నెఱుఁగుటకు సంకేత మాత్రముగఁ జెప్పితిని. రాసమున గీతవాద్య నృత్యము లావశ్యకములగును. సంగీతముయొక్క సాకార స్వరూపము రాసయందే అభివ్యక్తమగును.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఈ ప్రేమ మార్గము విలక్షణమైనది. ఇది యెట్టి నిత్యనూతనమైనదో, అట్లే నిత్యనూతన సంకోచమును నిందు ఉత్పన్నము కాఁ గలదు. సంకోచము ప్రేమాభివృద్ధి గావించుట కొరక యం త్రము, నూతన సంకోచము నూతన ప్రేమను వృద్ధి గావిం చును. గోపికలు మురళీ ధ్వనిని విని యిండ్లనుండి పరువిడి

వచ్చిరి. ఇచ్చటికివచ్చి త్రిభంగ లలితగతితో నిలుచుండిన మురళీ మనోహరునిఁ గాంచిరి. వారికి సంకోచము కలిగెను. శ్యామ సుందరుఁడు వారి సంకోచమును బోఁగొట్టుటకై గూఢమగు వాక్యములను దలతోఁక లేనివిగఁ బలికెను. ప్రేమ వాక్యము లన్నిటికిని ఒక్కటే అర్థముండును. అది ప్రేమను వృద్ధిచేయుటయే, కృష్ణుఁడిట్లనెను:- రాత్రియందు మీరిచ్చటికేల వచ్చితిరి ? చంద్రునిఁ గాంచుటకు వచ్చితిరా ? వనశోభను జూడఁగోరిక కలిగినదా ? వ్రజములో నేమియును నాపత్తు విపత్తులు లేవుకదా ! ''

వారేల వచ్చిరో తెలియని పాలుత్రాగు శిశువుగాదు కృష్ణుఁడు, ఎఱుఁగుటేమి ? స్వయముగ నాతఁడే మోహినీ మంత్రమును బఠించి మురళీద్వారా వారినిఁ బిలిచెను. ఈతని కన్నియును దెలిసినను దెలియని వానివలె నటించుచున్నాఁడని గోపికలకును దెలియును. తమ్ము బాధించుటకై యిట్టి వ్యర్థచేష్టలను జూపుచున్నాఁడనియు, అమాయకునివలె మాటలాడుచున్నాఁడనియుఁ దెలియును. కాని సంకోచమును దూరమొనర్చుటకై మాటలు మాటలాడుట ఆవశ్యకము. మాటలాడకుండను లేరు. సంకోచములను బోవుట లేదు. గోపికలు శ్రీకృష్ణుని మధురముగఁ జీవాట్లు పెట్టుచుఁ గసరి తమ వివశతను జూపించిరి. కృష్ణుఁడు నవ్వెను.

వారి కంఠములందు తన భుజములను వైచెను. సంకోచము పోయెను ఇద్దరును గలిసిరి. ఒక అధ్యాయము సమాప్త మయ్యెను. వెంటనే కృష్ణుఁడు దాఁగెను. అంతర్హితుఁ డయ్యెను. ప్రేమయొక్క రెండవ అధ్యాయము ప్రారంభ మయ్యెను. వెనుకటి విషయములన్నియును వసంతములో విలీనములైనవి, శ్యామసుందరుఁడును క్రొత్తవాఁడైనాఁడు. గోపికలును క్రొత్తవారలైరి. ప్రేమయందు నిత్య నూతన పరిచయ మొనర్చుకొనవలసియుండును. నిత్యసంకోచము కలుగును. మరల నా మాటల తోడనే సంకోచమును దూర మొనర్పవలయును. మరల కలియక, వియోగము కలుగఁ గానే నూతనలీల ప్రారంభమగును. ఇదియే ప్రేమ క్రీడ. పిల్లలాటలలోఁ జేయునదేమి ? చాల శ్రమచేసి యిండ్లు కట్టెదరు. పచ్చి మన్నుతో నానావిధములగు నాటబొమ్మ లను దయారు చేయుదురు. వంట, వంటపాత్రలు, లడ్డు, పూరీలు, కూరలు, పచ్చళ్లు అన్నియును మట్టితోడనే చేయఁబడును. ఆట పూర్తి కాఁగానే వీనిని రేపటి కుంచు కొందుమని వారనుకొనరు. ఆటలో నష్టే యుండుటనునది లేదు. మనసుపోయెనా ఆట కట్టును. మఱునాఁడన్నియును మరలఁ గ్రొత్తయే, రాధాకృష్ణుల రాసక్రీడ యెప్పటినుండి జరుగుచున్నదో యెవ్వరు నెఱుఁగరు. ఒక దినము కలిసి మరల విడిపోయిరా శ్యామసుందరునకు రాధిక నూతనముగఁ

గనఁబడును. రాధికకు కృష్ణుఁడు క్రొత్తగఁ గనఁబడును. ఈమె తనకు సంబంధించినదే యని తెలియును గాని ఆమె పరిచయ మెప్పుడు కలిగినదో, ఈమె ఆమెయే యను జ్ఞాపక ముండదట, ఏ దినమునఁ గాంచిన నా దినముననే అందఱి కంటె నధిక సుందరముగఁ గనఁబడును. ఇట్టి స్థితియే రాధికకును.

అంతర్ధానము కాఁగానే మరల నూతన పరిచయ మొనర్చుకొనవలసి వచ్చెను. గోపికలు ప్రశ్నించి గోపాలుఁడు ప్రత్యుత్తర మొసంగెను. క్షమాపణకు పూర్వము జరిగిన మాటలను మఱవమనెను. నేఁడు నూతన పరిచయము కలిగెను. ధనలోభి యెంతటి ధనము కలిగియున్నను దృప్తినిఁ జెందక ధనమునే కాంక్షించునట్లు, ప్రేమ నిత్య నూతన ప్రేమను గాంక్షించుచుండును. నిన్నటి ప్రేమకంటె నీనాఁటి ప్రేమలో విశేషత యుండవలెను. నేఁడాతఁడు నిన్నటికంటెను నధిక మోహకముగను, ఆకర్షకముగను, ప్రియముగను నుండెను.

స్త్రీల స్వభావము సాధారణముగ లజ్జగనుందురు. పురుష సంకేతము లేక వారేమియును జేయరు. వారు మనస్సులోనే ఉంచుకొందురు, మనోభావము దాఁగదు. విశేషించి ప్రేమకుని కడ దాఁగన్ దాఁగదు. శ్యామసుంద

రునకును రాస యొనర్పనలయునని కలదు. గోపికలకును గలదు, కాని ముందు చెప్పున దెవరు ? అధిక నిర్లజ్జులైన వారును, అధిక నిర్భోగమాటము కలవారును ముందు జెప్పఁగలరు ? నటశేఖరుఁడగు శ్రీకృష్ణునికంటె నధిక చంచలు లెవరుందురు ? కావున నాతఁడిట్లనెను:- "పోవు దము, రాసచేయుదము."

ఇంతవఱకును గోపికా పరివేష్టితుఁడై శ్రీకృష్ణుఁడు కూర్చుండును. ఇప్పుడు మునుముందుగా నాతఁడు రాసకొఱకు లేచి నిలుచుండెను. గోపికలు శ్రీకృష్ణాను గతులే. ఛాయా సమానలు, ఆతఁడేది చేయించిన దానినిఁ జేయవలయును. శ్రీకృష్ణుఁడు తానే వారి కంఠములందు తన బాహువులను వైచెను వారి సంకోచమును దూరము కావించెను. వారికి రోమాంచము కలిగెను. సుందరములును బలిష్ఠములును మృదువులునగు భగవానుని బాహువులను వారు తలలను వంచి ముద్దుపెట్టుకొనిరి. అత్యంత కోమలములగు నధర ముల స్పర్శచే శ్యామసుందరుని బాహువులందలి రోమములు నిక్కబొడిచి స్పందింప వారంభించెను. గోపికలు తమ యధరముల ద్వారా వానిలో రసమును నింపినారా యను నట్లుండెను.

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! గోపిక లసంఖ్యా కులు, ఇందులో కృష్ణుఁడొక్కరితోడనే రాస యొనర్చినఁ

గనంబడును. రాధికకు కృష్ణుఁడు క్రొత్తగఁ గనఁబడును. ఈమె తనకు సంబంధించినదే యని తెలియును గాని ఆమె పరిచయ మెప్పుడు కలిగినదో, ఈమె ఆమెయే యను జ్ఞాపక ముండదట, ఏ దినమునఁ గాంచిన నా దినముననే అందఱి కంటె నధిక సుందరముగఁ గనఁబడును. ఇట్టి స్థితియే రాధికకును.

అంతర్ధానము కాఁగానే మరల నూతన పరిచయ మొనర్చుకొనవలసి వచ్చెను. గోపికలు ప్రశ్నించి గోపాలుఁడు ప్రత్యుత్తర మొసంగెను. క్షమాపణకు పూర్వము జరిగిన మాటలను మఱవమనెను. నేఁడు నూతన పరిచయము కలిగెను. ధనలోభి యెంతటి ధనము కలిగియున్నను దృప్తినిఁ జెందక ధనమునే కాంక్షించునట్లు, ప్రేమ నిత్య నూతన ప్రేమను గాంక్షించుచుండును. నిన్నటి ప్రేమకంటె నీనాఁటి ప్రేమలో విశేషత యుండవలెను. నేఁడాతఁడు నిన్నటికంటెను నధిక మోహకముగను, ఆకర్షకముగను, ప్రియముగను నుండెను.

స్త్రీల స్వభావము సాధారణముగ లజ్జగనుందురు. పురుష సంకేతము లేక వారేమియును జేయరు. వారు మనస్సులోనే ఉంచుకొందురు, మనోభావము దాఁగదు. విశేషించి ప్రేమకుని కడ దాఁగన్ దాఁగదు. శ్యామసుంద

రునకును రాస యొనర్పవలయునని కలదు. గోపికలకును గలదు, కాని ముందు చెప్పున దెవరు ? అధిక నిర్లజ్జులైన వారును, అధిక నిర్భోగమాటము కలవారును ముందు జెప్పఁగలరు ? నటశేఖరుఁడగు శ్రీకృష్ణునికంటె నధిక చంచలు లెవరుందురు ? కావున నాతఁడిట్లనెను:- "పోవుదము, రాసచేయుదము."

ఇంతవఱకును గోపికా పరివేష్టితుఁడై శ్రీకృష్ణుఁడు కూర్చుండును. ఇప్పుడు మునుముందుగా నాతఁడు రాసకొఱకు లేచి నిలుచుండెను. గోపికలు శ్రీకృష్ణును గతులే. ఛాయా సమానలు, ఆతఁడేది చేయించిన దానినిఁ జేయవలయును. శ్రీకృష్ణుఁడు తానే వారి కంఠములందు తన బాహువులను వైచెను వారి సంకోచమును దూరము కావించెను. వారికి రోమాంచము కలిగెను. సుందరములును బలిష్ఠములును మృదువులునగు భగవానుని బాహువులను వారు తలలను వంచి ముద్దుపెట్టుకొనిరి. అత్యంత కోమలములగు నధరముల స్పర్శచే శ్యామసుందరుని బాహువులందలి రోమములు నిక్కబొడిచి స్పందింప వారంభించెను. గోపికలు తమ యధరముల ద్వారా వానిలో రసమును నింపినారా యను నట్లుండెను.

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! గోపిక లసంఖ్యాకులు, ఇందులో కృష్ణుఁడొక్కరితోడనే రాస యొనర్చినఁ

బక్షపాతమగును. మిగిలిన వారందఱును నా సుఖమునకు వంచితులగుదురు.'

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! సాధారణ యోగి యును దనయోగ ప్రభావముచే నెన్నిరూపముల నైనను ధరింపఁ గలుగుచున్నాఁడు. అట్టియెడ యోగేశ్వరుఁడును, సర్వేశ్వరుఁడునగు గృష్ణుఁడు పక్షపాత మొనర్పక గోపిక లెందఱుండిరో అన్నిరూపములను ధరించెను. ఒక గోపిక, ఒక కృష్ణుఁడు, మరల నొక గోపిక ఒకకృష్ణుఁడు నిట్లు రాసమండల మేర్పడెను. కృష్ణుఁడు తన కుడిభుజము నొక గోపిక భుజముపైనను, ఎడమ భుజము నింకొక గోపిక భుజముపైనను వేయఁగా నందఱకును శ్యామసుందరుని సుఖదాలింగనము ప్రాప్తించెను. అందఱును శ్యామసుంద రుఁడు తన తోడనే యున్నాఁడను కొనుచుండిరి."

అంత శౌనకుఁడిట్లడిగెను:- "కృష్ణుని భుజములు రెండును వారి భుజములపై నుండిన నాతఁడు మురళి నూదు టెట్లు? మురళి వాయింపకుండిన రాసలో నానందము కలుగు టెట్లు ఏ మురళి కృపతో వీరినందఱ నిండ్లనుండి పిలిచెనో దానికి రాససుఖము లేకున్న కృతఘ్నత కాదా? మురళీధ్వని వినకున్న గోపికల ఉత్సాహము పెరుగు టెట్లు? వారు నృత్య మొనర్చుటకు వారి పాదము లెట్లు లేచును?"

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీరు చాల రహస్య విషయముల నడుగుచున్నారు. స్వామీ! రాధిక అందఱు గోపికలవంటిది కాదు. ఆమె వారందఱకధీశ్వరి. అందువలన నామె వారందఱ మధ్య నిలుచుండెను, ఆమె మధ్య నిలుచుండిన సందఱమును దర్శనము చేయవచ్చునని అందఱనుకుండెను. ఆమెమధ్యలో నిలుచుండిన నామెనొక్కతే నిలుచుడెను. ఆమె కంఠముననుబాహువును వైచెను. ఇంక నొక్కచేయి విడిగానుండెను. ఆచేతితో మురళిని వాయించు చుండెను. మురళీ ధ్వనిలోఁ గడియములు, అందెలు, గొలుసులు, కంకణములు, మొలనూళ్లు, హారముల ధ్వనులు కలిసి తాళము వేయుచుండెను.

శౌనకుఁ డిట్లడిగెను:- "గాజులు గాజుతోఁ జేయఁబడినవి కదా అవియును మ్రోగునా?"

పకపక నవ్వుచు సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీరేదైన ధర్మ విషయము లడిగినఁ జెప్పఁగలను. ప్రపంచమున గాజుల శబ్దమైన నేపని చేయుచున్నను నా శబ్దము పడెనా మనస్సులో నేభావము లుప్పతిల్లునో మీబోటి సాధువులకుఁ దెలియదు. ఆ మ్రోత అనుభవగమ్యమైనది. వాగతీతము, శ్రీకృష్ణమురళి ధ్వనితో పాటుగా నూపుర ధ్వనులును, గాజులు గలగలలును, అందెల ఝణఝణము

లును వినఁబడును. దీని వలనఁ గృష్ణుని శిరమున నుండిన మయూర పింఛమును, మనమయూరమును నృత్యము చేయుచుండెను.

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీమాటను గాదను టెట్లు? నీవు గాజులు అందెలు గొలుసులు, నూపురములు, మొలనూళ్ల శబ్దము మధురమను చున్నావు; కాని మాకు మృదంగ, వేణు, వీణాది వాద్యములు మధురముగనుండును. వాద్యములనిన నివే. ఇవి లేని నృత్యమేమి నృత్యము? నూపు రాదులు మాటల సహాయత లే."

తొందఱతో సూతుఁ డిట్లనెను:- "మీవాద్యములు మంచివే. కాని గాజులందెలు మొదలగునవి శృంగార రస వృద్ధికి ముఖ్యములు, దుందుభి, వీణ, పణవాది వాద్యముల మాధుర్యమును గూర్చి చెప్పున దేమున్నది? రాసమండలిలో నీ వాద్యములును లేకపోలేదు. కృష్ణుఁడు రాసచేయఁబోవు చున్నాఁడని తెలిసికొని స్వర్గమునుండి దేవ, గంధర్వ, విద్యా ధర, కింపురుషులు తమ స్త్రీలతో విమానము లెక్కి-వచ్చిరి. ఆ రాసమండలిలోని కృష్ణ, గోపికలపై వారు పుష్పవర్షమును గుఱిపించుటయేగాక వీణా, పణవ, దుందుభి, మృదంగాది వాద్యములను వాయించిరి."

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! దేవతలు తమ స్త్రీలతో నేలవచ్చిరి?"

సూతుఁ డిట్లనెను:-"స్వామీ! వారు తీసికొనిరా లేదు. వారే వచ్చిరి. ఉత్సవములకును, తిరుణాళ్లకును ముందు బయలు దేరునది స్త్రీలే. వారి వలననే శోభ, పైఁగాఁ గృష్ణుఁడు మూర్తీభవించిన శృంగారరసముకదా! ఏ అభాగ్యునకో గాని దానినిఁ జూడవలెనను కోరికయుండదు. ఆతని నందఱును జూడఁ గోరుదురు. ఇఁక నాతని రాసలీల విషయములోఁ జెప్పవలసిన దేమున్నది ? స్వర్గ దేవతలకు రాసలీలా దర్శన మతిదుర్లభము. స్వర్గములో రాస యెచ్చటనుండును? ఇది గోలోకము తరువాత భూలోకముననే పట్టినది. రాస యను మాట వినఁగానే దేవతలును, వారి స్త్రీలును, పిల్లలును బయలుదేరి వచ్చిరి. రాసలో ప్రాకృత కామవాసనయే లేదు. అది అప్రాకృత చిన్మయ, పరమ దివ్యాతి దివ్య క్రీడ. అందువలన నాకాశమండలము దర్శకుల గుంపుల చే నిండెను. అంతరిక్షమంతటను దేవతా విమానములే."

సూతుఁడిట్లనెను:- "మునులారా! పైన దివ్య సంగీతముతో గంధర్వులు గోవింద గుణగాన మొనర్చుచుండిరి. క్రింద గోపికలతో రాసేశ్వరుఁడు రాస యొనర్చుచుండెను. శ్రీకృష్ణుని మురళీ, గోపికల భూషణములు గంధర్వుల గీతములును, వాద్యములును, ఈ ధ్వనులన్నియును గలిసి ఒక విచిత్ర స్వరలహరి నుత్పన్నము గావించుచుండును.

—॥—

# రాసేశ్వరుని మహారాసము

౧౮౬

శ్లో॥ పాదన్యాసై ర్భుజ విధుతిభిః సస్మితైర్భ్రూ విలాసై
ర్భజ్యన్మధ్యైశ్చలకుచపటైః కుండలైర్గండలోలైః।
స్విద్యన్ముఖ్యః కబరరశనా గ్రంథయః కృష్ణవధ్వో
గాయన్త్యస్తం తడిత ఇవ తా మేఘ చక్రే విరేజుః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౮ శ్లో।

చ॥ నడుములు ప్రీగియాడఁ జిఱునవ్వులు నివ్వటిలంగ హారముల్
సుడివడ మేఖలల్ వదలఁ జూడ్కి మెఱుంగులు పర్వ ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప శ్రుతి భూషణముల్ మెఱవన్ సకృష్ణలై
పడఁతుక లాడుచున్ జెలఁగి పాడిరి మేఘతటిల్లతా ప్రభన్॥

శ్రీ మదాంధ్ర భాగవతము

ఓ సంసార జీవులారా! సాంసారిక అశ్లీలతను హృదయమునుండి త్రోసివైచి మీరు రాసేశ్వరుని రాసను గాంచుటకుఁ బ్రయత్నింపుఁడు. ఈ సాంసారిక అశ్లీల విషయములలో నేమి రసమున్నది? ఇది యా దివ్యాతి దివ్యరసము

యొక్క ఒక క్షీణఛాయ. రసమును లాగివైచిన చెఱకుపిప్పి వంటిది. దీనిలో నేదైన మాధుర్యముండినచో నది యారవ సంసర్గముచేతనే వచ్చినది. ఆ యదార్థ రసమా రాసికేశ్వరుని రాసయందు గలదు. దివ్యప్రకృతితోఁ బాటుగా దివ్యపురుషుఁ డనాదికాలమునుండి రాసను రచించి యున్నాఁడు. కమనీయ క్రీడలొనర్చుచున్నాఁడు. అనంతకాలమువఱకీ రాసయిట్లే జరుగుచుండును. దీనిలో వ్యవధానమును లేదు, విశ్రాంతియును లేదు. దీనికి పర్యవసానమును లేదు. ఈ దివ్య క్రీడ నిరంతరము అవ్యాహతగతిని జరుగుచునే యుండును. రాసేశ్వరుఁడలయుట ఉండదు. ఆతని ప్రియురాండ్రు ఆ కు ల ప డ రు. నిత్యనూతనోత్సాహముతోడనే యుందురు. భగవానుని సంస్పర్శ కెవరు విసుగును జెందెదరు. ఎవరికిఁ దృప్తి కలుగును? ప్రియుని కంఠమునుండి విడివడుట కెవరు కాంక్షించెదరు ? మనస్సులో మలిన వాసన యున్నంతవఱకు రాసను జూచుట కధికారము లేదు. రాసేశ్వరుని రాసమండలిలోఁ గలియుటయును, ఆతని పరికరములందు సమ్మిళితమగుట యెంతో యదృష్టమునఁగాని లభింపదు. జీవితమున కేకైక లక్ష్యము మహారాసను గాంచుట. అది ఒక్కసారి లభించెనా ఆనందమును బొంది కృతకృత్యుఁడగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఏ మహారాసకేళి కిన్ని దినములనుండి ప్రతీక్ష జరిగినదో, ఆ మహారాసము యమునా పులినమందు బృందావన పరమపావన భూమి యందు, శరదృతువున, నిశాసమయమున నిండు వెన్నెలలో నారంభమైనది. గోపికలును కృష్ణుఁడును మండలాకార ముగ నిలువఁబడిరి. మధ్యలో శ్రీరాధికా కృష్ణులిద్దరును శోభించుచుండిరి. ఇఁక జరుగవలసినది తాతా, థైథై. దేవ తలు వాద్యములను వాయించుచుండిరి. గంధర్వులు తానా లాప మొనర్చుచుండిరి. అప్సరసలు నృత్యానుకరణ మొనర్చు చుండిరి. శ్రీకృష్ణుఁడు గోపికల నాడించుచుఁ దానును నాడు చుండెను. కృష్ణుఁడు గోపికల నాడించుచున్నాఁడు, గోపికలు శ్రీకృష్ణు నాడించుచున్నారో, యీ ప్రశ్న చాల జటిల మైనది. దీనికిఁ బ్రత్యుత్తర మొసంగుట నా శక్తికి మించిన విషయము. కావున నీ ప్రశ్నను వేసికొనుటయే వ్యర్థము.

శ్రీకృష్ణుఁడు మునుముందుగాఁ జేసిన దనచరణ నూపురధ్వనులలో గోపికలు తమ నూపుర ధ్వనులను గలుపు చుండిరి. శ్రీకృష్ణుఁడాగఁగా గోపికలును నాగిరి. వారి ఉద రములు కృశముగ నుండెను. సన్నని తీఁగవంటి నడుములు. నితంబములు. స్థూలములు. వారు పదవిన్యాస మొనర్చుచు నృత్యమొనర్చునపుడవి వంగును. శ్రీకృష్ణుని శరీరమున

కానుకొనును. వారి సువర్ణహారములును శ్రీకృష్ణుని వన మాలియును జిక్కుపడును. వారి జడలు శ్రీకృష్ణుని పృష్ఠ దేశమునకుఁ దాఁకుటచేఁ జిక్కిలిగింత పట్టినట్లుండెను. ఒక్కొక్కప్పుడు కపోలముల కాంతులచే మెఱయుచుండిన కుండలములు శ్రీకృష్ణుని కుండలములతోఁ గలియుచుండును. ఈ విధముగ నిరంతరమును భగవానునియొక్క సుఖద స్పర్శచే వారికి శరీరముమీఁద సమస్త సాత్త్వికభావము లుదయించెను. అందఱ శరీరముల కంపము బయలుదేరెను. అందఱ ముఖములమీఁద ముత్యములవంటి స్వేదబిందువులు మెఱయుచుండెను. శ్యామసుందరుఁడు తన పరమ మృదుల సుఖద కరకమలములచే వారి కపోలముల మీఁదవియు, మస్తకముల మీఁదవియునగు స్వేదబిందువులను దుడుచుటచే వారి భావములకు మఱింత స్ఫూర్తి కలుగుచుండెను. వారికి నృత్యగానములం దధికోత్సాహము లభించుచుండెను. వారు ద్విగుణితోత్సాహముతో శ్రీకృష్ణుని గీతములో గీతమును గలుపుచు నృత్యమొనర్చుచుండిరి. శ్రుతివిహీనమగు రాగము నెవరును నాలాపించుటలేదు. ఎవరి పాదములును దాళము నకు విరుద్ధముగఁ బడుటలేదు. ఎవరును లయను దప్పుట లేదు. ప్రియుని సంగముచే సుఖదస్పర్శనుబొంది వారు పరమ ప్రముదితలగుచుండిరి. ఇండ్లువాకిళ్లను కుటుంబ పరివార మును, శరీరమును, సమస్త ప్రపంచమును వారు మఱచిరి.

ఇద్దరి శరీరములును, వస్త్రములతో వస్త్రములును, ఆభూష ణములతో నాభూషణములును గలిసికొని ఒక్కటయ్యెను. అచ్చట ద్వైత మెవ్వరికిని ప్రియముగ లేదు. అందఱును దనలోఁ గలిసికొనుటకు సముత్సుకులుగ నుండిరి. క్రీడాసక్త లును, కలకంఠ నినాదినులగు కమనీయ కనక కుండలయుక్త కపోలముల కాంతిచే మెఱయుచుండిన జంచలమగు మెఱుఁగు తీఁగెలవలె నుండిరి. అనేక మూర్తులను ధరించిన జలభరిత శ్యామ మేఘములనలె రసవర్షము వర్షించుచుండెను. మధుర స్వరముతో గానమొనర్చుచుండిరి. ఆ దృశ్యమును వర్ణిం చుట కేకవికి సాధ్యమగును? ఆ యనుపమ వర్ణనము నెవఁడు వర్ణింపఁ గలఁడు ?

ఆ సఖులందఱును నృత్య, గాన, వాద్యము లొక్కసా రిగాఁ జేయుచుండిరి. శరీరములను ద్రిప్పుచు, సైగల నొన ర్చుచు, హావభావములఁ జూపించుచు నృత్యమొనర్చు చుండిరి. కాళ్ల అందెలు గజ్జెలును, మొలనూళ్లును, చేతి గాజు లును శబ్దించుచుండెను. వారందఱు నానందించుచు నుచ్చ స్వరమున రాగములతో గాన మొనర్చుచుండిరి. ఈ విధ ముగ వారు శ్యామసుందరుని శోభకు వశపడి, ఆతని పుణ్య స్పర్శనుబొంది ప్రముదితలగుచుండిరి. తమ సంగీతము ద్వారా ఆతని సంతోషపెట్టుచుండిరి. ఈ విధముగ వారి దివ్య సంగీత ధ్వని విశ్వమంతటను వ్యాపించెను. అచరములు సచ

రములయ్యెను. బృందావనమందలి వృక్షములు పులకించెను. గోపికలు తమశక్తికొలఁది గోవిందుని సంతోషపెట్టుచుండిరి. వారాతని అంగసంగముచే నత్యంతాహ్లాదిత మొనర్చు చుండిరి. కృష్ణుఁడొక రాగమును బాడఁగా నొక గోపిక దాని నందుకొని అనుసరించును. భగవానుఁ డేగానమును మంద్ర మధ్యమ స్వరమున నాలాపించునో, దానినే గోపిక తారస్వరమున గానమొనర్చును. సుందర తారస్వరమున వారు పాడఁగా వినఁగానే కృష్ణుని రోమరోమములు నిక్కఁ బొడిచెను. మురళీ ధ్వనితో వారి హృత్తంత్రులు స్వయము గనే ఝుంకృతము లయ్యెను. ఆ ఝుంకృతిలయలో వారి నోటినుండి "సాధుసాధు" "ధన్యధన్య" "బాగుబాగు" అను శబ్దములు వెలువడెను.

ఆ లయనే ఒకర్తుక "ధ్రువ" తాళమునఁ బాడెను. అప్పుడు శ్యామసుందరుఁడు చకితుఁడయ్యెను. మాటిమాటి కామె నాలింగనము గావించుకొని యిట్లనెను:- "నీవు సంగీత శాస్త్రమున నింతటి నేర్పరివని నాకిదివఱలోఁ దెలియదు. నీవు హద్దులుదాటి పాడితివి." ప్రియుని ఆలింగనమునుబొంది ఆమె శరీరవిస్మృతినిఁ జెందెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ప్రపంచమున నేదైన గొప్ప పారితోషిక ముండిన నది ప్రియాలింగనమే.

దండకారణ్యమున, జానకీజీవనుండును, రఘుకుల మండనుండును, కౌసల్యానంద వర్ధనుండునగు రామచంద్రుండు విచరించునప్పుడు పంచవటియందు నాతని యాజ్ఞచే లక్ష్మణుండొక కుటీరమును నిర్మించెను. ఆతని యొక్క కోరిక రాముని సంతోషపెట్టుటయే. అట్టివారన్ని కళలందును నిపుణులగుదురు. వారి పనులన్నియును స్వతఃసుందరములగును. లక్ష్మణుండు మిక్కిలి సుందరమగు గుటీరమును నిర్మించెను. రాముండిట్టి కుటీరమునుగాంచి మిక్కిలి యానందమునుజెంది లక్ష్మణునితో నిట్లనెను. "లక్ష్మణా! నీవు చక్కని కుటీరమును నిర్మించితివి. నీయీ కళకు సంతసించితిని. నేను నీకు పారితోషిక మీయందలంచితిని. కాని నేను రాజ్యభ్రష్టుండను, అన్నిటిని పీడి వనవాస మొనర్చుచున్నాను. ఇచ్చుటకు నావద్ద నేమున్నది? అయినను ప్రపంచమునం బ్రియాలింగనమే గొప్ప పారితోషికము. రమ్ము, నేడు నీకు దాని నొసంగెదను." అనిపలికి రాముండు లజ్జతోం దలవంచుకొని సిగ్గుతో నిలుచుండిన దన తమ్ముని జేతులనుజాచి గట్టిగాం గౌంగిలించుకొనెను. గాఢాలింగన మొనర్చెను. అనంత జన్మలనుండి చేసిన సేవాఫలితమును లక్ష్మణుండీ యాలింగనమునసే పొందెను. అట్లే గోపిక శ్రీకృష్ణుని లయను ధ్రువతాళమునం బాడంగా భగవానుండాలింగన ప్రదాన మొనర్చి, ఆమె సంగీత శ్రమను సఫలము గావించెను.

ఒకానొక గోపిక శ్రీకృష్ణు నానందింపఁజేయుటకై ఆడి ఆడి అలయునట్లాడెను. ఆమె కరకంకణములును, ఆమె కేశపాశములందు దుఱిమిన మల్లికా మాలతీ మాలలు చిక్కుపడెను శరీరము శిథిలమయ్యెను. ముఖమున స్వేద బిందువులు మెఱసెను. కటి వస్త్రము జారెను. శరీరము శ్రమించి నల్లయ్యెను. అప్పుడామె సమీపమున నిలుచుండిన మదనమోహనుని స్థూల కమనీయ స్కంధము నాధారము చేసికొని, ఆతని విశాలభుజములను గౌఁగిలించుకొనెను. భగవానుఁడును గట్టిగాఁ బట్టుకొనెను. దానివలన నామె శ్రమయంతయును దూరమయ్యెను. శరీర బాధ శాంతించెను. మనముకురము వికసించెను. కృష్ణుఁడాతని పీతాంబరముచే నామె చెమటను దుడిచెను. ఆమె కృతకృత్య యయ్యెను.

ఒకానొక గోపిక భుజముమీఁదఁ జేయివైచి నృత్యము నాపి వనమాలి నిలుచుండెను. ఆమెయును నలసియుండెను. కృష్ణుఁడును రొప్పుచుండెను. దీని వలన నామెకు ధైర్యము సడలెను. ఆమె వెంటనే వంగి విశాలమును, మృదులమును నునుపునగు నాతని భుజమును ముద్దు పెట్టుకొనెను, ఆ భుజము చందనాగరులచేఁ జర్చితమై యుండెను. పీత చందన మలఁద బడియుండెను. కమలగంధ వాసనలచే శోభించుచున్న నాతని భుజమును గాంచి యున్మత్తయయ్యెను. స్వాభా

వికముగ శ్రీకృష్ణుని శరీరమునుండి సుగంధము వెలువడు చుండును. పైఁగా దానిమీఁద కస్తూరి, కర్పూరాగరు చందనాదులచే ననులిప్తమైన గంధవిషయమున నింకఁజెప్పవలసిన దేమున్నది? కామ సంతప్తయగు నేకాంత అట్టి యలౌకిక గంధము నాఘ్రాణించి మత్తిల్లకుండఁ గలదు?

ఒకానొక గోపిక ఆడఁగా నాడఁగాఁ దల వ్రేలాడి పడి శ్రీకృష్ణుని శిరము కడకుఁబోయెను. ఆతని ముఖముతో నామె ముఖము కలిసెను, కమల సదృశమై, కుండలకాంతులచే నుద్భాసితమగు నామె మనోహర ముఖము తన కడకు రాఁగా, దానికి స్వాగత సత్కారము లొనర్పవలయునని కృష్ణుఁడాలోచించి, భోజనము లేకున్నను తాంబూలమునైన నొసంగవలయునని, శ్రీకృష్ణుని నోటిలోనుండిన తమలమును దన కానుకొనిన గోపికకందించెను. దివ్య ప్రసాదమగు దాంబూలమును బొందఁగానే గోపిక ముఖము వికసించెను. అధరము అదరసాగెను. నయనమనురాగరంజిత యయ్యెను. శిరస్సు వడిలోనికి దూరెను.

ఒకానొక గోపిక పాడఁగాఁ బాడఁగా హృదయమున నుండిన గాయము బాధపెట్టఁజొచ్చెను. సంతాపము కలిగెను. ఆ యబల భయభీతయై సమీపమున నెవ్వరును లేకపోవుటచే నచ్చటనుండి నచ్యుతుని వడిలోఁబడెను. అభయ

మొసంగు నాతని కరకమలము నెత్తి హృదయముపై నుంచు
కొని సంతాప మొనర్చు దుష్టుని దండింపుమని సైగ చేసెను.
నా కఠినహృదయమందు ఉపద్రవ మొనర్చు నాతనిఁదాడన
మొనర్చి శిక్షింపుము.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! ఈ విషయము
వర్ణింప యోగ్యమైనది కాదు. ప్రాకృత పురుషులు దీనిలో
నశ్లీలతా నారోపణమును గావించెదరు. కాముకులు దీనిని
దురుపయోగ మొనర్చెదరు. కావున నీ విషయమును
మిక్కలి విస్తార మొనర్పను. విస్తార మొనర్పవలసిన దిది యే.
శ్రీకృష్ణ చరిత్రకు రాస పంచాధ్యాయము హృదయము.
దానిలో నీ పంచశ్లోకములు పంచప్రాణములు, జీవనములు.
కాని యేమి చేయఁగలను? ఇప్పుడు నాలోఁ జెప్పుటకు
శక్తిలేదు. నా వాక్కులు రుద్ధమైనవి. ఆ కృష్ణకాంత తన
ప్రేష్ఠుని బాహుపాశమందు బంధింపఁబడి - పరమానంద
సుఖము ననుభవించును - తన దివ్య సంగీతముద్వారా
రాధారమణుని సంతోషపెట్టుచు, రాసవిలాసానంద విహాస
మొనర్చుచుండెను.''

——//——

# బింబ ప్రతిబింబ స్థల క్రీడ

౭౯౨

శ్లో॥ తదంగ సంగ ప్రముదా కులేంద్రియాః
కేశాన్ దుకూలం కుచ పట్టికాం వా।
నాంజః ప్రతి వ్యోఢు మలం వ్రజస్త్రియో
విస్రస్త మాలాభరణాః కురూద్వహ ॥

శ్రీ భాగ, ౧౦ స్కం, ౩౩ అ, ౧౮ శ్లో ॥

క॥ హరితనుసంగ సుఖంబునఁ
బరవశలై ప్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె
సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

బాలకుఁడు అద్దములోఁ దన ప్రతిబింబమును గాంచి తనలోఁ దాను నవ్వుకొనుచు ముగ్ధుఁడగును. రసము బయట ఉండదు. తనలోని రసమును బయట పానము చేయుదము. ఎచ్చటనైనను వివాహముజరిగిన గృహస్థులిట్లనెదరు:- ''ఇది ఫలాని వారి వివాహమందలి పంచదారనొక్కులు. ఎంత తియ్యగానున్నది.'' వాస్తవమున నీ నొక్కులు తమవే, మనము వివాహమునకు నొక్కులను బంపినవానినే మనకు

వారు తిరిగి పంపెదరు. కొందఱు వానిని తూచి, అవియెంత తూగినవో, సరిగా నంతే పంపుచుందురు, అవి ముక్కలైనచో మరల ముక్కలను జేసియే పంపుచుందురు.' తమ తిండినే యితరుల ఇండ్లలోఁ బెట్టుకొని తినెదరను సామెత కలదు, మనము చూచు రూపము లన్నియును మనలోపలనే కలవు. లోపల లేకున్న బయటకుఁ గనఁబడవు, మన మేవస్తువులోనైనను రసమును గ్రహించిన నది మనలోనిదే కాని బయటదికాదు, కొందఱు మనకు మిక్కిలి ప్రియములుగ నుందురు, వారినిఁ గాంచుటకు మన చిత్తము చంచలమగును, వారి వాక్కులను వినఁగానే చిత్తము పరమ ప్రముదితమగును, మిక్కిలి యుత్కంఠతతో వారినిఁ బ్రతీక్షించుచుందుము, కొందఱు వారినిఁ గాంచఁగనే యేవగించుకొందురు. వారికి హృదయమున శూలము వలెఁగ్రుచ్చుకొనును సుఖమునొసంగు సామర్థ్యమావ్యక్తిలో నుండినచో నందఱుకును వానినిఁగాంచి సంతోషింపవలెను, మన కొక్కరికే అట్టి సుఖము రానేల ?దీనిని బట్టి సుఖము మనలోనే కలదని తెలుచున్నది, లోపల మనము దేనిని సుఖమనుకొనుచున్నామో అది సుఖమగును, దేనిని దుఃఖమనుకొనుచున్నామో అది దుఃఖమగును, బాహ్యావస్తువులలో సుఖము లేదు, సుఖము ప్రేమలోఁ గలదు. కావున జ్ఞానికి తుష్టి కొఱకింక వస్తువక్కఱ లేదు, ఆతఁడాత్మలోనే సంతు

ప్తినిఁ జెందును, పరిపూర్ణునకుఁ గ్రీడకొఱకు బాహ్యవస్తువు లను సమకూర్చుకొనవలసిన యక్కఱ లేదు, అది ఆత్మక్రీడయే కాఁగ లదు, తనకు దానే క్రీడించును, గోపికలు శ్రీకృష్ణునకు భిన్నులు కారు, కేవలము రసవాదన మొనర్చుటకై శ్రీకృ ష్ణుని విభిన్నశక్తులే గోపికా రూపమున వ్యక్తమయ్యెను, శక్తిమంతుఁడు తనకుఁదానే తన శక్తులతోఁ గ్రీడించుచుం డెను. ఈ గ్రీడల నెవరైన దోషబుద్ధితోఁ జూచినయెడల నా దోషము వారికన్నులలోనే కలదు, దీనిలోఁ బ్రాకృత కామ మును గాంచినచో నట్టివాని మనస్సు కామపూర్ణమైనదని గ్రహింపవలెను, కాకున్నఁ బ్రకృతికి బరుఁడును. నిత్య నిర్లేప, విశుద్ధబ్రహ్మమునందు బ్రాకృతభావమెట్లు రాఁగ లదు ? ఆతని సమస్త క్రీడలను గేవలము విశుద్ధ ప్రేమమయ ములే.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఇష్టము లేకున్నను నిప్పుడీ రాసలీలా వర్ణనము సమాప్తముగావించి ముందుకు బోవఁదలఁచినాను, స్వామీ! ఎవ్వండైనను నీరసములో నెప్పు డైనఁ బ్రవేశించినా దానిలోఁ గలిసిపోయి మరల నీ ప్రపం చములోనికి రాఁడు. ఉప్పుబొమ్మ సముద్రపు లోతును గనుఁ గొనఁబోయి దానిలోనే కలిసిపోయి మరల దానిలోతును జెప్పుటకు రానట్లు దీనిలోఁ బ్రవేశించినవాఁడు దానిలోనే

కలిసిపోయి మరల దాని లోతును జెప్పుటకు రానట్లు దీనిలోఁ బ్రవేశించినవాఁడు దానిలోనే కలిసిపోవును.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! మేమెంతగానో నీవు రాస లీలనుగూర్చి విస్తారముగఁ జెప్పెదవని ఆశ పెట్టుకొనియుండఁగా నీవంతయును బేడ బెల్లము నొనర్చితివి. ఒక పాఠశాలలోని బాలకులు తమ పాఠశాలాధిపతి శ్రేష్ఠిగారింటిలో వివాహ సమయమున నెన్నో రసగుల్లాలు, మంచిమంచి ఫలహార ములు పెట్టునని ఆశించియుండిరి. కాని పెండ్లి సమయము రాఁగా ఏదో ఒక్కొక్కలడ్డుఁ పెట్టి పంపించివైచినాఁడు. అట్లే నీవును మా విషయమునఁ జేసినావు. కృష్ణుఁడు మురళీగాన మొనర్చెననఁగానే రాసవర్ణనమును జేదువను నుత్సా హము మాకు కలిగినది. నీవెంత విస్తార మొనర్చిన మాకం తటి ఉత్సాహము పెరుగుచున్నది. మధ్యలో రసభంగము కలుగునేమోనను భయమున మేము మాటలాడలేదు. మిక్కిలి ధైర్యముతో మేము నీకథను వినుచుండఁగా నత్యధి కానందము కలుగు సమయమున సరిగా దాని నాపితివి. మహాభాగా! రాసలీలా వర్ణనమింకను జేయుము. నీవు సాం సారిక కాముకులను జూడనేల? వారు కుక్కలు. మొఱఁగ కుండఁజాలరు. వారితో నీకేమి పని ? నీవు భగవద్భక్తులు, రసిక భావుకుల కొఱకే యీ రాసరస వర్ణన మొనర్చు

చున్నావు. వారు భగవల్లీలలో నశ్లీలతను గాంచనైనఁ గాంచరు. ఇంక నశ్లీలతనుగూర్చిన ప్రసంగమేమున్నది ? అశ్లీలతారోపము ఇతరులపైననే, అందఱును దనవారే యైనచో భయము విషయమే లేదు.

సూతుఁడిట్లనెను:- "లేదు, స్వామీ! నాకు సాంసారికుల భయములేదు. చాలమంది ధర్మము బూటకమనుచుందురు. చాలమంది భగవంతుని ఒప్పుకొనరు. అట్టివారి వెంటఁబడి మనము ధర్మము, భగవంతుఁడను మాటలుపలుకము, కానిస్వామీ! రాసలీలను ప్రాకృతభాషలో వర్ణింపఁ జాలము. దానికి నేను శబ్దముల నెచ్చటినుండి తేఁగలను. ప్రాకృత స్త్రీపురుషుల రతిసమయమున వ్యవహరించు శబ్దములే యిచ్చట వ్యవహరింపఁబడును. ఆ శబ్దములలోని భావములను గ్రహింపక మానవులు శబ్దములనే పట్టుకొని యిట్లనుచుందురు:-"శ్రీకృష్ణుఁడు సాధారణ గోపబాలకుఁడు. వనచారులగు నా గోపికలు వ్యభిచారిణులు, వారి కామక్రీడ ధర్మవిరుద్ధము," అందువలన నీవిషయమున నాకు భయము కలదు. అందువలన నేనీ విషయమును విస్తారమొనర్పను. కాకున్న నీవిషయమున వ్రజభాషలో విస్తారముగ రసికులు వర్ణించియుండిరి. వానిని జీవితమంతయును జదివినను, విన్నను వ్యధి తరుగదు. నేనీ రసమును వర్ణించుట కధికారినని భావిం

చుట లేదు. ఇప్పుడీ ప్రసంగమును సమాప్త మొనర్పఁ దలఁచుచున్నాను."

శౌనకుఁడిట్లనెను:- "సరే, నీ యిష్టము. సరే. గోపికలు భగవంతుని శరీరమును గాఁగిలించుకొని, ఆతని శరీర దివ్యసుగంధమును వాసనచూచి, ఆతని త్రిభువన కమనీయ రూపమును గాంచి, ఆతని తమలమును సేవించి, ఆతని యధరామృతమును బాన మొనర్చుట యేనా ? ఇంకేమైనఁ జేసినాఁడా? ఈ ప్రసంగమున నీ విషయమును జెప్పి పూర్తి చేయుము బాబూ"

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ ! మీరంగీకరింపరు గాని యీ శుష్కములగు జడలు, గడ్డములు మీసముల లోపల మీ హృదయముల యందలి కూడ శ్రీరాధాకృష్ణాను రాగ రససముద్ర తరంగము లుబుకు చున్నవి. మీరు పైకే సాధువులైనారు కాని, లోపల మిక్కిలి రసికులై యున్నారే."

కన్నుల నీరు నింపుకొని శౌనకుఁడిట్లనెను:- "సూతా! మా కట్టి భాగ్యమెక్కడిది ? మేము నీరస హృదయులము. శ్రీరాధాకృష్ణరసము మా హృదయములను స్పర్శింప లేదు. నీవే యిట్టి సరసశ్రుత మధుర కథామృతమును జెప్పి - రస తుంపురులను జిలికి - మా శుష్క హృదయములను గుణ వంతుఁడగు గాయకుఁడు శ్రీరాగమును బాడి శుష్కవృక్షమును జిగిర్పఁ జేసినట్లు సరస మొనర్పు చున్నావు."

సూతుఁడిట్లనెను:- ' స్వామీ! అయితే యిప్పుడింక మీరు రాసప్రసంగమును వినుఁడు భగవానుఁడు రమారమణుఁడు. ఆతఁడు లక్ష్మితో నిరంతరము క్రీడించుచుండును. అట్టి భగవానుని గ్రామీణ గోపికలు పతిరూపమునఁ బ్రాప్తించెను. ఎవని దర్శనముకొఱకు గొప్పగొప్ప యోగులు అనేక జన్మములవఱకు జప, తపము లొనర్చుచుందురో, అట్టి భగవానుఁడు స్వయముగఁ బట్టుకొని వారినిఁ గౌఁగిలించు కొనెను. ఆతఁడు స్వయముగ మాలలను వైచెను, తన చేతితోఁ జందనమును బూసెను. తన తాంబూలపు తమ్మ నొసంగెను. తన చేతులతో నాతఁడు వారి ముఖస్వేదమును దుడిచెను. ఇంత యేల వారికి చరణసేవలొనర్చెను. ఇంత కంటె గొప్పసౌభాగ్య మింకేమున్నదో చెప్పుఁడు.

గోపికలు దా మేమియు నుంచుకొనలేదు. తన సర్వస్వ మును శ్యామసుందరుని పాదపద్మముల కర్పణము కావించిరి. భగవానుఁ డెచ్చటఁ గూర్చుండుమనిన నచ్చటఁగూర్చుండిరి. లెమ్మనిన లేచిరి. భగవానుఁ డాడుమనిన నాడిరి, పాడు మనినఁ బాడిరి. వారు శ్యామ సంకల్పాను సారముగ నాడుటకు సంకల్పించిరి. కృష్ణుఁడే తాను సఖురాండ్రందఱకును నలంకరించెను. ఇన్ని కలువల నాతఁడెచ్చట తెచ్చెనో తెలియదు. అందఱి కర్ణములలో నాతఁడు పుష్పములను

దుఱిమెను. దివ్యసుగంధిత పుష్పమాలలను వారి జడలలో గ్రుచ్చెను. వాని గంధలోభముచే భ్రమరములు జుట్టును మూగి ఝుంకారము లొనర్చెను. అవి గోవింద గుణగాన మొనర్చుచున్నట్లుండెను. ఆతని గుణగానమునఁ దాళమును గలిపి గోపికలు నాట్యమాడుచు భావమును బ్రదర్శించు చుండిరి. వారి ముఖమున స్వేదబిందువులుండిన దాను స్వయ ముగఁ దుడిచెడువాఁడు. దానివలన వారి యుత్సాహము నూతనమయ్యెడిది. హృదయ సాగరమునుండి భావతరంగము లుబుకును. మునులారా! భగవానుఁడు నృత్యమొనర్చుచు నొక్కొక్కప్పుడు వారి ముఖములను, వక్షఃస్థలములను, కటి ప్రదేశములను స్పర్శించుచుండును, ఒక్కొక్కప్పు డాలింగన మొసంగును. ఒక్కొక్కప్పుడు ప్రణయకటాక్షములు, మంద హాసములద్వారా వారినభినందించును. ఈ విధముగాఁ దానా డుచు, వారి నాడించుచుండును. ఆ రమణులను రాసయందు రమింపఁజేసెను. ఈ గోపికల యానందమునకు మేఱలేదు. సురాపానమొనర్చువాఁడదే పనిగాఁ ద్రాగి త్రాగి మత్తుఁడై యింకను ద్రాగుచున్నట్లు వ్రజవనితలొనర్చుచుండిరి. కేశ బంధములనుండి మాలలు జారెను. కటి వస్త్రములు వదులై జారిపోయెను. రవిక ముడులు తెగెను. వక్షఃస్థలము లనా వృతములయ్యెను. ఇట్లైనను వారికి శరీరములు తెలియలేదు.

వారు బృందావన విహారితో విహారమొనర్చుచు దేహ గేహములను మఱచి విహ్వాలులైరి.

గోపికలాత్మవిస్మృతినిఁ జెందుటయేకాదు. చంద్రుఁడు తన గతిని మఱచెను. రాత్రియును దేవతలరాత్రి - ఆఱు మాసములయ్యెను. సమస్త గ్రహతారకాగణములు గతిహీనములై స్తబ్ధమయ్యెను, ఆకాశమునఁ దమతమ పతులతో విమానముల మీఁదనుండిన దేవాంగనలకును శరీరమును తెలియకుండెను. ఆ సురసుందరీ గణమంతయును గామాతురలై మోహితలైరి. వారి వస్త్రములు జారెను. కాని వారికది తెలియదు"

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! భగవానుని మనస్సులోఁ గామ భావముత్పన్నము కాలేదా?"

అదరిపడి సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీ రేమి మాటలాడుచున్నారు? భగవానుఁ డాత్మారాముఁడు. ఆతని మనస్సున నెన్నఁడైనఁ గామ భావము కలుగునా? ఆతఁ డాత్మారాముఁడు. ఆత్మరతుఁడు. ఆత్మతుష్టుఁడు, ఆత్మతోఁ గ్రీడించును. కామ విజయముకొఱకే ఆతఁడీ క్రీడనొనర్చెను. గోపికలెందఱున్నారో, భగవానుఁడన్ని రూపములను ధరించినాఁడు. ఎవరెంత చిన్నగాఁ బెద్దగా నుందురో చైతన్యాత్మయును నట్లే చిన్నగాఁ బెద్దగానగును. ఇదంతయును లీలాధారి

యొక్క లీల. క్రీడాప్రియుని క్రీడ, వినోదియొక్క వినోదము. విహారియొక్క విహారము. రాధారమణుని రమణులతో రమణము.''

గోపాంగనలు రాసయొనర్చి అలసిపోఁగా నాతఁడు వారి శరీరములను నిమిరి, ముఖమునందుండిన స్వేదబిందువులను దుడిచి, వారిని తొడపైఁ బరుండఁబెట్టుకొని తట్టి వారి శ్రమను దీర్చెను. ప్రేమ పూర్వకముగ శాంతిదాయక కర కమలములతో వారి శరీరములఁ దుడిచెను. భగవానుని నఖ స్పర్శచేఁ బ్రముదితలై ఆ పుణ్య ప్రేమమయలగు ప్రమదలు, గలగలలాడు కమనీయ కనక కుండలముల చేతను, ఉంగరములు తిరిగిన నల్లని అలకావళిచేతను గాంతిమంతమై అలంకారముగ నుండిన లోల కపోలకాంతుల చేతను, సుధామధుర మగు మందహాసము చేతను, జిత్తమును హరించుచు నాతని యెడల ననురాగమును బ్రదర్శించుచు నాతని క్రీడలలో నిమగ్నలై ఆతని గుణగాన మొనర్చుచుండిరి.

సూతుఁడిట్లనెను:- ''మునులారా! రాధాకృష్ణులందఱతోఁ గలిసి నృత్యము చేయు రాస యొకటియును, మఱియొకటి వైయక్తిక నృత్యమొకటి. శ్రీ రాధాకృష్ణులు సింహాసనము మీఁద విరాజమానులగుదురు. అంతఁ గ్రమముగ నొక్కొక్క గోపిక వచ్చి తన నృత్యకళను జూపించును.

అందఱు నృత్యమైపోయిన తరువాత రాధాదేవి నృత్యమొన ర్చెను. అంతఁ గృష్ణుఁడును దన నృత్యమును జూపించును. ఈవిధముగ నిద్దరియొక్క వివిధ నృత్యములు జరిగెను. నృత్యము చేయఁగా చేయఁగా నందఱకును శ్రమ, వేడిగా నుండుట తోఁచెను. అప్పుడు శ్యామసుందరుఁడు సఖులతోఁ గూడి జలకేళి నొనర్పఁదలఁచెను. మునులారా! జలమును జీవనమందురు. నీరే ప్రాణాధారముకదా! జలమును గాంచఁ గనే ప్రాణి యానందించును. జలములోఁ బ్రవేశింపఁగనే శరీరము శీతలమగును, ఎండకాలమున జలస్పర్శ అత్యంత సుఖదముగ నుండును. స్నాన మొనర్చుటచే శరీరము తేలిక గును. జలమున స్నానమొనర్చిన నానందము కలుగును. తన ప్రియురాండ్రతోఁ గలసి జలకేళి నొనర్చు అవకాశము లభించెనా, యింకఁ జెప్పవలసినదేమున్నది. అది సుఖము నకు సీమ, ఇద్దరకును బరమాహ్లాదము కలిగెను. ఇప్పుడీక నేను దానిని వర్ణించెదను.''

—॥—

# ఆత్మారాముని జలకేళి



శ్లో॥ సోఽంభస్యలం యువతి భిః పరిషిచ్యమానః
ప్రేమ్ణేక్షితః ప్రహసతీ భి రిత స్తతోఽంగ ।
వై మానికైః కుసుమ వర్షిభిరీడ్యమానో
రేమే స్వయం స్వరతిరత్ర గజేంద్రలీలః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౨౪ శ్లో॥

మ॥ సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధ
చేలాద్యలం
కృతుఁడై కుంభి క రేణు యూథములతోఁ గ్రీడించు
చందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయ లీలా శయ్యలందున్
సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలా
మంబులన్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

సంతాపానంతరము శీతలత్వము ప్రాప్తించెనా, అది ఆఁకలి గొన్నవానికి పంచభక్ష్య పరమాన్నములను బెట్టిన నెట్లుండునో అంత సుఖముగ నుండును. శీతలవస్తు స్పర్శచే

రోమములు నిక్కఁబొడుచును. లోపలినుండి స్పందనము బయలుదేరును. ప్రియుని సంస్పర్శచేతను గంపము గలుగును. రెండు వస్తువులును గలిసినప్పుడును, సుశీతల జలమునఁ బ్రియుని సుఖద సంస్పర్శయును, సంగమును బ్రాప్తించిన, పైగా హాస్య వినోదమును గలుగఁగా నా సుఖమునకు మేఱ యేమున్నది. అది అంతులేని సుఖము. గోపిక గాక సుఖప్రాప్తి యెట్లు కలుగును. భగవానుఁడు గోపికలతో స్నానమాడెను. కాని గద్గత కంఠములతో గోపికలు హాఁ హాఁ యని నవ్వుచుండిరి. కాని వారి హాస్యములలోఁ గోకిల కంఠలగు గామినుల కంఠములలో గల స్వారస్యమెక్కడిది? గోపకుల పిలకల నుండియును జలబిందువులు రాలినవి, కాని యాజలబిందువులలోఁ గాల సర్పముల వలె నుండి వారి జడల మీఁదనుండి చిందిన జలబిందువుల సౌందర్య మెక్కడిది? గోపకులు స్నానమొనర్చుచుండ వారి పండ్ల పటపటలు వినఁబడును. కాని స్నాన సమయమున గాజుల గలగలలు, కాళ్ల అందెల చప్పుడుచేఁ గృష్ణ మన మయూరము నృత్యమొనర్చును. వాని ముందీ రూక్షగోప పండ్ల పటపటలలో నానంద మెక్కడిది? ఈ విషయముల నన్నిటిని విచారింపఁగా నిర్ణయింపవలసిన దేమనఁగా జలకేళి ఆనంద్ధము గోపికలతోడనే జరుగవలెను, ఎవరేమైన

నమకొననిందు, ఈసుఖము గోపికల భాగ్యమందే వ్రాయబడినది.

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాసలోని శ్రమ ప్రియుని అంగస్పర్శచేతను, బహుమానముచేతను దూరమయ్యెను. అప్పుడు కృష్ణుఁడిట్లనెను:- "పోవుదము పదండి, స్థలక్రీడను వదలి జలక్రీడను జేయుదము. రాసశ్రమను యమునా స్నానముచే శాంతింపఁజేసికొందము." గోపికలు శీతలత్వమును గోరుకొనుచుండిరి. అందువలన శ్రీకృష్ణుని సుశీతల కరమును మాటి మాటికిని ముఖముపైనను, ఉరముపైనను, మిగిలిన శరీరము పైనను నుంచుకొనుచుండిరి. వారు తమ శరీరమంతటియొక్క తపనమును బోఁగొట్టుకొనుటకై వ్యగ్రలై యుండిరి. ప్రియుని ప్రస్తావముచే వారి మనముకురము వికసించెను, మమత్వమునంతను నొలికించుచుఁ బ్రియుని గాఢాలింగనమొనర్చి వాని దృష్టిలోఁ దమ తమ దృష్టినిఁ గలిపి, అనురాగ భరిత వాక్కులతో నిట్లనిరి:- "పోవుదము పదండి, నీల నీర సంస్పర్శచే శీతలత్వము కల్గును."

ఇంకేమున్నది? గోపికలతో శ్రీకృష్ణుఁడు విద్యుల్లతా పరివృతమైన నీలమేఘమువలె బయలుదేరెను. ఘర్మ సంతప్తమైన యూథపతియగు గజేంద్రుఁడు కరిణీ యూథముతోఁ

గూడి సరిత్స్రవంతిలోనికి వెడలునట్లు వ్రజవల్లభుఁడు వ్రజాంగనలతోఁ జుట్టుకొనఁబడి కాళిందీ కలితకూలమునకు జలకేళీ నిమిత్తమై వెడలిరి. అందఱ శరీరములమీఁద అత్యంత క్షీణపటములుండెను. వాని వలన శరీరములు స్పష్టముగఁ గనఁబడుచుండెను. అట్టి వస్త్రములను ధరించి ప్రియుని కంఠమును దృఢముగఁ గౌఁగిలించుకొని, ఇకిలించుచు, శరీరమును గంపింపఁజేయుచుఁ దమ సంపూర్ణభావమును గృష్ణునిపై వేయుచు ఘనశ్యామునితో నీటిలోఁ బ్రవేశించిరి. పైనుండి దేవతలు చూచుచుండిరి. వారు పుష్పవర్షమును గురిపించుచుండిరి. దేవతలు వర్షించిన పుష్పములచే యమునానది పుష్పమయమైనది. శివలింగముల మీఁద వేలకొలఁది పుష్పముల నర్పించినట్లు వారి శిరముల మీఁదఁ గల్పవృక్ష పుష్పములను గురిపించిరి, దేవతలు సాధు, సాధు, ధన్య ధన్య, జయ జయ శబ్దములు పలుకుచుండిరి.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! భగవానుఁడు సర్వసమర్థుఁడు. అతనికి మంచియును లేదు, చెడ్డయును లేదు. కర్తవ్యమును లేదు అకర్తవ్యమును లేదు. అయినను గొంచెము మర్యాదాపాలన మొనర్పవలయును. దేవతా సమ్ముఖమున గోపికల శరీరముతో శరీరమును, గలిపి, వరుణ నివాస స్థానమగు జలమునందు బ్రవేశించుట ఉచితముగఁ

దోఁచదు. వ్రజవనితలు నగ్నస్నాన మొనర్చెడువారు. అట్లు చేయుటచే నా యపరాధమునకు భగవానుఁడు వారి నెంతగా నాడించెనో, ఎన్ని తిప్పలు పెట్టెనో, నీటినుండి బయటకు రండు. రెండు చేతులను బైకెత్తుఁడు. సూర్యునకుఁ బ్రణామ మాచరింపుఁడు. పాపమా పిల్లలు ధర్మ భీరువులు. ధర్మభయమున వారు సమస్తమును జేసిరి. ఇప్పుడీ చోర శిఖామణి నెవఁడైన స్త్రీల శరీరములతో శరీరములను గలిపి జలమునఁ బ్రవేశించుట ధర్మ విరుద్ధము కాదాయని యెవ రైన నడుగ వచ్చును. కాని స్వామి! గొప్ప విషయ మేమ నఁగా నీతఁడేది చేసిన నదియే మంచిది. కొద్దివారెవరైనఁ జేసినచో, నది తప్పు.

నవ్వి సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీరీ వక్రగతి వనమాలి విషయమును మీరడుగకుఁడు. ఈతని శరీరము మూఁడు చోట్లనే వంకర కాదు. వీని సమస్త విషయములును వంకరలే. మర్యాదా కార్యముల నీతఁడు ధనుర్ధారియగు రామునికిచ్చినాఁడు. ఏలననఁగా మర్యాదా పాలనము శాంత దృష్టితో గంభీరముగ జరుగవలయును. ఈతఁడు మహాచంచలుఁడు. ఈతని దృష్టి ఒకచోట స్థిరముగ నుండదు. కావున మీరు మర్యాదను వెదుకుకొనఁదలఁచి నచో జానకీజీవన, దశరథనందన, ప్రణతపాల, రఘుకుల

మండన శ్రీ రాఘవేంద్రునిలోఁ గాంచుఁడు. ఈతఁడు లోక వేద మర్యాదారూపమగు బంధనమును త్రెంచి స్వాచ్ఛంద ముగ నుండిన మత్తగజేంద్రుఁడు. అందువలననే మా గురు దేవుఁడీతని "ఇభరాజ ఇవభిన్నసేతుః" అని పిలిచినాఁడు. స్వామీ! శ్రీకృష్ణావతారమున రసాభివ్యక్తినిఁ గావించి నాఁడు. శృంగారరసప్రవాహము ఈ యవతారమునఁ బ్రవ హించినట్లు అన్య అవతారములలో నెక్కడిది? ఈ యవ తారము భూమిమీఁదకు రాకుండినచో శ్రీ రాధాకృష్ణలీలా ప్రాకట్యము ఈ మర్త్యలోకమున జరుగకుండినచో నీ ప్రపంచ మంతయును రసహీనమును నీరసమును గాఁగలదు. శృంగార సంగీతములకుఁ బ్రాణము శ్రీ రాధాకృష్ణుల లలిత లీలలే. మురళీగానము ప్రపంచమునంతను రసమున ముంచి నది. మూర్ఖులలో మూర్ఖుని, విద్వాంసులలో విద్వాంసుని శ్యామసుందరుని మురళి విహ్వాలులఁ గావించినది. రసభరిత మగు నీ మురళిని ప్రమోగింపకుండిన నదులు హృదయము లును శుష్కములై యుండెడివి. వానిలో నుండిన సరస భావనా రూపములగు మత్స్యములు గిలగిల కొట్టుకొని మర ణించెడివి, ఈ జగత్తునంతను రాధాకృష్ణ కృపాకటాక్షము సరస మొనరించినది, మహా భాగలగు గోపికల రాసము జగత్తున రస సరిత్తును బ్రవహింపఁ జేసినది. గోపికలాతని నిత్య సహచారిణులు. యథార్థమగు ధర్మపత్నులు, బ్రహ్మ

మోహా సమయమున నందరను శ్యామసుందరుఁడు పాణి గ్రహణ మొనర్చెను. అందఱను నెడమప్రక్కను కూర్చుండఁ బెట్టుకొనెను. భార్యతోఁ గొంగులను ముడివైచుకొని జలమునఁ బ్రవేశించుటయును జేతులు చేతులు పట్టుకొని స్నానము చేయుటయును జేయించుటయును ధర్మ విరుద్ధము కాదు, పరమధర్మము భార్యయుండఁగాఁ గొంగులు ముడి వైచుకొని స్నానమొనర్పకుండిన పుణ్యాభాగులు కాఁజాలరు. మునులారా! ఇదియే మీలోని నీరసత. ఇది మీ దోషము కాదు. మీ కఠినతపముయొక్క దోషము. ఎట్టి సరస ప్రసంగము జరుగుచున్నది. మీరెట్టి రసభంగమగు ప్రశ్న వైచితిరి?"

శౌనకుఁడు శీఘ్రముగ నిట్లనెను:- ' కాదు, కాదు సూతా! మమ్ముల క్షమింపుము, మేమట్లే అడిగితిమి. కాని నీవు భగవానుఁడు గోపికలతో జలకేళి యెట్లు చేసెనో ఆ వర్ణనమును గావింపుము."

అన్యమనస్కభావముతో సూతుఁ డిట్లనెను :- "స్వామీ! ఇప్పుడేమి వర్ణింపఁగలను. పోయిన ప్రసంగము పోయినది. చిత్తవృత్తి సదా ఒక్కరకముగ నుండదు. నేనిప్పుడెట్టి సరస ప్రసంగమును జేయఁదలఁచితినో అది

సాధ్యమగునో, కాదో చెప్పలేను, అయినను జెప్పెదను. వినుఁడు,"

ఆ సమయమున నా యువతులు స్నానము చేయుటచే కృష్ణవర్ణయగు కాళింది పీతవర్ణయయ్యెను. కృష్ణుఁడా జలమందు స్నానమొనర్చి తృప్తినిఁ జెందలేదు. మాటిమాటికిని దన పీతాంబర మందా జలమును నింపి గోపికల పైనఁ జిలుకుచుండెను."

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! కృష్ణ వర్ణ యగు కాళిందీ కృష్ణుని పితాంబరముచేఁ బచ్చగనైనదా?"

విసుగుతో సూతుఁడిట్లనెను: "స్వామీ! మీరిఁక నాపుఁడు. ఇట్లు అరసికులవలెఁ బ్రశ్నలడుగకుఁడు. శ్రీకృష్ణుని పీతాంబరము రంగు గట్టిది. దానివలన జలము పసుపుగ నెట్లు కాఁగలవు. ఒకవేళ దానివలన గోపికలకు భావోద్దీపనము కలిగియుండవచ్చును. శ్రీకృష్ణుని శరీరమందుఁ బూయఁబడినదియును, యువతీమణుల వక్షః స్థలమునఁ బూయఁబడిన గుంకుమలేపము కావచ్చును, ఆ లేపము కృష్ణ జలమును బీతమొనర్చెను. కృష్ణుని పంచరంగుల వనమాలయును బచ్చగనైనది, భ్రమరము లిట్లనుకొనెను:- 'భగవానుని మాల యీ దివ్యమగు రంగులోఁ దడిసి పరమ రసమయమైనది.' ఒకటి పుష్పముల రసము,

రెండవది కుంకుమ గంధము. రెంటి నాఘ్రాణించి షట్పద ములు మత్తములయ్యెను. అవి యిట్లనుకొనెను:- "శ్రీకృష్ణుఁడు మనజాతివాఁడే, సమాన శీలము కలవాఁడు. ఆతఁడును రసప్రియుఁడే. మనమును రసమునే త్రాగుచుందుము. ఆతఁడును నల్లనివాఁడే, మనమును కృష్ణవర్ణము కలవారమే. ఆతఁడును గాన ప్రియుఁడే. మనమును గుణగాన ప్రియులమే. ఆతనికి వనవాస మనినఁ బ్రియము. మనమును వనములలోఁ దిరుగాడు వారమే. ఆతనికి వస్త్రములును బీతములే, మన ఱెక్కలును బీతములుగ నుండును. కావున నాతని ధనమును భోగించుటకు మనకును నధికారము కలదు. ఇట్లని యా మధుకరములెగిరి యా మాలలోని మధువును బానముచేయ నారంభించెను. నిర్భయములై దాని దివ్యగంధము నాఘ్రాణింప నారంభించెను." కృష్ణునిఁ జుట్టుకొని ఆతనికి గానమును వినిపించుచుండెను, గోపికల ఆనందమునకుఁ బరిధి లేదు. జల స్పర్శచేతనే ఆనందము కలుగును, బైగాఁ బ్రియుని స్పర్శ. వారు ప్రణయ కటాక్ష రూపమగు శరములఁ బ్రహార మొన ర్చుచుఁ గిలకిల నవ్వుచు నా వనప్రదేశమును శోభింపఁజేయు చుండెను. కాళిందీ తరంగ తాళములలోఁ గలిపి వారు గీతా గాన మొనర్చుచుండిరి. నలువైపులను నటనాగరునిఁ జుట్టు కొని, ఆతనిపైన జలమును జిలుకుచుండిరి. జలమును జిమ్ము టచే వనమాలిని వివశుని గావించుచుండిరి. ఊపిరాడకుండ

చేయుచుండిరి. వారి యులిపిరి వస్త్రములు నీటిలోఁ దడి యుటచే శరీరమున కంటుకొనిపోయెను. దాని వలన సువర్ణ కాంతివలెనుండు వారి అంగప్రత్యంగములు స్పష్టముగఁ గనఁ బడుచుండెను. వారు నిర్భయలై శ్యామునితోఁ గలిసికొందురు. ఆతనిఁ దీసికొనిపోయి నీటిలో మునుఁగుచుందురు' కృష్ణుఁడు వారినిఁ బైకి లేవనెత్తును. వారు తమ వివశతను వ్యక్తమొనరించెదరు. గజరాజు తన తొండముతో నీటినిఁ బీల్చి కరిణీ యూథములపైఁ జల్లినట్లును, వానితో జాలసేపు క్రీడించినట్లును, శ్రీకృష్ణుఁడు వారిమీఁద జలమును జిలుకుచు, వారిని సరసతాయుక్తముగ జలమున ముంచుచుఁ జిరకాలము వఱకు క్రీడించుచుండెను. భగవానుని క్రీడకు అన్య సామగ్రి అవుసరము లేదు. ఏలవనఁగా నాతఁ డాత్మరతి. ఆత్మక్రీడను గ్రీడించువాఁడు. గోపికలాతని స్వరూపములే తనయొక్క నానాస్వరూపములతో నానా భౌతిక ఖేలనము లాడుచుండెను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! జలక్రీడ నొనర్చిన తరువాత నొడ్డునకువచ్చి, యెండిన వస్త్రములను గట్టుకొని యువతీయూథములతోఁ గూడినవాఁడై, భ్రమరగానమును వినుచు శ్యామసుందరుఁడు యమునాతీరస్థములగు నుపవనములలోఁ జరించుచుండెను. గోపికలకు పుష్పశోభను జూపిం

చుచు వారి సర్వవిధముల సంతోషింపఁ జేయుచుండెను. ఒక్కొక్కప్పుడు లతాకుంజములలోఁ గూర్చుండి, వారికి బూలను గోసి స్వయముగ వాసన చూపించుచుండెను. ఒక్కొక్కప్పుడు వారితో మధురములగు సంభాషణల నొనర్చుచుండెను. ఈ విధముగ శ్యామసుందరుఁడు వారి ననేక విధముల నలరించుచుండెను. సర్వవిధముల వారికోర్కెలను దీర్చుచుండెను.''

—//—

# వనమాలి వనోపవనముల రాస యొనర్చుట

శ్లో॥ తతశ్చ కృష్ణోపవనే జలస్థల
ప్రసూన గంధానిల జుష్టదిక్తటే ।
చచార భృంగప్రమదాగణావృతో
యథా మదచ్యుద్ద్విరదః కరేణుభిః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౨౫ శ్లో॥

మ॥ యమునా కంకణచారియై వసజ పుష్పామోద సంచారియై
రమణీఘర్మనివారియై మదవతీ రాసశ్రమోత్తారియై
ప్రమదా మానస నవ్యభవ్యసుఖసంపత్కారియై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం గల్యాణభావంబునన్.

— శ్రీమదాంధ్రభాగవతము

శ్రీకృష్ణుఁడు నిత్యుఁడు. ఆతని ఆహ్లాదినీ మహాశక్తి నిత్య ఆతని సఖులు నిత్యలు. సఖీపరికరములు నిత్యలు. ఆతని ధామము నిత్యము. ఆతని నామము నిత్యము, ఆతని లీలలు నిత్యములు, ఆతని రాసవిలాసము నిత్యము. దానికి దేశ, కాల, కార్య కారణ భావ మక్కఱలేదు. ఆతత్త్వము సనాతన శాశ్వత సత్యము. శ్రీకృష్ణుని నామరూప, లీలాధామము లందు ప్రాకృత బుద్ధి కలుగునో, వారికి ప్రాకృత పదార్థ ప్రాప్తి కలుగును.

సూతుఁ డిట్లనెను.– "మునులారా! స్థలక్రీడ యైన తరువాత శ్రీకృష్ణుఁడు వ్రజాంగనలతోఁ జాలసేపటివఱకు జలక్రీడ నొనర్చెను. తదనంతరము వస్త్రములను ధరించిన తరువాత నా గోపికలకు వనోపవనశోభను జూపించుచుండెను. దివ్యబృందావన శోభ అవర్ణనీయము, వ్రజమండలమందలి ప్రత్యణువును దివ్యమైనది. అప్రాకృతమైనది. అచ్చటి వనము లన్నియుచు జిన్మయములును. బరమ రమ్యములును, రస

యుక్తములు నై యున్నవి. కాని యీ వనము లన్నిటిలో బృందావనము సర్వశ్రేష్ఠమైనది. గోలోకములో ముకుటాయమణియగు స్థానమే భూలోకమున కట్లే వచ్చెను' దాని నామరూపములకు భేదము లేదు. గోలోకమునఁ దన ప్రాణప్రియ యగు రాధికాదేవియు, గోపికా యూథములతోఁ గృష్ణుడు క్రీడించుచుండును. వారే వ్రజమందు ప్రకటమైరి. గోపికలు కృష్ణునకు సనాతన సహచారిణులు. వ్రజమండలమును, వనోపవనములును గో గోప గోపిక లెట్లు నిత్యములో అట్లే యీ రాసవిలాసమును నిత్యము లే."

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! రసభంగ మనకుండినచో మే మొక్కమాట నడిగెదము."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! అడుగుఁడు. రాసలీలా ప్రసంగ మిప్పుడు పూర్తియైనట్లే. స్థలక్రీడయును, జలక్రీడయును నిప్పుడైనవి. ఇప్పుడు మీరు నిర్భయులై ప్రశ్నింపవచ్చును."

శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! చాలసార్లు వ్రజమందలి వనోపవనములనుగూర్చి పలుకుచున్నావు. వ్రజములో నెన్ని వనములు ఉపవనములును గలవు? కృష్ణుఁ డచట నేయే క్రీడల నొనర్చెను?''

సూతుఁడిట్లనను:-"స్వామీ! మీ రతి గహనప్రశ్నను వైచితిరి. నేను విస్తారముగ నీప్రశ్నలకు సమాధానమొసంగుటకుఁ బూనినచో నది యెన్నటికిని బూర్తి కానేకాదు. ఏల ననఁగా వ్రజమండల మహిమ అనంతమైనది. పృథివియందు మాధురప్రదేశ ముండుటచే దాని మహిమ అధికమైనది. శాస్త్రకారులు వ్రజమండల సహస్రదళకమలముతోఁ బోల్చెదరు. వ్రజమండలమునఁ బంండ్రెండు వనములు కలవు. వాని పేర్లు భద్రవనము, శ్రీవనము, లోహవనము, భాండీరవనము, మహావనము. తాళవనము, ఖదిరవనము, వకుళవనము, కుముదవనము, కామ్యవనము, మధువనము, బృందావనము. ఈ విధముగ నివి పంండ్రెండు వనములు. వీనిలో నేడు యమునానదికి పశ్చిమతటమునఁ గలవు. అయిదు యమునా నదికి పూర్వతటమునఁ గలవు. ఇవి ఒకటికంటె నొకటి శ్రేష్ఠమైనవి. కాని మహావనము [గోకులము], మధువనము [మధురా], బృందావనము ఈ మూఁటియందు విశేషముగ లీలలు జరిగినవి, అందువలన వీని మహత్వము విశేషముగఁ జెప్పఁబడినది. ఈ పంండ్రెండు వనములుగాక చాల ఉపవనములు కలవు, అవి కదంబవనము, ఖండకవనము, నందవనము, నందీశ్వరవనము, నందనందన ఖండవనము, పలాశవనము, అశోకవనము, కేతకీవనము, సుగంధిమాదనవనము, కేళీవనము, అమృతభోజనస్థలము, సుఖప్రసాధన వనము,

సూతుఁడిట్లనెను:—"స్వామీ! మీరతి గహనప్రశ్నను వైచితిరి. నేను విస్తారముగ నీప్రశ్నలకు సమాధానమొసంగుటకుఁ బూనినచో నది యెన్నటికిని బూర్తి కానేకాదు. ఏల ననఁగా వ్రజమండల మహిమ అనంతమైనది. పృథివియందు మాధురప్రదేశ ముండుటచే దాని మహిమ అధికమైనది. శాస్త్రకారులు వ్రజమండల సహస్రదళకమలముతోఁ బోల్చెదరు. వ్రజమండలమునఁ బండ్రెండు వనములు కలవు. వాని పేర్లు భద్రవనము, శ్రీవనము, లోహవనము, భాండీరవనము, మహావనము. తాళవనము, ఖదిరవనము, వకుళవనము, కుముదవనము, కామ్యవనము, మధువనము, బృందావనము. ఈ విధముగ నివి పండ్రెండు వనములు. వీనిలో నేడు యమునానదికి పశ్చిమతటమునఁ గలవు. అయిదు యమునా నదికి పూర్వతటమునఁ గలవు. ఇవి ఒకటికంటె నొకటి శ్రేష్ఠమైనవి. కాని మహావనము [గోకులము], మధువనము [మధురా], బృందావనము ఈ మూఁటియందు విశేషముగ లీలలు జరిగినవి, అందువలన వీని మహత్త్వము విశేషముగఁ జెప్పఁబడినది. ఈ పండ్రెండు వనములుగాక చాల ఉపవనములు కలవు, అవి కదంబవనము, ఖండకవనము, నందవనము, నందీశ్వరవనము, నందనందన ఖండవనము, పలాశవనము, అశోకవనము, కేతకీవనము, సుగంధిమాదనవనము, కేలీవనము, అమృతభోజనస్థలము, సుఖప్రసాధన వనము,

డానివలె నుండును. ఈ జంట యెల్లప్పుడును రాస విలాసమున నుండును అనంత బ్రహ్మాండములు కలవు. ఆ బ్రహ్మాండము లన్నిటికి నేకైకాధీశ్వరుఁడు శ్రీకృష్ణుఁడు. బ్రహ్మాండములన్నిటిలో వేలువేలుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కలరు. వారు వారివారి కార్యములను జూచుకొందురు. బ్రహ్మాండములు జీవితము పూర్తి కాఁగానే మరల బ్రహ్మాండము లుత్పన్నములగును. మానవుఁడు తిరుగుచుఁ, గూర్చుండుచును, లేచుచు, సమస్తకార్యములొనర్చుచు శ్వాస ప్రశ్వాస లొనర్చు టెంత సులభమో, అంత సులభముగ నాతని శ్వాస ప్రశ్వాసలలో నగణిత బ్రహ్మాండములు త్రిమూర్తులు సహితముగఁ బుట్టి విలీనమగుచుందురు. తన రాసక్రీడలోఁ దాను నిమగ్నుడై యుండును. మురళీ ఆతని ఆకర్షణయంత్రము. దాని సహాయముననే ఆతఁడందఱను దనవైపున కాకర్షించును. ఆతని కస్త్రశస్త్రము లవసరము లేదు. కేవలము మురళిని వాయించుట కొకటియు, రాధికను దొడపైఁ గూర్చుండఁబెట్టుకొనుట కొకటియు, రెండు భుజము లుండినఁ జాలును. కావున బృందావన విహారి యగు కృష్ణునకు రెండుచేతులే యుండును. ఆతని రూపము త్రిభువన మోహనమైనది. ఆతని నిత్య పార్షదరూపమున నాతని సఖీ సఖు లాతని వెంట విహరించుచుందురు. అందు వలన నాతనికి విహారియను పేరు కలిగినది. ఆతఁడు గోపికల

కత్యంత ప్రియుఁడు. అందువలన నాతని గోపీజనవల్లభుఁ డందురు, రాధాదేవితో నిత్యము రమించుటచే నాతఁడు రాధారమణుఁడయ్యెను. ఆతని సఖులలో శ్రీదాము, వసుదాము, సుదాము, కింకిణీతోఁ కృష్ణులు ముఖ్యులు. ఇట్లు సఖులు వేలకొలఁదిగ గలరు. కొందరు గోపికలు వేదముల ఋక్కులు. కొందరు దేవతా కన్యకలు. కొందరు ఋషి రూపులు. కొందరు సాధనసిద్ధులు. వీరందఱిలో శ్రీరాధికా దేవియే సర్వప్రధానమైనది. ఈమెను రాసేశ్వరియందురు. మూల ప్రకృతిరూప, ఈమె కిష్టసఖులు కలరు, విశాఖ, శ్యామలా. శ్రీమతి, ధన్యా, శ్రీహరి, ప్రియ, శైబ్య, పద్మా, క్రమణికా ఇవి వారి నామములు. లలితా, చారు చంద్రలు, వీరందరికంటె ముఖ్యులు.

రాధిక యెట్లు మూలప్రకృతియో చంద్రావళియు నంతే. సఖులందరకును రాధిక యెడల స్వామినీభావము కలదు, కాని యీమె కామెయందు సాపత్న్యభావమే. ఈమె రాధకంటెఁ దక్కువయనుకొనదు. ఈమెకుఁ బ్రధాన సఖులు వేలుగా నున్నారు. వారి పేర్లు చిత్రరేఖా. చంద్రా, మద సుందరీ, ప్రియా, శ్రీమధుమతీ, హరిప్రియా, శ్రీమతీ, చంద్రావళితోఁగలిసి మెనిమది కలవు. వీరందఱ యూథమును గలదు. వీరందఱును. శ్రీకృష్ణునకు సుఖమును గలి

గించెదరు. శ్రీకృష్ణుఁడు వనప్రియుఁడు. వనోపవనములన్నిటిలో నాతఁడు గోపికలతో విహార మొనర్చును.''

ఈతని లీలలలో రెండు భేదములు కలవు. ఒకటి ప్రకటలీల, మరియొకటి అభ్యంతరలీల, ఇంకొక విధముగ గోష్ఠలీల, అంతఃపురలీల. గోష్ఠవనలీలలు ప్రకటములు, వీని లోనికి గోప, గోపీ, బాలక, యువక, వృద్ధులందఱకును ప్రవేశము కలదు. కాని అభ్యంతరలీలలోఁ గేవలము యువతీగోపికలకే ప్రవేశమున్నది. చిరకాలము ఈ రసమయ మగు సాధన యొనర్చినవారికే గోపీభావము ప్రాప్తించును. సాధారణులకీ భావమునఁ బ్రవేశము లేదు. శ్రీకృష్ణునకు గడ్డములు మీసములన్నఁ గోపము. కావున నీతనికెన్నటికిని గడ్డములు మీసములు రావు; ఈతని పరికరముల గోపికలకును ముఖమున గడ్డములును మీసములును రావు. ఈ లీలలను దర్శింపవలయునన్న ముందుగా గడ్డములను మీసములను దీసివేయవలెను,''

ఉలికిపడి శౌనకుఁడిట్లనెను:- ''సూతా! మా గడ్డములును మీసములును పెద్దపెద్దవి. దీనినిఁబట్టి మాకీ రసము ప్రాప్తించ లేదని తేలుచున్నది. మే మీ రాసవిలాసమును జూడఁజాలముగదా!''

నవ్వి సూతుఁడిట్లనెను:- ''స్వామీ! గడ్డములవారి కచ్చట ప్రవేశము లేనేలేదు.''

అప్పుడు శౌనకుఁ డిట్లనెను:- "సూతా! అయితే, అచ్చటికిఁ బోవుటకు గడ్డములను మీసములను దీసివేయ వలయునా?"

నవ్వుచు సూతుఁ డిట్లనెను:- "స్వామీ! గొఱిగించిన గడ్డములు పోవునా? ఎంత గొఱిగించినను మొలుచును. గుర్తుండును. ముఖమున నొక్కవెండ్రుక యున్నను జెవులను బట్టుకొని బయటకు నెట్టెదరు. కావున స్వామీ! కత్తితోఁ గీకించుట చాలదు. రాసమండలమునకు బయట నొక రస కుంకుము గలదు. దానిలో మునిఁగిన గడ్డములు మీసము లన్నియును విలీనములైపోవును. ముక్కులకుఁ జిల్లులేర్పడును వానిలో నత్తులు వ్రేలాడుచుండును, చేతులందు గాజులు గలగల మనును. జడలు వేణి యగుచు, మాడున సిందూర మేర్పడును. రూక్షవదనము నునుపగును, కురూప మంత యును బోయి, రతీదేవికి సమానమగు సుందర స్వరూపము కలుగును. అప్పుడా రాసమండలమునఁ బ్రవేశమున కధికార ముండును. ఇదంతయును గురురూపుఁడగు భగవానుని కృప చేతనే సంభవించును. రాస శరత్పూర్ణిమనాఁ డొక్క రోజు ననే జరుగదు. అది నిత్యనిరంతరము జరుగుచునే యుండును. ఎప్పుడు గోపీభావము ప్రాప్తించిన నప్పుడు దాని దర్శన మగును. శ్యామసుందరుఁడు తనకు సఖుఁడను గర్వము అర్జు

నున కుండెను. నా రథమును దోలుచుండును. నా కధీనుఁడు. నేనేది చేయుమనిన దానినిఁ జేయును. ఒకనాఁడు అర్జునుఁడు భగవానుఁడు గోపికలతో రాసక్రీడ నొనర్చెనని వినెను. ఒకదినమున నేకాంతమున నాతఁడు రాసనుగూర్చి ప్రశ్నించెను. మొదట భగవానుడు టలాయించెను. అర్జునుఁడు బలవంతమొనర్పఁగాఁ గృష్ణుఁ డిట్లనెను:- "బావా! నా వాక్యమును విను మిది యథార్థము, అచ్చట గాండీవధనుస్సు గాని, అక్షయతూణీరముగాని పనికిరాదు. ఆ దివ్యస్థానము శారీరకబలముచే లభించునది కాదు! అది కృపాసాధ్య లోకము. ఆ లోకమున కనురూపముగ నుండిననే వాని మీఁదఁ గృప కల్గును. అప్పుడే దానిలోఁ బ్రవేశింప వీలగును.

అర్జునుఁడు దీనతాస్వరమున నిట్లనెను:- "స్వామీ! అధికారమును బ్రాప్తింపఁజేయునది నీవే కదా! అధికారమును బ్రాప్తింపఁజేయుము, నా కా లీలను జూచు నధికారము నొసంగుము."

నవ్వి భగవానుఁ డిట్లనెను:- "అచ్చట నందెలు, కడియములు ధరింపవలసియుండును, బొట్టుకు బదులుగా ముఖమునఁ గుంకుమబొట్టు పెట్టుకొనవలెను. జడను వేసికొనవలెను. పాపిటలో సిందూరము నలఁదవలయును."

అర్జునుఁ డిట్లనెను:- "స్వామీ! నా కన్నియు నిష్టమే. మీ రెట్టి రూపమునైనను ధరింపఁజేయుఁడు. ఎట్టి వస్త్రాభూష ణములనైన ధరింపఁజేయుము, కాని ఆ దివ్యరాసను దర్శింపఁజేయుము."

సూతుఁడిట్లనెను:- "మునులారా! అర్జునుఁడు మిక్కిలి పట్టుబట్టగాఁ గృష్ణుఁ డాతని విశుద్ధగోపికగా నొనర్చి దివ్యాతి దివ్య రాసాస్వాదన మొనర్పఁజేసెను."

ఇది విని అత్యంతోత్సాహముతో శౌనకుఁడిట్లనెను:- "సూతా! భగవానుఁడు తన నిత్యలీలా దరన్శనము కుంతీ పుత్రుఁడగు నర్జునున కెట్లు చేయించెను? అర్జునుఁడు భగ వాను నెట్లు ప్రశ్నించెను? ఏమేమి చెప్పెను? భగవానుఁ డాతని గోపికగా నెట్లొనర్చెను? దయచేసి యీ ప్రసంగ మును విస్తారముగ మాకు జెప్పవలయును. దీనిని వినవలయు నని మాకు మిక్కిలి యుత్కంఠతగా నున్నది."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! ఆవిషయ మత్యంత రహస్యమైనది. మా గురువగు వేదవ్యాసుఁ డీ పరమ గోప నీయమగు విషయము నెవరికినిఁ జెప్పఁగూడదని నాచేత శపథము చేయించుకొనినాఁడు. మీ రింత బలవంత మొనర్ప కుండిన నేనీ విషయము నెత్తెడువాఁడనే కాదు. కాని మీ రధికారులు. ఈ విషయము తెలిసినవారు. సరసులు. కావున

నేను మీకుఁ జెప్పెదను. దీనిని విస్తార మొనర్చినచో నిది యెన్నటికిని సమాప్తము కాదు. ఏలననఁగాఁ బ్రపంచమున రాసవిలాసముగాక, కనఁబడు నదంతయును మిథ్యయే. అసత్యము, భ్రమ, దుఃఖము. రాసయే సత్యము. శివము. సుందరము. కావున నత్యంత సంక్షేపమున నీ విషయమును నేను జెప్పెదను. మీ రందఱును దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుఁడు. '

—॥—

# గోపికలతో నిత్యరాస విలాసము

౧౦౦౦

శ్లో॥ ఏవం శశాంకాంశు విరాజితా నిశాః
స సత్యకామోఽనురతాబలాగణః ।
సిషేవ ఆత్మన్యవిరుద్ధ సౌరతః
సర్వాః శరత్కావ్య కథారసాశ్రయాః ॥

శ్రీభాగ. ౧౦ స్కం. 33 అ. ౨౬ శ్లో.

వ. "ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడి రమించె."

శ్రీ మదాంధ్ర భాగవతము

దేవత కనురూపముగనే దేవతారాధన మొనర్ప వలెను. దేవత ననుసరించి రూపమును ధరింపవలయును. భూత, ప్రేత, పిశాచాదులను, అన్య తామస దేవతల నుపాసించుటకై శ్మశానాదులకుఁబోయి జాగృతి గావింపవలెను. తామసవస్తువులను సంగ్రహింపవలయును. దానికిఁ దగిన వేషమును ధరింపవలెను. ఇట్లే రాజస దేవతోపాసనకు రాజస వేషమును, సాత్త్విక దేవతోపాసనకు సాత్త్విక వేషమును ధరించి, భావాలంబనము గావింపవలెను. మన మెట్లు ధ్యానించిన నట్లగుదుము. ఇది సృష్టిసంకల్పముననే కలిగినది. జగత్తు భావమయము. భావము ననుసరించి ప్రభు వనుగ్రహించును. శాక్తులకు శక్తిరూపమున దర్శన మొసఁగును. శైవులకు శివరూపమునకు, వైష్ణవులకు విష్ణురూపమునను దర్శన మొసంగును, మధుర రసోపాసకులు ప్రపంచమున నొక కృష్ణునే పురుషునిఁగ భావించెదరు. జీవులందరును ప్రకృతి రూపలగుగోపీభావమును జెంది, పతిభావమునను పాసించెదరు వారి భావము గోపికలవలెనే అగును. శరీరము స్త్రీయైనను బురుషుఁడైనను ప్రయోజనమేమియును లేదు. లోపల గోపికాభావము లేక పైకి గోపికావేషము వైచిన నాతఁడు దాంభికుఁడు. మిథ్యాచారి, వేషమునకుఁ గళంక మాపాదించుచున్నాఁడు. గోపీభావము కలిగి, పైకి వేషము లేక జడలు, గడ్డములు మీసములు ధరించినను నాతఁడు నిరంత

రము రసాస్వాదన మొనరించుచుండును. వ్రజములలోఁ జాల మంది రసికులుండిరి. ఇప్పుడు నున్నారు. పైకి వారు విరక్తులుగ నుందురు. వారికి గోచి, బొంత, కమండులులే సంపత్తి. శరీరమంతటను వ్రజరజమును బూసికొని పిచ్చివాండ్రవలేఁ దిరుగుచుందురు. కాని మనస్సులోఁ దాము రాధికకు అనుచరులుగను, గింకరిగను సఖిగను భావించుకొందురు.

ఒక్కొక్కప్పుడు మనోభావనానుసారముగ శరీరమును నట్లే యగును. వ్రజమున నొక ప్రసిద్ధమగు కథ గలదు. ఒక సాధువు విశుద్ధ గోపీవేషమును ధరించి బృందావనము గొందులలోఁ దిరుగుచుండెను. ఒకానొక విదేశీయ యాత్రికుఁడు వచ్చెను. పురుషుడు స్త్రీ వేషమున నుండుటను గాంచి ఆశ్చర్యము పడెను. ఆతని కిది క్రొత్త. కుదూహలవశమున నాతఁ డాతని నిట్లు ప్రశ్నించెను:- "పురుషుడవై నీవీ స్త్రీ వేషము నేల ధరించితివి ?"

సాధు విట్లనెను:- "నా ప్రియతముని సంతోష పెట్టుటకై,"

విదేశీయుఁ డిట్లనను:- "కాని నీవు పురుషుఁడవు. పురుషరూపమునఁ బుట్టితివి. స్త్రీ వేషమును ధరించుటచే నేమి లాభము ?"

సాధు విట్లనెను:- "ప్రాణి యెట్లు పుట్టెనో అట్లుండఁడు. భావనానుసారముగ నాతని వేషము, రూపము, రంగు మొదలగునవన్నియును మాఱిపోవును. పుట్టఁగనే బాలకుఁడుగ నుందుము. తర్వాత మారి యువకుఁడయ్యెను. పుట్టినపుడు పండ్లు, గడ్డములు, మీసములు లేవు. పెద్దవారమైన తరువాత వచ్చినవి. పుట్టినపుడు మొండిమొలలతోఁ బుట్టితిమి. తర్వాత వస్త్రములను ధరించితిమి, మా భావన మధురభావన. తదనురూపముగ వేషమును ధరించితిని.' మానవుఁడు తన భావనానుసారముగనే వేషమును ధరించును.

విదేశీయుఁ డిట్లనెను:- 'ఇది యంతయును సత్యమే. కాని లంగా ధరించుటచేతను, పైఁట, నత్తు, గాజులు, సొమ్ములు షోడశశృంగారములు ధరించుటచేతఁ బురుషుఁడు స్త్రీ కాఁజాలఁడు. స్త్రీపురుషులకు స్వాభావిక చిహ్నములు వేఱువేఱుగ నుండును. అది మారిననే నిజమైన భావమగును."

సాధు విట్లనెను:- "దృఢధారణచే నవియును మాఱిపోవును."

విదేశీయుఁ డిట్లనెను:- '-నీకు మాఱినవా ?"

సాధు విట్లనెను:- "ప్రత్యక్షమునకుఁ బ్రమాణ మెందు లకు ? పరీక్షించుము. ఆతని స్నేహితుఁడు శారీరక శాస్త్రజ్ఞుఁ డొకఁడుండెను. ఆతఁడు విధ్యుక్తముగఁ బరీక్షించెను. సాధు వుని శరీరమున నంతటను స్త్రీయోచిత చిహ్నము లుండు టను గాంచి పరమ విస్మితులైరి. సారాంశ మేమనఁగా దృఢ భావన ననుసరించి శరీరమును బరివర్తన గాంచును, చాల మంది పూర్వజన్మమునఁ బురుషులు స్త్రీలగుదురు, స్త్రీలు పురుషులగుదురు. సాధారణ నియమము స్త్రీ స్త్రీగనే పుట్టును. పురుషుఁడు పురుషుఁడుగనే పుట్టును. కాని దృఢభావనచే విపర్యయమును గాఁగలదు. అందువలన శాస్త్రకారులు భావమే భవమునకుఁ గారణమని చెప్పుదురు."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! మీరు నన్ను శ్రీకృష్ణుని రాసరహస్యమును గూర్చియు, అర్జునుని గోపీ భావమును గూర్చియు నడిగితిరి. దానిని సంక్షేపముగఁ జెప్పెదను వినుఁడు."

ఒకదినమున శ్యామసుందరునితోఁ గలిసి అర్జునుఁడు కూర్చుండెను. ఇద్దరు నానందముగఁ బ్రేమనుగూర్చి మధుర ముగ మాటలాడుకొనుచుండిరి. శ్యామసుందరుఁడు తన కను కూలుఁడుగను, బ్రసన్నుఁడుగను నుండుటను గాంచి కుంతీ నందనుఁ డర్జునుఁ డిట్లనెను:- "ప్రభూ! వ్రజమున గోపిక

లతో నీవు రాస చేసితివని వినియున్నాను. రాస యనఁగా నేమి? ఏవిధముగ నెవరెవరితో నేయే వనములలో నెప్పు డెప్పుడు రాస చేసెను. రాసకు సంబంధించిన సమస్తవిషయ ములను నీవు నాకు జెప్పవలయును.''

భగవానుఁడు మాటను దప్పించుచు నిట్లనెను :- ''అవన్నియును నేవో మాటలు. నీవీ విషయములను దెలిసి కొని యేమి చేసెదవు? ఇంకొకవిషయము నెత్తుము.''

అత్యంత అధీరుఁడై దీనతాస్వరమున నర్జునుఁ డిట్లడి గెను:- ''దీనదయాళూ! దీనానాథ! ఈ దీనహీనునిపై దయ యుంచుము. రాసవిలాస సంబంధమునఁ దెలిసికొనుటకు నా కభిలాష కలదు. నాయీ కోరికను దీర్చుము.''

భగవానుఁడు ప్రేమతో నిట్లనెను - ''ప్రపంచములో నెన్నో గూఢవిషయములు గలవు. వానినిఁ దెలిసికొనుము. యోగము, సాంఖ్యము, వేదాంతము, కర్మకాండ ఇంక నెన్నియో విద్యలు గలవు. వాని రహస్యము నడుగుము. ఈ రసవిషయ మత్యంత గుప్తమైనది. ఇంతయేల విరించి యైన విన నధికారికాఁడు.''

అర్జునుఁడు ఆతురతతో నిట్లనెను:- ''నేను నీ భక్తుఁ డను. అనురక్తుఁడను. శిష్యుఁడను, సేవకుఁడను. నీ రహ స్యము నవశ్యము చెప్పవలయును.''

భగవానుఁడిట్లనెను:- "నీవు తెలిసికొనఁదలఁచినచో నిది చెప్పఁదగినది కాదు. నేను నీకు ప్రత్యక్షముగఁ జూపించెదను. దీనినిఁ గాంచు నధికారమును సంపాదించుటకై నీవు త్రిపురసుందరీ ఉపాసన చేయవలెను. తద్రసానురూపముగ నీకు రూపము ప్రాప్తించినచో నీవా రాసను దర్శింపఁగలవు. నీవు ముందు త్రిపురసుందరీ ఉపాసనను జేయుము."

భగవదాజ్ఞచే నర్జునుఁడు త్రిపురసుందరీ ఉపాసన మొనర్చెను. అల్పకాలముననకే దేవి ప్రసన్నయయ్యెను. ప్రత్యక్షమై అర్జునుని వరమునడుగుమనెను. విధ్యుక్తముగఁ బూజించి రాసను గాంచుటకు యోగ్యతను బ్రసాదింపుమని అర్జునుఁడు ప్రార్థించెను. దేవి ఆతనికి మంత్రదీక్ష నొసంగి ఒక దివ్యసరోవరమున స్నానము చేయుమనెను. స్నానము చేయఁగానే అర్జునుఁడు స్త్రీయయ్యెను. ఆతని రూపలావణ్యము అనుపముగను, అవర్ణనీయముగ నుండెను. దానినిఁ బ్రాకృత భాషలో వర్ణించుట అసంభవము. అర్జునుఁడు తన రూపమును గాంచి పరమ విస్మితుఁడయ్యెను. సరోవరమున మునుఁగుమనినఁ త్రిపురసుందరి అంతర్ధానమయ్యెను. అర్జున అయిన నర్జునుఁడు తలవంచుకొని అచ్చటనే నిలుచుండెను. తానేమిచేయవలయునో తెలియకుండెను. ఆ సమయమున నాతనికి ఆకాశవాణి యిట్లు పలికెను: 'గోపీ! నీవు చింతింపకుము. ఈ మార్గమునఁబోయి, యెదురుగా నుండిన

సరోవరమున స్నానమొనర్పుము. అచ్చట నీ సహచారిణులు కలరు.' ఇది వినఁగానే అర్జునాదేవి ఆ సరోవర సమీపము నకుఁ బోయెను. ఆ సరోవరమున నాతఁడు స్నానాచమనము లొనర్పఁగనే, దానిలోనుండి అద్భుత రూపలావణ్య యుక్త లగు నసంఖ్యాకలగు సుందరీమణులు తమ నూపుర ఝుంకా రములతో దశదిశలను ఝుంకృతము లొనర్చుచు నచ్చటికి వచ్చిరి. సరోవరము తీరమున లజ్జావనత శిరస్కయై, చింతతో నిలుచుండిన నపరిచిత లలనామణినిఁ గాంచి, యా సఖులలోఁ బ్రియముదాయను నొకసఖి మధుర వాక్కులతో నిట్లనెను:- 'సుందరీ! నీ వెవతెవు? ఎవరి కుమార్తెవు. ఎవని పత్నివి? నీ వింత చింతతో నుంటివేల? చింతాకారణమును మాకుఁ జెప్పుము.'

అంత నర్జునాదేవి యిట్లనెను:- 'అక్కా! నే నెవరి పుత్రినో, ఎవరి పత్నినో నాకు దెలియదు. ఈ సరోవరమున స్నానమొనర్చుటచే నొక రూపము ప్రాప్తించినది. ఇచ్చట నొక దేవి నన్నుఁ గుఁగును. నేను మీ అందఱ పరిచయమును నడుగవచ్చునా?'

అంతఁ బ్రియముదాదేవి యిట్లనెను:- 'మేము వ్రజ వల్లభుని రమణులము. మాలోఁ గొందఱు శ్రుతిరూపలు, కొందఱు ఋషిరూపలు, కొందఱము భగవంతుని శరీరము

నుండి వెలువడిన నిత్యపరికరములము. కోటిజన్మముల పుణ్య విశేషమునఁ బ్రాణవల్లభునిఁగఁ గృష్ణునిఁ బొందిన నాభీర కన్యలము. నీవును రాసవిహారుని కృపచేతనే యీరూపమును బొందితివి ప్రథమ మంత్రప్రభావముచే నీకు మా సాక్షాత్కార మైనది. నీ వీ సరోవరమున స్నానమొనర్చినచో సిద్ధిమంత్ర దీక్ష నొసంగెదము. దానివలన నీకు సమస్త సిద్ధులును గలిగి, మాతో రాసవిహార మొనర్చు నధికారిణి వగుదువు.''

అర్జునాదేవి ఆమె ఆజ్ఞ ననుసరించి స్నానము చేసి విధ్యుక్తముగ దీక్ష తీసికొని మంత్రజప మొనర్పఁగా నా ప్రభావమున నామెకు రాసేశ్వరియగు రాధికా దర్శన మయ్యెను. రాధికాదర్శనము కాఁగానే ఆమె మూర్ఛిత యయ్యెను. అప్పుడు రాధ ప్రియంవదయను నొక సఖిద్వారా ఆమెను దన సమీపమునకుఁ బిలిపించి ఆమెచేత మోహినీ మంత్రదీక్ష నిప్పించెను. ఆ మంత్రప్రభావముచే నామె మోహనుని మనస్సును మోహితమొనర్చు శక్తి కలుగును. అర్జునాదేవి యథావిధిగ నా మంత్రమును జపించఁగా రాస రసికేశ్వరుఁడు నూతనసఖిని రాధిక ద్వారా తన సమీపమునకు బిలిపించెను. రాధయొక్క ఆజ్ఞచే అర్జునాదేవిని నందనందనుని సమీపమునకు దీసికొని వచ్చిరి. భగవానుని రూప

లావణ్యమును గాంచి అర్జునాదేవి మూర్ఛితయై భూమి మీఁదఁ బడెను, కొంచెముసేపటి కామె మూర్ఛ తెలియఁగానే సమ్ముఖమున నతిదివ్యమగు కల్పవృక్షమును గాంచెను. దానిక్రింద నమూల్య దివ్యరత్నములచే నిర్మింపఁబడిన నత్యంత సుందరమగు మందిర మొకటి యుండెను. దానికి నలువైపులను నుద్యానవనములు గలవు. వానినుండి మనస్సును లోభింపఁజేయు దివ్యాతిదివ్యగంధము వచ్చుచుండెను. వానిలో ఖగ, మృగ, మర్కట, మయూరాది దివ్యసత్త్వములు విహరించుచుండెను. ఆ యనుపమభక్తిలో రాధికతోఁ గృష్ణుఁడు రాజిల్లుచుండెను. అచ్చట రాగభోగములకు సంబంధించిన సమస్త దివ్యసామగ్రులు యథాస్థానమున నుంచఁబడెను. సఖులందఱును దమతమ సేవలలో సంలగ్నలై యుండిరి. రాధికాదేవి శ్యామసుందరునకు సఖియొక్క పరిచయమును గావించెను, శ్యామసుందరుఁ డనురాగభరితదృష్టులతో నర్జునాదేవివైపు గాంచెను. భగవానుని దృష్టి పడఁగనే ఆమె భావము మారిపోయెను, భగవానుఁ డామెతో రాసవిలాసమును, వివిధక్రీడల నొనర్చెను. రసికశేఖరునితోఁ గ్రీడించుటచే నర్జునాదేవికి కొంచెము శ్రమ తోఁచెను. అప్పుడు శ్యామసుందరుఁడు శారదాసఖినిఁ బిలిచి యిట్లనెను:- 'ఈ సఖిని సమీపముననున్న సరోవర సలిలము

లోను స్నానము జేయించుము. దానివలన నామె శ్రమ పోఁగలదు."

ఆజ్ఞ ననుసరించి శారదాదేవి అర్జునాదేవి నా సరోవర సమీపమునకుఁ గొనిపోయెను. దానిలో నామె స్నాన మొనర్పఁగానే అర్జునాదేవి అర్జునుఁడయ్యెను. ఆతఁ డటు నిటు జూచునప్పటికి మందహాసమొనర్చు మాధవుఁడు కనఁ బడెను. మదనమోహనుఁడగు మాధవునిఁ జూడఁగానే అర్జు నుఁడు లజ్జించెను. అప్పుడాతని చేతినిఁ బట్టుకొనుచు నవ్వి శ్యామసుందరుఁ డిట్లనెను:- 'అర్జునా! నీవు నా రాసేశ్వర రూపమును గాంచితివి. చాల ఆనందమైనది. ఈ నా లీల చాల గుప్తమైనది. పరమ రహస్యమయమైనది. దీని నెవరి తోడను జెప్పఁగూడదు. నీకు నామీఁద నొట్టు పెట్టు చున్నాను."

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీవు అర్జునుని గూర్చి చెప్పిన కథవంటి కథనే, నారదుఁ డొకనాఁడు మా కడకు వచ్చి తన విషయమునుగూర్చి చెప్పినాఁడు."

సూతుఁ డిట్లడిగెను:- "నారదుఁ డేమి చెప్పినాఁడు? స్వామీ! దయతో దానినిఁగూడ మాకు చెప్పుఁడు."

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! నీవు చెప్పినట్లు సరస ముగానేను చెప్పఁజాలను. సంక్షేపముగఁ జెప్పెదను. ఒక

దినమున దయతో నారదమహర్షి మా సత్రయాగమునకు విచ్చేసెను. మే మొసంగిన నర్ఘ్యపాద్య గంధ ఫల పత్ర పుష్పాదులను స్వీకరించిన తరువాత స్వస్థముగఁ గూర్చుండిన తరువాత మేము తమ రెచ్చటినుండి విజయ మొనర్చుచున్నా రని యడిగితిమి,''

నారదుఁ డిట్లనెను:- మునులారా! ఈ సమయమున నేను గోలోకమునుండి వచ్చుచున్నాను;''

మేము మిక్కిలి యుత్సాహముతో నిట్లంటిమి:- ''స్వామీ! గోలోకము సంబంధమును గూర్చి వినవలయు నను కోరిక మిక్కిలిగ నున్నది. మేము వినుటకుఁ దగినవార మని తోఁచినచో మా కా వృత్తాంతమును జెప్పుఁడు. అచ్చట నిత్య బృందావనము కలదనియు, భగవానుఁ డచ్చట దన సఖులతో సదా రాసవిలాస మొనర్చుననియు విని యుంటిమి.''

ఇది విని వీణాపాణియగు నారదుఁ డిట్లనెను;- ''మును లారా! మీరు మిక్కిలి రహస్యమయమగు ప్రశ్నము నడిగి తిరి. ఇది అందఱముందు చెప్ప వీలుపడనిదైనను మీ రంద ఱును గథాసక్తులును, భగవద్భక్తులును, కృతోపాసకులు నగుటచే మీకుఁ జెప్పెదను, నాకు మధురా కృష్ణుఁడు, ద్వారకా కృష్ణుని లీలలవిషయమే తెలియును. బృందావన,

గోకుల గోష్ఠలీలలు కూడ తెలియును. కాని రాసేశ్వరుని రహస్యమయ నికుంజలీలలు తెలియవు. అందువలన నాకు దండ్రియును లోకపితామహుఁడు నగు బ్రహ్మను నీ విషయమును గూర్చి ప్రశ్నించితిని. నా ప్రశ్నను విని వేదగర్భుఁడును, గమలాసనుఁడగు విరించి నాతో నిట్లనెను:- "వత్సా! శ్రీ రాధాకృష్ణుల బృందావనలీల లత్యంత గోపనీయములు. వాని రహస్యము నాకును దెలియదు, నీవు మహావిష్ణువుకడకు బొమ్ము. బహుశః ఆతఁడు చెప్పఁగలఁడేమో!"

నే నిట్లంటిని:- స్వామీ! నేను ఒంటరిగాఁ బోవుటకు జంకుచున్నాను. మీరును నా వెంట రండు."

నా మాట ననుసరించి మా తండ్రియగు బ్రహ్మ నన్ను వెంటఁబెట్టుకొని మహావిష్ణువు సమీపమునకు వైకుంఠమునకుఁ బోయెను.

వైకుంఠమునకుఁ బోయిన తరువాతఁ దండ్రి కొడుకుల మిద్దరమును మహావిష్ణువునకు నమస్కరించితిమి అంత మా తండ్రి నా ప్రస్తావమును మహావిష్ణువునకు విన్నవించెను. బ్రహ్మ వాక్యములను విని నవ్వుచు వైకుంఠాధిపతి యిట్లనెను:- 'వేదగర్భా! నీవు నా యాజ్ఞ ననుసరించి నారదునిఁ గొనిపోయి యీ యమృతకుండమున స్నానము చేయించుము.'

ఇది విని బ్రహ్మా నన్నమృతకుండమునకుఁ గొనిపో యెను. నేను దానిలో మునిఁగి లేవఁగనే స్త్రీగనైతిని. అత్యంత రూపలావణ్యయుక్తయగు రమణిగ నైతిని. ఇప్పు డచ్చట వైకుంఠమును లేదు, మా తండ్రియును లేఁడు, మహావిష్ణువును లేఁడు. నూపురాది శబ్దములచే నాకాశమండలము నంతను బ్రతిధ్వనింప జేయుచు బరమలావణ్యాయుక్తలగు నవయౌవన లగు నారీమణు లనేకు లచ్చటికి వచ్చిరి. రాఁగానే వారు నన్నుఁగూర్చి అడిగిరి నేను నన్నుఁగూర్చి యేమని చెప్పఁ గలను ? నా కన్నియును జ్ఞాపకమున్నవి. నేను నారదుఁడ నని నాకు దెలియును. ఇప్పుడు స్త్రీనగుటచే నాకు సిగ్గు వేయుచుండెను. అయితే లోలోన నొక విచిత్రమగు నానంద మును గలుగుచుండెను. నే నిట్లంటిని:- 'నేను వీనిని స్వప్న ముగ భావించుచున్నాను. నే నే లోకమున నున్నానో నాకుఁ దెలియుట లేదు.''

ఇది విని యొక సఖి మందహాస మొనర్చుచునిట్లనెను:- 'ఇది ప్రకృతికిబరమైన దివ్యగోలోకము. నీవున్నది దానిలోఁ బరమ రహస్యమయ ప్రదేశము శ్రీ బృందావనము. మేము శ్రీకృష్ణుని బ్రియ సఖులము. నన్ను లలితాదేవి యందురు. నేను రాధికకు ప్రియ కింకరిని. నీవు నా వెంట రమ్ము.'

నేను మంత్రముగ్ధునివలె లలితాదేవితో వెడలి పోయి తిని. ఆ సఖిగణమంతయును వెనువెంటవచ్చిరి. ముందునకుఁ

బోయిన తరువాత నొక స్థానము లలితాదేవి విధ్యుక్తముగ
స్నానాదులను గావింపఁజేసి బదునాల్గక్షరములు కల భగవ
న్మంత్రము నొసంగిరి. ఆ మంత్రానుష్ఠానముచే నేనును వారి
వలె నైతిని. నా హృదయమునఁ బ్రేమ తరంగము లుబుకు
చుండెను. మనస్సెవరినో కలిసికొనుట కువ్విళ్లూరుచుండెను.
ఆ సమయమున మాకు రాధాకృష్ణుల దర్శనమయ్యెను. భగ
వానుఁడు స్నేహ భరిత హృదయముతో నిట్లనెను:–'నారదా
దేవీ! రమ్ము, రమ్ము, రమ్ము.' ఇట్లని భగవానుఁడు నాకా
లింగన ప్రదానము కావించెను. ఒక సంవత్సరము వఱకును
ఆతఁడు నాతోఁ గేళీ క్రీడల నొనర్చెను. భగవానునితోఁ
గ్రీడించుటవలన నెంత యానందమో, అది వర్ణనాతీతమైనది.
దానికి హద్దు లేదు, అవధి లేదు. ఇంతని లేదు. చివరకు భగ
వానుఁడు రాధాదేవితో నిట్లనెను:– 'ఈ నారదరూపిణియగు
ప్రకృతితో నీ సరస్సులో స్నానమును జేయుమని చెప్పుము'
శ్రీ రాధికాదేవి మాకట్లే యాజ్ఞాపించినది. భగవానుఁడును
విహారానంతరము మాతో నా మాటను జెప్పెను.'

భగవానుఁ డిట్లనెను:– 'నే నే కృష్ణుఁడను. నన్ను
వాసుదేవుఁడనియు నందురు. నేనే కామకళను. నేనే పురు
షుఁడను. నేనే స్త్రీని, సనాతనయగు స్త్రీని నేనే. నాకును
నా ప్రియులకును భేదమెంచిన చో వారికి నాజ్ఞానమసంభవము.
నీకును నాకనుగూడ భేదభావము లేదు. మా యీ యభేద

సంకేతము నెవరు. తెలిసికొనుచున్నారో వారు లలిత వలెఁ బ్రియులగుదురు.' ఈ విధముగ భగవానుఁ డుపదేశించి అమృత సరస్సున స్నానమొనరింపఁ జేయుట కాజ్ఞాపించెను. కృపామయయగు రాధికాదేవి మమ్ము అమృత సరస్సునకుఁ గొనిపోయెను. నేను బోయి దానిలో మునిఁగి లేచునప్పటికి నేను యథాప్రకారముగ నారదుఁడనైతిని. వీణ నా చేతి లోనికి వచ్చెను. దానితో రామకృష్ణహరే జయజయ రామ కృష్ణ హరే' అని పాడుకొనుచుంటిని. ఎదుట మా తండ్రి యగు బ్రహ్మయును, మ[illegible]విష్ణువును గనఁబడిరి. గోవులును గనఁబడెను. అందఱ[illegible]ను నమస్కార మొనర్చి నేను దిరుగుచు నైమిశారణ్యమునకు వచ్చితిని. శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! అర్జునుఁ డర్జునాదేవి యెట్లయ్యెనో నారదుఁడు నారదాదేవి యట్లయ్యెను.'

సూతుఁడిట్లనెను:- 'స్వామీ! మీకు రహస్యము లన్నియును దెలియును. నారదుఁడన నేల? మధుర భావోపాసన మొనర్చు వారందఱును గోపికలు కావలసినదే. గోపిక కాక రాస విలాసమును దర్శింప వీలులేదు. మధుర భావమునందీ ప్రపంచ మిప్పుడున్నట్లు కనఁబడదు. కేవలము మధురమే కనఁబడును. అంతయును శ్రీకృష్ణమయముగఁ దోఁచును. నిరంతరము నందకిశోర రాసరసికేశ్వరునిలీలలే భావజగత్తునఁ గోచరించును. ఉపాసకుఁడు దానిలో మునిఁగిపోవును. శ్రీకృష్ణ

విహారము నిత్యము. ఆతని సఖులయొక్క రూప, యౌవన, సౌందర్య సౌకుమార్యములు సదా ఒక్కటిగనే యుండును. దానిలో హ్రాసముండదు. ప్రతిక్షణ వర్ధమానముగ నుండును. ఈ భావములన్నియు జగత్తునకు సంబంధించినవి. కన్నులు పెద్దకన్నులను గాంచి ఆనందమును జెందినట్లు, మధుర రాస యందు శ్రీకృష్ణ సంగమ సుఖచింతన మొనర్చుటచే నాహ్లాదము కలుగును. దివ్యాతిదివ్య అలౌకిక రసమునందు ప్రవేశించినవారు రాత్రింబవళ్లు భగవచ్చర్యా చింతనమందే యుందురు. ఇప్పుడు రాధికతో శ్యామసుందరుఁ డిది చేసినాఁడు, అది చేసినాఁడని తలఁచుచు నా భావములలో భావితుఁడగుటచే సాంసారిక విషయ విషయములు మఱచి పోవుదురు, వారి దృష్టిలోఁ బ్రపంచమే యుండదు.'

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! భగవ ల్లీలల నెట్లు చింతింపవలయును? భగవానుఁడు ప్రాతః కాలమునుండి రాత్రివఱ కేమేమి కార్యము లొనర్చుచుం డును. ఆతని దైనందిన చర్య తెలిసినఁగాని జింతించుట జరుగదు.'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! అష్టయామసేవ చాల గహనమైనది, దానిని సర్వసాధారణులయెదుట చెప్పరాదు. దానిని గురువువలననే బొందవలయును. అయినను నేను

మీకు దెలియుటకై భగవానుని దినచర్యను సంక్షేపముగఁ జెప్పెదను.

దివ్య బృందావనమందు దివ్య కల్పవృక్షముయొక్క దివ్యాతిదివ్య పరమరమ్య సఘనచ్ఛాయయందు భగవానుని కేళీకుంజము కలదు. ఆ వనమున కంతయును నధిష్ఠాత్రి దేవి బృందాదేవి. ఆమె పేరువలననే యీవనమునకు బృందావన మను పేరు వచ్చినది. రాధాకృష్ణులయొక్క సమస్త సాంసారిక లీలల నీ బృందాదేవియే ధరించును. ఆమె అచ్చట ప్రధానమగు వ్యవస్థాపిక. రాధాకృష్ణుల కింకొక కార్య ముండదు. అచ్చటికి ఆర్త, జిజ్ఞాస, అర్థార్థి, జ్ఞానులకు ప్రవేశముండదు. ఈ త్రిప్పలన్నియును మహావిష్ణువునకే. జీవితమున శ్రీకృష్ణునకు సుఖమునుగలిగించు లక్ష్యమొక్కటియే కల గోపికలు మాత్రమే దానిలోఁ బ్రవేశింప వీలగును: శ్రీకృష్ణున కబల లేమి సుఖమును గలిగింపఁగలరని అన బోకుఁడు. ఆ అబలలు ఆతని కన్యలుకారు, ఆత్మరూపులే, తన యాత్మయందు దాను రతిసలుపుటనే దాని కాత్మరతి, ఆత్మక్రీడ యందురు. బృందాదేవి అప్పుడప్పుడు లీలలకు వ్యవస్థ నొనరించును. రాధతోఁ బ్రియతముఁడు సుఖముగ శయనించును. ప్రాతఃకాలమున బృందాదేవియొక్క ఆజ్ఞచే దివ్యపక్షి తన మధురాతిమధురమగు వాణితో నిద్దరను మేల్కొలుపును. కాని మధురస్వప్నమున నొకరి వస్త్రముల

నింకొకరు కప్పుకొనుచు లేపినను లేవక ఆనందములో మునిఁగియుందురు. మాటిమాటికి నావలించి, మరల నిద్రింతురు. కన్నులను దెఱచి మరల మూసికొందురు.

అప్పుడు బృందాదేవి తాను శిక్షణనిచ్చిన శుక శారికాది మధురకూజితము లొనర్చు పక్షులను నికుంజములకుఁ బంపును. అప్పు డిద్దరకును మెలకువ వచ్చును. ఇద్దరును నింటివద్దనుండి యేదో నెపమున నికుంజములకు వచ్చి నిద్రించిరి. లేవఁగనే యిద్దరికిని తల్లుల భయమేర్పడును. అందువలన శయ్యనుండి లేవఁగానే భుజములమీఁద జేతులువైచుకొని బయటకు వచ్చెదరు. అచ్చట తలులు తమ బిడ్డలు శయ్యలందు బరుండియుందురని తలఁచుచుండి వారికడకు బోనేపోవరు. ఇద్దరును జీఁకటిలో నెవ్వరును జూడకుండునట్లు పోయి మెల్లఁగా దమతమ శయ్యలందు బండుకొందురు. సూర్యోదయ మగువేళ యశోదమ్మ యిట్లనును:- 'ఓరీ! కృష్ణా! రోజంతయును నిద్రపోయెదవటరా? చూడు, నీతోడివార లందఱును లేచి కాలకృత్యములు తీర్చుకొని, స్నానమాడి, చలిది నారగించి బొట్టుపెట్టుకొని వచ్చినారు, నీవో యింకను నిద్రించుచున్నావు.' ఇచ్చట కీర్తి దేవి తనకుమార్తె రాధను లేపును. 'అమ్మా! రాధా! నీవు సోమరిపోతువైనావే. నీ చెలికత్తెలు యమునా స్నానమును జేసివచ్చిరి. నీవు ముసుఁగుగప్పుకొని యింకను నిద్రించుచున్నావు. ఇలాగా

నింకొకరు కప్పుకొనుచు లేపినను లేవక ఆనందములో మునిఁగియుందురు. మాటిమాటికి నావలించి, మరల నిద్రించెదరు. కన్నులను దెఱచి మరల మూసికొందురు.

అప్పుడు బృందాదేవి తాను శిక్షణనిచ్చిన శుక శారికాది మధురకూజితము లొనర్చు పక్షులను నికుంజములకుఁ బంపును. అప్పు డిద్దరకును మెలకువ వచ్చును. ఇద్దరును నింటివద్దనుండి యేదో నెపమున నికుంజములకు వచ్చి నిద్రించిరి. లేవఁగనే యిద్దరికిని తల్లుల భయమేర్పడును. అందువలన శయ్యనుండి లేవఁగానే భుజములమీఁద జేతులువైచుకొని బయటకు వచ్చెదరు. అచ్చట తలులు తమ బిడ్డలు శయ్యలందు బరుండియుందురని తలఁచుచుండి వారికడకు బోనేపోవరు. ఇద్దరును జీఁకటిలో నెవ్వరును జూడకుండునట్లు పోయి మెల్లఁగా దమతమ శయ్యలందు బండుకొందురు. సూర్యోదయ మగువేళ యశోదమ్మ యిట్లనును:- 'ఓరీ! కృష్ణా! రోజంతయును నిద్రపోయెదవటరా? చూడు, నీతోడి వార లందఱును లేచి కాలకృత్యములు తీర్చుకొని, స్నానమాడి, చలిది నారగించి బొట్టుపెట్టుకొని వచ్చినారు, నీవో యింకను నిద్రించుచున్నావు.' ఇచ్చట కీర్తి దేవి తనకుమార్తె రాధను లేపును. 'అమ్మా! రాధా! నీవు సోమరిపోతువైనావే. నీ చెలికత్తెలు యమునా స్నానమును జేసివచ్చిరి. నీవు ముసుఁగుగప్పుకొని యింకను నిద్రించుచున్నావు. ఇలాగా

బిందువుల నటించెదరు. కపోలముల దు బ్రాతాదులను రచించెదరు. విశాలనేత్రములఁ గాటుకను బెట్టెదరు. దివ్యగంధ యుక్తమై ఏలకులు, కర్పూరము, లవంగములు, జాజి, జాపత్రి, పూగీఫలము మొదలగువానితోఁ గూడిన తాంబూలము నిచ్చెదరు. శరీరమునకు అత్తరు వ్రాసెదరు. పాదములకు పారాయణము పెట్టెదరు. గోళ్లకు రంగు వైచెదరు. ఆ సమయమున యశోదకడనుండి రాధను వంటకు రమ్మని బిలుచుటకు సఖులు వచ్చెదరు. అప్పుడు తన తల్లి యాజ్ఞను బొంది రాధ నందభవనమునకు వంట చేయఁబోవును'

ఇది విని శౌనకుఁడిట్లనెను - 'సూతా! ఇంతవఱకు రాధాకృష్ణులకు ప్రత్యక్ష వివాహము జరిగినట్లు మేము వినలేదు. బ్రహ్మరాధాకృష్ణులకు వివాహము కావించెను. కాని అది యేకాంతము గుప్త స్థానమున జరుపఁబడినది. దానినెవరును జూడనైనఁ జూడలేరు. వివాహము కానిది యశోదమ్మ వంటచేయుటకై రాధిక నేల పిలిపించినది?''

నవ్వి సూతుఁడిట్లనెను:- ''స్వామీ! వివాహము కాకపోవుటలేదు. సంబంధ నిశ్చయమైనది. అదియును గట్టిగానే నిశ్చయమైనది. వరుఁడు వధువుచేత వండఁబడిన నన్నమును దినెనా సంబంధము నిశ్చయమైనట్లే. సంబంధ నిశ్చయమునకును, వివాహమునకును భేదమేమియును లేదు.''

శౌనకుఁడిట్లనెను:- "సరియే, భేదము లేకపోవును గాక! వంటచేయుటకు యశోదాగోపికలున్నారుకదా! ఒక్కరికంటె నొక్కరు పుత్రవాత్సల్యము కలవారుకదా! మంచివంటకూడ చేయఁగలరుకదా! వీరున్నను రాధను యశోద పిలిపించుటకుఁ గారణమేమి?"

నెత్తికొట్టుకొని సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఈ రూక్షజడదారి సాధువులుకు రసికత తెలియదు. మునులారా! మీరు విరాగులు. మీకు రుచి, అరుచులు, తెలియవు. తుల సిని వైచి యేది ప్రసాదమని తెచ్చిన దాని నారగించెదరు. స్వామీ! నూతన వధువుచేతులతోఁ జేయఁబడిన వంటలో నుండదు. యశోద కన్నియును దెలియును. ఆమెకు గావల సినది తన కొడుకునకుఁ గడుపునిండ నన్నము పెట్టుట ఆతని కేది రుచియో దానిని మాటిమాటికినిఁ జేయును.

ఒక దినమున దుర్వాసమహర్షి వచ్చెను. అందతాత నికి నిత్యభోజనమిడుటకై యింటినుండి సిద్ధముచేసికొని పోయెడివారు. ముని యెంతతిన్నను నాతనికి త్రేపురాలేదు. కడుపునిండలేదు. ఇంకను ఆకలి వేయుచుండెను. ఒకదిన మున యశోదమ్మయును జాలపిండివంటలను సిద్ధము చేసికొని దుర్వాసునికడకు బయలుదేరెను. కృష్ణుఁడును యశోదా దేవి వెంట దుర్వాసుని కడకు బయలుదేరెను. యశోద తీసికొని

పోయిన పదార్థములన్నిటినిఁ దిన్నను దుర్వాసునకు త్రేణుపు రాలేదు. తృప్తియును కాలేదు. దైవవశమున నా సమయము నకే, తన తల్లి యాజ్ఞచే సువర్ణ పాత్రయందు భోజన పదార్థములను బెట్టుకొని, తల్లితోఁ గూడి రాధికయును దుర్వాసుని కడకు వచ్చెను. రాధిక తెచ్చిన పదార్థములను దుర్వాసుఁడు మిక్కిలి ప్రీతితోఁ దినుచుండెను. ఆతఁడు మాటిమాటికిని నా పదార్థములను గూర్చి ప్రశంసించుచుఁ బొట్టపైఁ జేతితో నిమురుకొనుచుండెను. భోజన మొనర్చి ఆతఁడు పెద్ద త్రేపును త్రేపి, అత్యంత ప్రేమతో రాధికాదేవిని దగ్గఱకుఁ బిలిచి యిట్లనెను:- 'నీవు వంటను బాగుగాఁ జేసితివమ్మా. నే నీ దినమున నీ కొక వరమునొసంగుచున్నాను. నీచేతితోఁ జేసిన వంటకములన్నియును నమృతోపమానములై కమ్మగాఁ దీపిగా నుండుగాక! నీ చేతితో వండిన యన్నమును దినిన వారు పరమాయువును బొందఁగలరు.'

యశోదకు తన కొడుకుయొక్క ఆయువు వృద్ధి పొంద వలయునని కలదు. ఆమె వెంటనే కీర్తిరాణితో నిట్లనెను :- 'రాణీ, ముని సర్వజ్ఞుఁడు, ఆతని వచనములు మిథ్యలు కాఁ జాలవు. నీ కూఁతురు వండిన యన్నము అవశ్యము అమృత తుల్యము కాఁగలదు. దానినిఁ దినువారి ఆయుస్సు వృద్ధి పొందగలదు. కావున దయతో నీ పుత్రికను మా యింటికిఁ

బంపవలయును. ఆమెవంటను జేసినచోఁ గృష్ణుని ఆయువును వృద్ధిపొందఁగలదు.'

అత్యంత మమతాభరిత వాక్కులతోఁ గీర్తిదేవి యిట్లనెను:- 'రాణీ! నీ వెట్టి మాటలనుచున్నావు? మేము మా పిల్లను మానసికముగ నిదివఱకే యిచ్చియుంటిమి. ఈమె మీ యింటనే యుండవలయును. రేపననేల? ప్రతిదినమును వంటఁ జేయ రాఁగలదు.'

ఇది వినఁగానే యశోదకు మిక్కిలి ఆనందముకలిగెను. అందఱును నదరిగృహములకు వారు పోయిరి. మరునాఁడు రాధికను వస్త్రాభరణాదులతో బాగుగానలంకరించి కీర్తిదేవి నందభవనమునకుఁ బంపెను. రాధిక తన చేతితో వంట నొనర్చెను. నేఁడు శ్యామసుందరున కెక్కుడి యాఁకలియో కాని ఆతఁ డెంతగాఁ దిన్నను దృప్తి కలుగలేదు. మాటి మాటికినిఁ బదార్థములనుగూర్చి ప్రశంశించుచుండెను. వడ్డించినకొలఁది పదార్థమంతయును బూర్తియగుచుండెను. తల్లి యానందమునకు మేఱలేకుండెను. తన కొడుకు బాగుగాఁ జాల పదార్థము తినవలయునని తల్లి కోరుకొనుచుండును, ఆతనికి రుచికరముగ నుండవలయుననియు, దినుటవలన నాతని స్వాస్థ్యము బాగుండవలయుననియు నామె కోరుకొనుచుండును.'

శ్యామసుందరుఁడు భోజనము చేయఁగానే నవయౌవనునివలే నగుచుండెను. ఆతని ముఖకమలము పరమ ప్రఫుల్లిత మగుచుండెను. కాళ్ల యందలి గజ్జెలందెలు ఘల్లు ఘల్లుమని రాధ రొట్టెలను బళ్ళేరమందుంచఁగనే శ్యామ సుందరుని మనమయూరము నృత్యమొనర్చును, ఆతని హృత్తంత్రి దానికదియే మ్రోఁగుచుండును. మరల వడ్డింపఁ గానే నిమిషములోఁ దిని మాయమొనర్చెదువాఁడు; తల్లి యిట్లనుకొనెను:- 'ఈ పిల్ల ప్రతిదినమును వచ్చి వంట జేయు చుండినచో మా నాయన స్వాస్థ్యము కొలఁదికాలములోనే చక్కఁబడఁగలదు,' ఆమె యీ యభిప్రాయమును గీర్తి దేవికి జెప్పెను. ఆమె దానిని తత్క్షణ మంగీకరించుటయేగాక అది తనకును, రాధికకును సదృష్టమని తలఁచెను ఆ దినము నుండి యశోద సఖులను బంపి రాధికను బిలిపించి, శ్యామ సుందరునకు వంటను జేయించుచుండెను.

శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! నీవు దామోదరుని దైనందిన లీలను వర్ణింపవలయును, ఇతర ప్రసంగములను వదలవలయును.'

సూతుఁ డులికిపడి యిట్లనెను:- 'స్వామీ! నే నితర ప్రసంగములను జెప్పుటయేలేదు. భగవానుని దైనందిన లీలలనే వర్ణించుచున్నాను. దీనినిఁ బ్రసంగవశమున మీ రడుగఁగాఁ జెప్పితిని.

ఇచ్చట రాధికాదేవి చేతులను గాళ్లను గడిగికొని, పట్టుపరికిణెను గట్టుకొని, వంటయింటిలోనికిఁ బ్రవేశించెను. ఇంతలో శ్యామసుందరుఁడు పాలు పితికి, తర్వాత నూనె రాచుకొని, నలుగును బెట్టుకొని యమునానదికి స్నానము నకుఁ బోవును. కిటికీలోనుండి రాధిక అలంకరించుకొనివచ్చిన సంగతినిఁ దెలిసికొని, తానును నలంకరించుకొనును. శరీర మునకు సుగంధిత కస్తూరి, కేసరయుక్త చందనము నలఁదు కొని, నీలకురులను దువ్వుకొని వాని నాకర్షకముగఁ జేసి కొనును, మస్తకమునఁ జందనతిలకమును ధరించును. మాటి మాటికిని దన ముఖమును దర్పణమునఁ జూచుకొనును. కంకణములను, భుజబంధములను, అంగుళీయకములను, ముత్యాలహారములను, వనమాలాదులను ధరించును. తల్లి అచ్చటినుండియే నారాయణ నైవేద్యమైనది. భోజనమునకు రా నాయనా!' అని కేక వేయును.

ఆతఁడు వినిపించుకొనఁడు. తల్లి మాటిమాటికిని బిలుచును. అప్పుడాతఁడు తప్పనిసరిగఁ బోవును. శ్యామ సుందరుఁ డొంటరిగ భోజనముచేయ నెఱుఁగఁడు. కాని బలరామునితోఁ గలిసి తినఁడు. ఆతఁ డుండిన మొదలక మిక్కిలి సంకోచముగ భోజనము చేయవలసివచ్చును. ఆతఁ డెప్పుడు భోజన మొనర్చినను సమవయస్కులను గోపబాలు

రతోఁ గూర్చుండి భోజనమొనర్చును. భోజనము చేయు నపుడు తాను నవ్వుచుండును. అందఱను నవ్వించుచుండును. ఒక్కొక్క వ్యంజనమును దీసికొని దాని రుచినిగూర్చి ప్రసంగించుచుండును. ఇదియే విధముగఁ జాలసేపటివఱకు నవ్వులతోడను, వినోదములతోడను భోజనము చేయుచుండును, భోజనము చేసిన తరువాత కొంచెముసేపు శారీరకముగ విశ్రాంతినిఁ దీసికొనును. మనస్స్వేచ్ఛగానో తిరుగుచుండును. సేవకులొసంగిన తాంబూలము నమలును. అంత గోపవేషమును ధరించి, ఆవులను విడిచి, వనమునకు గొనిపోవును.'

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! ఇంతవఱకు గోవు లాఁకలితో నుండవలసినదేనా?'

సూతుఁడిట్లనెను:- 'నందునకుఁ గొదువేమియును లేదు. ఆతని కడ నూఱు, యేఁబది గోవులు లేవు. తొమ్మిది లక్షల గోవులుండెను. అన్నిటినిఁ బ్రాతః కాలమున సేవకులు కొని పోవుదురు. కొన్ని గోవులను మాత్రమే తీసికొని వనవిహారము కొఱకు వ్రజవిహారి పోవుచుండును. ఇంత మంది సేవకులుండిన నీవు వనములకు గోవులను గాయఁబోవుటెందులకని యశోదా దులనుచుందురు. కాని దాని కాతఁ డంగీకరింపఁడు. ఆతఁ డిట్లనును:- 'నేను గోపకుమారుఁడనై యుండి గోవులను మేఁప కుండినచో నేను ధర్మభ్రష్టుఁడను గాఁగలను. ధర్మము నా

కదియే. గోవులను మేఁపుట కేవలము ఉపలక్షణము మాత్రమే. ఆతనికి వనములకుఁ బోవలయునని కుతూహల మెక్కువ తల్లి దండ్రులకు నమస్కారమొనర్చి గోవులను దీసికొని వనమునకు సఖులతోఁగలసి పోవును. కొంచెము సేపు తన మిత్రులగు గోపకులతో గోలీలాట, చెడిగుడుఁ చెర్పట్టీ మొదలగునవి ఆడుకొనును. గోపకులలో నల్గురను నంతరంగసఖులను దీసికొని రహస్యముగ రాధికను గలిసి కొనుటకుఁ బోవును.

ఇచ్చట రాధయును శ్యామసుందరుఁడు భోజనము చేసిన తరువాత యశోద బలవంతముచేయఁగాఁ బరమాత్మ పాత్రనుండి ప్రసాదమును దీసికొని, వెంటనే యింటికి పోవు చుండెడిది. ఆమె కింటనుండుట యిష్టముగా లేదు. ఏదో నెప మున నింటినుండి వెడలిపోయెడిది. తల్లితో నిట్లనును:- అమ్మా! నేను సూర్యనారాయణుని పూజకొఱకై పూలు కోసికొని వచ్చెదను. మన చెలికత్తెలు పెరుగు. పాలు మొద లైనవాటి నమ్మికొని వచ్చిరో లేదో చూచియు రాఁగలను.'

తల్లియైన కీర్తిదేవి యిట్లనును:-'అమ్మా! నీకు పెరుగు, పాల చింత యెందులకు? మనకడ పనిఁజేయుటకై భగవంతు డిచ్చిన పనివార లనేకులు కలరు, పూలను దెమ్మని నౌకరు లతోఁ జెప్పుము, బయటకు బోవుటెందులకమ్మా! ఇంటిలోనే చెలికత్తెలతో నాడుకొనుచుండుము.'

వృషభానుకుమారి యిట్లనును:- 'కాదమ్మా! గోప కుమారినై గోరసములనుగూర్చి చింతింపకుండిన ధర్మభ్రష్ట నగుటయే కాఁగలదు. దేవతాపూజకొఱకు స్వయముగనే పుష్పములను, దులసిని గోసికొనిరావలయును. స్వయముగ మందిరము నూడ్వవలయును.'

ధర్మమనిన నింకఁ దల్లి యేమనఁగలదు. సఖులను వెంట నిడికొని కీర్తికుమారి సంకేతమువైపునకు మిక్కిలి యుత్సాహముతోఁ బోవుచుండెను. ఇచ్చట అత్యంతోత్సాహముతో శ్యామసుందరుఁడును నామెకొఱకు నిరీక్షించుచుండెను, నూపురహారాదుల శబ్దములను వినఁగానే మదన మోహనుని మనస్సు వికసించెడిది, ఆతఁ డెదురుగాఁబోయి కలిసికొనెడివాఁడు. సమయానుసారముగఁ గ్రీడ లొనర్చెడు వాఁడు. వసంతఋతువున మామిడి పూగుత్తులతోడను, జిగురుటాకులతోడను గామునిఁ బూజించెడువారు, అత్యంత గ్రీష్మఋతువునందు కర్పూర, కేసరయుక్తమగు జందనమును దీసి ఒకరి శరీరముపై నింకొకరు గంధము నలఁదుకొనెడు వారు. వర్షాకాలమునందు జెట్లకు లతలతోడ నుయ్యాలలను గట్టి ఒకరి నొకరు నూపుకొనుచుండెడువారు. ఒక్కొక్క ప్పుడు రాధాకృష్ణులను గూర్చుండఁబెట్టి గోపిక లూపెడు వారు. కార్తీకమాసమందు నానావిధములగు పుష్పములతో మాలలుకట్టి విచిత్రములగు లీల లొనర్చెడువారు. అట్లే

మార్గశిర పుష్యమాసములందును వివిధములగు నాటల నాడెడువారు. ఫాల్గుణమందు రంగు కొట్టుకొనుచుందురు. గంధవడి, వసంతములతో హోళికాపండుగను జేసికొనెడు వారు. ఈ పండుగలలో నందఱును బరస్పరము రంగు, వసంతములు కొట్టుకొని రంగులో మునిగిపోవుదురు. గోపకుల మీఁదకూడ గొట్టెదరు. ఈ విధముగ భిన్నభిన్న ఋతువులలో భిన్నభిన్న క్రీడ లొనర్చుచుందురు. అందఱును గలిసి ప్రేమరసపానము నొనర్చెడువారు. శరీరమునకు శ్రమ కలుగఁగానే రాధిక నికుంజములందు బ్రవేశించును. సఖులను వీడి సఖియలు పిలువఁగాఁ గృష్ణుఁ డొంటరిగాఁ బోవును, సఖియలు వారిద్దరిసేవ చేయుదురు. వారికొఱకు పుష్పశయ్య నేర్పఱచెదరు. కొందఱు విడియము లిచ్చెదరు. కొందఱు విసరెదరు. కొందఱు పాదములను వత్తెనరు. ఈ విధముగ గోపీజనవల్లభుఁడు రాధాదులయొక్క సేవలను స్వీకరించును. హృదయమున ననురాగతరంగము పెల్లుబుకును. క్షణక్షణము సమస్త సాత్త్వికవికారము లుత్పన్నములగును. నికుంజములందు శయనించి, గోపికల మాటలు వినుటకు మాగన్నుఁబెట్టుకొని యుండును. నిద్రను నటించును. సఖీజనములలో విచిత్రములగు పరియాచకములు జరుగుచుండును. మిత్రవినోదములు జరుగును. అప్పుడు శ్యామసుందరుఁడు కన్నులు నులుముకొనుచు లేచును. శయ్యనుండి

ఇచ్చట రాధిక సఖియలతోఁ బుష్పములను గైకొని యింటికి వచ్చి తల్లియాజ్ఞను గైకొని సూర్యనారాయణుని మందిరమునకు జేరుకొనును. అచ్చట సఖియలతోఁ గూడు కొని పూజను జేయును. గోధూళిగాలగ్నము కాఁగానే గోపికలు తమతమ గృహములకుఁ బోవుదురు. శ్యామసుందరుఁడు గోవులకడకు వచ్చును. వెంటనే ఆతఁడు గోవుల నొక్క చోటునకుఁ దోలుకొనివచ్చి, వానినిఁ దోలును. వాని వెనుక మురళిని వాయించుచు గోష్ఠమునకుఁ బోవును. మురళీధ్వనిని వినఁగానే వ్రజవాసులందఱును వాసుదేవుఁడు వచ్చుచున్నాఁడని ఆబాలవృద్ధులును గ్రహించిరి. భగవానుని దర్శించుటకై తమ ద్వారములయందు నిలిచెదరు. గోపికలు అనురాగ భరిత దృష్టులతో లేచి, ప్రణయకటాక్షములను బఱపుచు నాతనికి స్వాగత మొసంగుచుందురు. శ్రీకృష్ణుని శరీరమంతయును ధూళిధూసరితమై యుండును, అలకావళియందును, కనుఱెప్పలయందును, గపోలములందును ధూళికణములు బాగుగాఁ బడియుండును. గోపాదధూళిచే నాకాశమంతయును గప్పఁబడియుండును. దానిమధ్య గోపాలకులతోఁ గూడుకొని, మురళీనూదుచు నందఱకును దర్శన మొసంగును.

వృద్ధులను, బ్రాహ్మణులను, బూజ్యులను గాంచిన నమస్కార మొనర్చును. పాదము లంటును. కొందఱకు జేతులను జోడించును. కొందఱను గౌఁగిలించుకొనును. చిన్న

పిల్లలు పరువిడి వచ్చుచుందురు. వారిని ముద్దుబెట్టుకొనును. గోపికలను గనుసన్నలచేతను, గేవలము వారివైపు క్రీగంటి చూపులచేతను నభినందించును. రాధికను జూడనట్లే చూచును. రెండుదృష్టులను గలిసినఁ జాల సంభాషణము జరుగును. గోశాలయందు నిలుచుండిన దల్లులకు నమస్కరింపఁగా వారాతని గౌఁగిలించుకొందురు. వారికి చేపు వచ్చి స్తనములనుండి దుగ్ధములు స్రవించును. దానివలనఁ గృష్ణుని పీతాంబరము తడిసిపోవును. గోశాలకు గోవులు చేరును. వానిని గట్టివేసినతర్వాత నాతఁడు బలరామునితోను, గోప బాలురతోను నింటికిఁ బోవును, పోయి ఋతువు ననుసరించి శీతల, ఉష్ణ లేక శీతోష్ణజలములచే స్నానమాడును. తల్లులు వెంటనే అల్పాహారములను దెచ్చెదరు. కొంచెముగ ఫల హార మొనర్చి, తల్లిదండ్రుల యాజ్ఞచే గోశాలకుఁ బోయి పాలను బితుకును. చాల ఆవుల నితరులచేఁ బితికించును. కొన్నిటికి బాలనన్నిటిని దూడలకే వదలివేయును. ఈ విధ ముగఁ బాలను బితికి, దూడలను గుడిపి, తల్లులతోడను, సేవకులతోడను నెత్తించుకొని పాలను గృహమునకుఁ దెచ్చును, ఇంటికి రాఁగానే తండ్రి, పినతండ్రులు పెత్తం డ్రులు, సోదరులు, బంధువులు కూర్చుండి ఆయా మాటలను మాట్లాడుకొనుచుందురు. చలికాలమున నెగడు వైచుకొని కాచుకొందురు. ఆవుల మాటలును, వ్రజమునకు సంబంధిం

చిన సంభాషణమును జరుగును. అప్పుడింటినుండి భోజనము పునకు పిలుపువచ్చును. అప్పుడు రాత్రిభోజనము జరుగును. రాత్రులం దపక్వపదార్థము లుండవు. రాత్రిపూట రొట్టెలు, కూరయును, మజ్జిగపులుసు, క్షీరాన్నము మొదలగునవి చేయబడును.'

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! ఈ సమయమున రాధ వంటచేయుటకు రాదా ?'

సూతుఁ డిట్లనెను:- 'రాదు, స్వామీ! రాత్రియం దెట్లు రాఁగలదు? ఆమె తన యింటిలోనే వ్యంజనములను సిద్ధమొనర్చుకొని, పళ్ళెరములోఁబెట్టి సఖులచే నాతని భోజనమునకుఁ బూర్వమే పంపును. శ్యామసుందరుఁడును వాని నారగించుచు స్తుతించును. ఎవరైన నత్తవారింటి మాటల నెత్తిన లజ్జితుఁడగును. ఆతఁడు తినఁగా మిగిలిన నుచ్ఛిష్ట ప్రసాదమును, తనయింటిలోఁ జేసిన పదార్థములను యశోద సఖులతోఁ బంపును. ప్రసాదపదార్థములు రాఁగానే రాధిక తన తల్లి చెప్పఁగాఁ దినును. శయ్యనుజేరి నిద్రను నటించును. ఇంటిలో నందఱును నిద్రించినను రాధ కన్నులలోఁ గృష్ణుఁడే యుండును. హృదయమున మురళీధ్వని వినఁబడిన నిద్ర యెట్లు పట్టఁగలదు? ఆమె నిద్రపోయినట్లు గన్నులు మూయును, అందఱును నిద్రపోవుచున్న దనుకొందురు. కాని

ఆమె కన్నులలోఁ గాపురమున్న కృష్ణునితో మాటలాడు చుండును.

ఇచ్చట శ్యామసుందరుఁడును శయ్యాగృహమున గుటికలు పెట్టి నిద్రించును. పగలంతయుఁ దిరిగి, గోవులను గాచి, అలసి నిద్రించుచున్నాడనుకొందురు. గోపకులందఱును బోయి నిద్రించెదరు.

అప్పుడాతఁడు మెదలక లేచి కూర్చుండును. బృందా వనమున కధిష్ఠాతృదేవియగు బృందాదేవి సమస్త కేళి క్రీడల కేర్పాటును గావించును. తన గుప్తసఖిని రాధికకడకు బంపును. చీఁకటిరోజులైన నీలవస్త్రమును గప్పుకొనియు, వెన్నెలరాత్రియైనచో వెన్నెలవంటి వస్త్రమును గప్పు కొనియు నామె వచ్చును. సఖులును వచ్చెదరు. ఇటునుండి శ్యామసుందరుఁడును వచ్చును. ఇద్దఱును గలియుదురు, అంత సంగీతము, నృత్యగానములు జరుగును. ఈ విధముగ నర్థ రాత్రి యగును. అప్పు డిద్దరకును నిద్ర దూగుచు వచ్చును. అప్పుడు సఖియలు వారిద్దరిని నిభృత నికుంజములకుఁ గొని పోయెదరు. అచ్చట నిద్దరును సుఖముగ శయనించెదరు, అచ్చటి కెవరికిని బ్రవేశము లేదు. అచ్చటి లీల వర్ణనా తీతము.'

సూతుఁ డిట్లనెను - 'మునులారా! మీ రడుగఁగా నేను గృష్ణుని దినచర్యను జెప్పితిని. దీనిని వినువారికి శుభము కలుగును. ఇది అతి రహస్యమయమగు ప్రసంగము. దీని నెవరికిని జెప్పరాదు. కులీనురాలైన విధవ తన గర్భము నెట్లు దాచునో అట్లే దీనిని దాచవలెను. ఏలననఁగా శ్రద్ధాభక్తులు లేనివారికి దీనివలన లాభముండదు. మధురరస ప్రవేశమొనర్పనివారీ గహనవిషయమును ధరింపఁజాలరు. వారి బుద్ధి కిది యెక్కదు. కావున నధికారికే దీనినిఁ జెప్పవలయును.'

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! మేము దీనియెడల శ్రద్ధాభక్తులు లేకుండ లేము. భగవానుఁడు సర్వసమర్థుఁడు. ఏదైనఁ జేయఁగలఁడు. కాని భగవానుఁడిట్టి మధురలీల లేల చేసినాఁడనియే మేమడుగుచున్నాము. ఆతఁడతి స్వతంత్రుఁడు. ఏదైనఁ జేయఁగలఁడు. ఆతనికి విధినిషేధములు లేవు. మర్యాద లేదు: మేమా సాంసారికజీవులము. సామాన్యపు స్త్రీ పురుషు లందఱకును బరస్పర మట్టి స్వాభావికమగు రతి కలుగును. పురుషునకు స్త్రీ మీఁదను స్త్రీకి పురుషునిమీఁదను స్వాభావికమగు నాకర్షణము కలదు. మిథునధర్మముననే ప్రపంచము నడచుచున్నది. సృష్టినుండి స్త్రీనిఁ దీసివైచినచో సృష్టి జరుగనే జరుగదు. ప్రతిబీజమందును పుష్పమునందును, పశుపక్షిక్రిమి, కీటకాదులయందును స్త్రీ

పురుష భేదము కలదు. స్త్రీమాయలోఁబడనివారు చాల అరుదుగ నుండెదరు. ఒకరెవరో కాదు. సాధారణముగ వందలి చిత్తములును జంచలములుగ నుండును. భగవానుఁడా విషయమునే తన లీలలోఁ జూపించినాఁడు. స్త్రీ వలలోఁ బడినచో నెన్నటికిని నుద్ధారము కలుగదనెను. భగవానుని లీలల వలన మనము నేర్చుకొనునదేమున్నది?'

సూతుఁడిట్లనెను:- భగవానుఁడు మనకు శిక్షణ నొసంగుటచే ఆ లీలలను జేయలేదు. ఆతఁడీ లీలలను నిరంతరము చేయుచునే యుండును. అవి చేయకుండఁజాలఁడు. సాంసారికులకీ సాంసారిక సుఖములు క్షణభంగురములని తెలియదా? నశ్వరములనియును దెలియును. తెలిసియుండియును, వదలవలయుననుకొనియు వదలఁజాలకున్నారు. ఏలననఁగాఁ బ్రాణులందఱును మాయామోహితులు. మోహమయమగు మదిరను ద్రావి మదోన్మత్తులైనారు. ఈ జగన్మోహనమాయ యెట్లున్నదో అట్లే మోహనమోహినీ మాయయును గలదు. ఈ జగన్మోహినీమాయయను వదలి మోహనమోహినీ మాయనాశ్రయించినచో నిత్యసుఖము ప్రాప్తించును, సాంసారిక సుఖము లనిత్యములు, నశ్వరములు. పరిణామమున దుఃఖము నొసంగును. మోహనమోహినీ మాయాసుఖమును, శాశ్వతమును, నిత్యమును, నవినాశియునై యున్నది. కావున నీలీలలచే ననిత్యమును

వదలి నిత్యమును బట్టుకొనుమని చెప్పుటయే. జగన్మోహినీ మాయాసంబంధమును వదలవలయును. మోహనమోహినీ మాయాసంబంధమును బెట్టుకొనవలయును. సాంసారిక రాస విలాసమునఁ జిత్తమును లగ్నమొనర్పకుము. దివ్యరాస యందు మనస్సు నుంచుము. ప్రపంచము రాధామాధవు లకు క్రీడాస్థలము, బృందావన ధామముపై నాసక్తి కలుగ వలెను. యుగళనామ మందనురక్తి కలుగవలెను. శ్యామ సుందరుని మనోహర రూపమందును సరసలీలలయందును మనస్సు లగ్నమైరమించుటే జీవనమునకుఁ బరమలక్ష్యము. అదియే పరాకాష్ఠ, అదియే పరమగతి. స్వామీ! శ్రీకృష్ణలీలా రహస్యము మిక్కిలి గూఢమైనది. మూఢులు దీనని వ్యభిచార మందురు. శ్రీకృష్ణుఁడధర్మమును జేసెనందురు. ఎవరి మాటయో ఏల? పరమభాగవతశిఖామణియగు బరీక్షిత్తునకే యీ సందేహము కలిగెను. దానికి మా గురువు సమాధాన మొసఁగినాఁడు.'

ఇది విని అత్యంతాశ్చర్యమును బ్రకటించుచు శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! పరమభాగవతుఁడగు పరీక్షిత్తునకు శ్రీకృష్ణుని దివ్యలీలల విషయమున శంక యేల కలిగినది? ఆతఁడు బ్రహ్మరాతుఁడు, పరమ భాగవతుఁడు, ప్రభు కృపా పాత్రుడు కదా!

సూతుఁడు సరళముగ నిట్లనెను:- 'స్వామీ! ఆతనికి శంక లేమిస్వామీ! లోకకల్యాణముకొఱకు శంక చేసినాఁడు. మీ కంతయును దెలిసినను మీ రెట్లు శంక చేయుచున్నారో ఆతఁడును నంతే. శుకదేవుఁ డాతనికి భాగవతకథను జెప్పు నపుడు ఋషులును, మునులును జాలమంది కలరు. వారిలో జ్ఞానులును, ధ్యానులును, కర్మిష్ఠులును, ఉపాసకులును, యోగులును వివిధ సాధనల నొనర్చువారు కలరు. రాజిట్లనుకొనెను:- 'నేను శంక చేయకుండినచో లోకులు శ్రీకృష్ణభగవానుని దివ్యచరిత్రయందు వ్యభిచారము నారోపించెదరు. కావున దానికి నాద్వారా సమాధానమును జెప్పింపవలసియున్నది, వ్యభిచారులగువారి లీలను శ్రీకృష్ణుఁడు చేయలేదన్నను నొప్పుకొనరు. వారు తమ పాపమును గప్పిపుచ్చుకొనుటకై భగవానుని అడ్డముగఁ బెట్టుకొందురు. కావున మహారాజు ప్రశ్న తనది కాదు. అచ్చట నుండిన సంఘమువారిది.'

అంత శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! పరీక్షిన్మహారాజు రాసలీలను గుఱించి యేమని ప్రశ్నించెను? శ్రీ శుకదేవుఁడు దానికేమి ప్రత్యుత్తర మొసంగినాఁడు? దయతో నీ ప్రసంగమును గూర్చి మీ రవశ్యము మా సందేహము లన్నియును దీరునట్లు చెప్పవలయును.'

నవ్వి సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! శంక యుండిన గదా సమాధానము కావలసినది. మీకు శంక లేనే లేదు. రహస్యమునంతయు నెఱుఁగుదురు. నారదునివల మీ రీ రసమునకు సంబంధించిన దీక్షను గైకొంటిరి. పరీక్షిత్తుని సందేహములను, శ్రీ శుక దేవుని సమాధానములను మీకు తప్పక చెప్పెదను. మీ రందఱును సమాహిత చిత్తులరై వినుఁడు.'

— // —

# పరీక్షిత్తునకు రాససంబంధ శంకలు

శ్లో॥ ఆప్తకామో యదుపతిః కృతవాన్వై జుగుప్సితమ్।
కిమభిప్రాయ ఏతం నః సంశయం ఛింధి సువ్రత॥

శ్రీభాగ, ౧౦ స్కం. ౩౩ అ. ౨౮ శ్లో.

వ. సువ్రత! ఆప్తకాముఁడగు శ్రీకృష్ణుఁ డేయభిప్రాయమున నిట్టి జుగుప్సితమగు కార్యము నొనర్చెను. ఈ సంశయము మమ్ము బాధించుచున్నది. దీనిని నివారింపుఁడు.

భరతుఁడు తన తండ్రియగు దశరథునకు ఔర్ధ్వ దైహికకర్మములను జరిపి. వనమునకు శ్రీరాముని దీసికొని వచ్చుటకు సేనాసహితముగాఁ జిత్రకూటమునకుఁ బోవుచుం

డఁగా శృంగబేరపురము దగ్గఱకు వచ్చెను. అప్పుడు నిషాద రాజగు గుహుఁడు సందేహించెను. భరతుఁడు రామునిపై దండెత్తుచున్నాఁడనుకొనెను. భరతుఁడు రామునియెడల స్వప్నమందైనను ననిష్టమును దలఁపఁడు; కాని ప్రభుత్వము వచ్చినతరువాత మదము కలుగుట స్వాభావికము, తరువాత యథార్థమగు విషయము తెలియఁగానే ఆతని సందేహము తీరిపోయెను. గుహుని సందేహము తీరిపోయినది కాని సందేహమునకుఁ స్థానమట్లే యున్నది. అన్నను సమాధానపఱచుటకే పోవుచుండినచో నింత సేనతోఁ బనియేమున్నది? ఎక్కడనైన దండెత్తవలసియుండిన సేనను దీసికొనిపోవుచుందురు. రాజ్యలోభముచే నన్నదమ్ములైనను హత్య చేసికొందురు. తన రాజ్యసుఖమునకు తండ్రి. సోదరుఁడు, సంబంధులు వీరిలో నెవరైనను గంటకముగ గోచరించినచో, రాజ్యలోభముచే భూపతి వారిని జంపుటకు వెనుకాడఁబోఁడు. కావునఁ బ్రతివారికిని నీ సందేహము కలుగుచుండును. గుహుఁడు పల్లెవారిలో నొక చిన్నరాజు. ఆతనికి సందేహము కలిగిన నట్లుంచుఁడు. వీనివలన విశేషహానియును లేదు. కాని యితరరాజులెవరైన సందేహించి, వారందఱును గలిసి భరతునిపై దాడియొనర్చినచో మధ్యలో ననర్థముకలుగును. సందేహముచేతనే కొంచెముగనో గొప్పగనో అనర్థములు

జరుగును. కావున నీ విషయము సార్వజనిక స్పష్టీకరణ మావశ్యకమైయున్నది.

శృంగబేరపురమునుండి గంగను దాటి భరతుఁడు ససైన్యముగ ప్రయాగలో భరద్వాజుని ఆశ్రమమునకు వచ్చెను. ఆ యాశ్రమ మొకనిసొత్తు కాదు. గొప్పగొప్ప రాజులును మహారాజులును నచ్చటికివచ్చి తమ స్వగృహము నకు వలెనే సుఖముగ నుందురు. దరిద్రాతి దరిద్రులును, దీనాతిదీనులును, అకించనులును నే సంకోచమును లేకయే ఋషియొక్క ఆతిథ్యమును గ్రహించుచుందురు. నల్దిక్కులను బరిభ్రమించు ఋషులుండుట కది కేంద్రస్థానము. ఇట్టి గొప్ప తీర్థరాజమగు బ్రయాగకు వచ్చి భరద్వాజాశ్రమమునకు రాకుండిన వారి యాత్ర పూర్తి కానట్లే కాఁగలదు. కావునఁ బ్రయాగకు వచ్చినవారందఱును భరద్వాజాశ్రమమును దర్శింపవలెను. ముని తన తప, తేజ, సదాచార, సమతలచే అపరబ్రహ్మగ నుండెను. శాపానుగ్రహసమర్థుఁడు. అంద ఱును నాతని యాశీర్వాదమును బొందుటకు వచ్చుచుందురు. సర్వప్రథమముగ భరతుఁడును నియమానుసారముగ ముని దర్శనమునకుఁబోయెను. అచ్చటికిచేరఁగనే మునియిట్లనెను: 'భరతా! నీ వింతటి విశాలసైన్యమును దీసికొని రామచంద్రుని సమీపమునకుఁ బోవుచుంటివేల? నీకు దుష్టాలోచ

నము లేదుగదా! రామచంద్రున కేమియు ననిష్టమును చేయవుగదా!'

సర్వజ్ఞుఁడగు ముని నోటినుండి యిట్టి ప్రశ్నను విని భరతుఁడు నిర్ఘాంతపోయెను. ఆతని నేత్రములనుండి బొట బొట నీరు కారెను. ఆతఁ డేడ్చుచు నిట్లనెను:- 'ప్రభూ! మీరు సర్వజ్ఞులై యుండియు నన్నిట్టిప్రశ్నల వేయుచున్నారు. నాథా! నే నెన్నఁగును స్వప్నమందైనను, మనస్సులోనైనను శ్రీరామచంద్రున కనిష్టము నాలోచింపఁగలనా? ఎవఁడైన మూర్ఖుఁడిట్టి సందేహమును జెందిన నుపేక్షించవచ్చునుగాని మీరు త్రికాలజ్ఞులు, సర్వుల హృదయములలోని విషయములను దెలియఁగలవా రిట్టిశంకను జెందుటను గాంచినఁ దప్పక నేను బాపిని కావలయును. నా మనస్సులో నేదియో దోష భావన యుండియుండవలెను.'

ఇది విని భరద్వాజుఁడు నవ్వి యిట్లనెను:- 'భరతా! నీ మనస్సున స్వప్నమందైనను జెడ్డభావ ముండదు; నాకును నీవిషయమున శంక కలుగదు. సూర్యుఁడు పశ్చిమమున నుదయించినను, చంద్రుఁడు విషమును స్రవింపఁజేసినను జేయుఁగాక! కాని నీమనసునందు శ్రీరామునెడల నన్యథా భావ ముదయింపదు. నేను యోగప్రభావముచే నందఱి మనస్సులలోని భావముల నెఱుఁగఁగలను. ఈ శంకను నేను

జేసినది కాదు. సర్వసాధారణముగ లోకుల కనుమానము కలుగవచ్చును, నేను ప్రశ్నించిన నీవు సమాధానమును జెప్పెదవు. నా ఆశ్రమమునఁ జెప్పినవిషయము వెంటనే దశ దిశలను వ్యాపింపఁగలదు. అందఱును నీ ప్రేమకు ప్రణతు లిడెదరు. నీయెడల భక్తిశ్రద్ధలను బ్రకటించెదరు. ఈ యభి ప్రాయముతో నీవు నిర్దోషివని భావించుటకై నేనీప్రశ్న యొనర్చితిని. ఈ శంక నాది కాదు. జన సాధారణ శంక. దీనికి స్పష్టీకరణము కావలసియున్నది. అందువలన నేనీప్రశ్న నొనర్చితిని.'

ఈ ప్రసంగమును నేను చెప్పుట కెందులకనఁగా గొప్పవారే శంక నొనర్చెదరో, అది జనులకుఁ బ్రతినిధిగా నుండి సర్వసాధారణ భావములను వ్యక్తీకరించుటకై చేయు దురు. పరీక్షిన్మహారాజునకు రాసలీలవిషయమున శంక యేల కలుగఁగలదు ? అయినను సర్వసాధారణులకు దీని విషయ ములో నిది ధర్మవిరుద్ధమైనదనుకొని, దానిని స్పష్టీకరించు టకై దీనినిఁ బ్రశ్నించెను.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! మీరు భగవానుని రాసలీల విషయమునఁ బరీక్షిన్మహారాజేవిధముగ బ్రశ్నించి నాఁడు, శ్రీశుకుఁడేమి ప్రత్యుత్తరమొసఁగినాఁడని మీ రడి గితిరి. ఇప్పుడు నేనాప్రసంగమును జెప్పుచున్నాను. రాసలీలా

ఘట్టమును జెప్పుట పూర్తికాఁగానే రాజు శుకమహర్షి నిట్లడిగెను:- 'స్వామీ! నా మనస్సులో నొక సందేహము కలదు. ఆజ్ఞయైనచో దానిని నేను ప్రకటించెదను.'

శ్రీ శుకుఁడు మిక్కిలి యుల్లాసముతో నిట్లనెను:- 'రాజా! తప్పక నీవా శంకను బయటపెట్టవలెను. యథాశక్తి యథాసామర్థ్యముగ దానికి సమాధాన మొసంగెదను.'

పరీక్షిన్మహారాజిట్లనెను:- 'స్వామీ! నా శంక యిది. భగవానుఁడు సాక్షాద్ధర్మస్వరూపుఁడే, భూమిపై నాతఁడు ధర్మసంస్థాపనమునకై వచ్చినవాఁడే. సాధు సంరక్షణమునను, దుష్టనాశనముకొఱకును భగవానుఁడు యుగయుగమున ధర్మసంస్థాపనార్థము అవతరించుచుండును. అనఁగా నాతనికి ధర్మమత్యంత ప్రియమైనది అట్టి ధర్మప్రాణముఁగల ప్రభువు ధర్మవిరుద్ధమగు నాచరణ మేల చేసినాఁడు?'

అధర్మమును రెండువిధములుగ నుండును. సాధారణ అధర్మమును, గొప్ప అధర్మమును. స్మృతికారులు ఉల్లినిఁ దినరాదనియును, కల్లు ద్రాగరాదనియును, ఇట్లనేక వస్తువులను దినరాదని చెప్పిరి. ఈ విధముగఁ జాల ఫలములను, శాకములను దినఁగూడదని చెప్పిరి. ఒకవేళ వీనినిఁ దినినచో శాస్త్ర విరుద్ధమగు నాచరణమై తీరును; కాని యిది సాధారణ అధర్మము. దీనికంటె గొప్ప అధర్మములు దొంగతన

మును జేయుటయు, అబద్ధము లాడుటయును, పరస్త్రీ గమన మొసర్చుటయును మొదలైనవి. వానిని శాస్త్రకారులు మిక్కిలి నిందించిరి. సమాజము చోరత్వము, జారత్వము, మిథ్యా వాదిత్వము లొనర్చినచో రహస్యముగఁ జేయుచుందురు. సాధారణులే యీ కార్యములను భయపడుచుఁ జేయుచుందురు. భగవానుఁడే తన పూర్ణాంశలచే రామకృష్ణులుగ నవతరించిరి. ధర్మమర్యాదకు వక్తయును, రచయితయును, రక్షకుఁడునగు శ్రీహరి పరస్త్రీ గమనమను నిందిత కార్యము నేలచేసినాడు? ఈ కార్యము అవతార విరుద్ధమును, లోకవిరుద్ధమును, ప్రమేయ విరుద్ధముననుమూఁడు విధములగు విరుద్ధములు కావా?'

భగవానుఁ డిట్లనెను:- 'నాకు త్రిలోకములందును గర్తవ్యకర్మ యేదియును లేదు. నేను విధివాక్యములకుఁ గట్టుపడకుండినను ధర్మానుకూల కార్యమునే యొనర్చెదను. ఎందువలన ననఁగా నేను ధర్మముగఁ గార్యము లొనర్పక పోయినచో, నన్నుఁగాంచి అందఱును నకర్మణ్యులగుదురు. అట్టి యెడ నీ ప్రపంచ మర్యాద ఛిన్నాభిన్నమై పోఁగలదు. అందఱును వారికిష్టము వచ్చినట్లు చేయుచుందురు. అందువలన నేనప్పుడప్పుడవతరించి నా యాచరణముచే లోకులకు ధర్మశిక్ష నొసంగుచుందును. స్వయముగ నాదర్శముగనుందును. రామావతారమున, నృసింహావతారమున, పరశు

రామావతారమున నేమిచేసినను ధర్మరక్షణము కొఱకును, దుష్ట శిక్షణము కొఱకు జేసితిని.' కాని యిదెక్కడి ధర్మము పరస్త్రీలతో రాత్రియందు - ఏకాంతవనమందు - విహార మొనర్చుట. రాస విలాసమొనర్చుట, ఇది ప్రత్యక్ష ధర్మ విరుద్ధాచరణము కాదా ?'

లోకములోఁ బరస్త్రీ గామికి సర్వత్ర నిందకలుగును. దీనివలన నాతనికి స్వర్గప్రాప్తికలుగదు. కావున నీ కార్యము లోకవిరుద్ధము.

పోనిండు తర్కమున విచారింపుము. ఎవని సోదరి నైనను, పుత్రికనైనను, భార్యనైనను నెవఁడైనఁ గుదృష్టితోఁ జూచినచో నాతని కెంతో క్రోధము కలుగును. ఇతరుల సోదరిని, కూతురిని, భార్యను గుదృష్టితోఁ గాంచినఁ గోపమురాదా? ధర్మశాస్త్రము లేమి చెప్పుచున్నవి? ఇత రుల యెడల నాత్మ ప్రతికూలాచరణమును జేయకుము. నీ యెడల నింకెవరును నేది చేయఁగూడదని నీవనుకొందువో, యితరులయెడల నీవట్టి కార్యమును జేయరాదు. ఈ విధ ముగఁ బరనారీసేవనము సర్వథా నింద నీయమును, గర్హ్యా మును, ధర్మవిరుద్ధమును నగు కార్యమై యున్నది.

అయితే యిది చెప్పఁడు - కామవేగము కలిగినపుడు ప్రాణి అంధుఁడగును. అతనికిఁ గర్తవ్యాకర్తవ్యతావివేకము.

రామావతారమున నేమిచేసినను ధర్మరక్షణము కొఱకును, దుష్ట శిక్షణము కొఱకు జేసితిని.' కాని యిదెక్కడి ధర్మము పరస్త్రీలతో రాత్రియందు - ఏకాంతవనమందు - విహార మొనర్చుట. రాస విలాసమొనర్చుట, ఇది ప్రత్యక్ష ధర్మ విరుద్ధాచరణము కాదా ?'

లోకములోఁ బరస్త్రీ గామికి సర్వత్ర నిందకలుగును. దీనివలన నాతనికి స్వర్గప్రాప్తికలుగదు. కావున నీ కార్యము లోకవిరుద్ధము.

పోనిండు తర్కమున విచారింపుము. ఎవని సోదరి నైనను, పుత్రికనైనను, భార్యనైనను నెవఁడైనఁ గుదృష్టితోఁ జూచినచో నాతని కెంతో క్రోధము కలుగును. ఇతరుల సోదరిని, కూతురిని, భార్యను గుదృష్టితోఁ గాంచినఁ గోపమురాదా ? ధర్మశాస్త్రము లేమి చెప్పుచున్నవి ? ఇతరుల యెడల నాత్మ ప్రతికూలాచరణమును జేయకుము. నీ యెడల నింకెవరును నేది చేయఁగూడదని నీవనుకొందువో, యితరులయెడల నీవట్టి కార్యమును జేయరాదు. ఈ విధముగఁ బరనారీసేవనము సర్వథా నింద నీయమును, గర్హ్యమును, ధర్మవిరుద్ధమును నగు కార్యమై యున్నది.

అయితే యిది చెప్పేఁడు - కామవేగము కలిగినపుడు ప్రాణి అంధుఁడగును. అతనికిఁ గర్తవ్యాకర్తవ్యతావివేకము

3. భగవంతునియొక్క యిట్టి ధర్మవిరుద్ధాచరణముచే మన మేమి నేర్చుకొనవలసియున్నది ?

4. కర్మసిద్ధాంతమున నెవఁ డెట్టి యాచరణ మొనర్చునో వాఁ డట్టిఫలమును బొందును. అట్టియెడ నిట్టి నిందిత కర్మమువలన భగవానునకు దానిఫలిత మేలకలుగ లేదు?

5. ఆతఁడు లీల లొనర్పవలసియుండిన లీల లొనర్పవచ్చును. ఈ ధర్మవిరుద్ధమగు లీల నే యభిప్రాయముతో నొనర్చి నాఁడు ?

6. రాత్రులందు తమ స్త్రీ లింటిలో లేకుండిన గోపకు లేల వారిని వెదుకఁబో లేదు? పాపము నెంత రహస్యముగ నొనర్చినను నది దాగదు. అట్టియెడ గోపకు లిట్టి యన్యాయ మొనర్చు కృష్ణునకు విరుద్ధముగ నేల కాలేదు? ఆతని జాతిబహిష్కృతి నేల యొనర్ప లేదు ?

నాయొక్క యీ యాఱు సందేహములను మీరు తీర్చవలెను.'

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! పరీక్షిన్మహారాజు యొక్క యీ ప్రశ్నలను విని శుకుఁడు నవ్వి మందహాస మొనర్చుచు రాజడిగిన ప్రశ్నలకుఁ గ్రమముగ సమాధాన మొసంగుటకు సిద్ధపడెను.'

3. భగవంతునియొక్క యిట్టి ధర్మవిరుద్ధాచరణముచే మన మేమి నేర్చుకొనవలసియున్నది ?

4. కర్మసిద్ధాంతమున నెవఁ డెట్టి యాచరణ మొనర్చునో వాఁ డట్టిఫలమును బొందును. అట్టియెడ నిట్టి నిందిత కర్మమువలన భగవానునకు దానిఫలిత మేలకలుగ లేదు?

5. ఆతఁడు లీల లొనర్పవలసియుండిన లీల లొనర్పవచ్చును. ఈ ధర్మవిరుద్ధమగు లీల నే యభిప్రాయముతో నొనర్చి నాఁడు ?

6. రాత్రులందు తమ స్త్రీ లింటిలో లేకుండిన గోపకు లేల వారిని వెదుకఁబో లేదు? పాపము నెంత రహస్యముగ నొనర్చినను నది దాగదు. అట్టియెడ గోపకు లిట్టి యన్యాయ మొనర్చు కృష్ణునకు విరుద్ధముగ నేలకా లేదు? ఆతని జాతిబహిష్కృతి నేల యొనర్ప లేదు ?

నాయొక్క యీ యాఱు సందేహములను మీరు తీర్చవలెను.'

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! పరీక్షిన్మహారాజు యొక్క యీ ప్రశ్నలను విని శుకుఁడు నవ్వి మందహాస మొనర్చుచు రాజడిగిన ప్రశ్నలకుఁ గ్రమముగ సమాధాన మొసంగుటకు సిద్ధపడెను.'

యందురు. అది సంచితకర్మను వృద్ధిగావించును. దానివలననే సంసారచక్రము సుదృఢమగుచున్నది.

నానావిధములగు జప, తపానుష్ఠానములను, ఇతర సత్కార్మల నొనర్చుటయును, వాపీ, కూప, తటాకములను నిర్మించుటయును, సత్రములను, బాఠశాలలను, గోశాలలను, ఔషధాలయములను గట్టించుటయును మఱియు జనోప యోగకరములగు గార్యముల నొనర్చుటయును బుణ్య కార్యము లగును. మన మేర్పఱచిన వాపీ, కూప, తటాకాదు లకుఁ గావలసిన మట్టి మొదలగునవి ఇంకొక లోకమునుండి తీసికొనిరాలేదు. ఇచ్చటినుండియే తీసికొంటిమి. దానిని నిర్మించువారినైనను వేఱొకలోకమునుండి తీసికొనిరాలేదు. ఇచ్చటివారే వానిని నిర్మించిరి. ద్రవ్యమును నిచ్చటిదే. ఈ ధర్మకార్యము మనద్వారా అయినదని కేవలము మన సంస్కారము మాత్రమే అందు కలదు. చచ్చిన తరువాత బావి, చెఱువు మనవెంట రావు. ఇచ్చటనే యుండిపోవును. కేవలము వాని శుభసంస్కారములే వెంట వచ్చును. ఆ సంస్కారముల ఫలస్వరూపముగ స్వర్గసుఖములు ప్రాప్తిం చును.

పరస్త్రీని జూడగనే ఒకానొకని చిత్తము చంచల మైనది. ఇది పాపమని మనస్సునకుఁ దెలియును. వాసనకు

యందురు. అది సంచితకర్మను వృద్ధిగానంచును. దానివలననే సంసారచక్రము సుదృఢమగుచున్నది.

నానావిధములగు జప, తపానుష్ఠానములను, ఇతర సత్కార్మల నొనర్చుటయును, వాపీ, కూప, తటాకములను నిర్మించుటయును, సత్రములను, బాలశాలలను, గోశాలలను, ఔషధాలయములను గట్టించుటయును మఱియు జనోపయోగకరములగు గార్యముల నొనర్చుటయును బుణ్యకార్యము లగును. మన మేర్పఱచిన వాపీ, కూప, తటాకాదులకుఁ గావలసిన మట్టి మొదలగునవి ఇంకొక లోకమునుండి తీసికొనిరాలేదు. ఇచ్చటినుండియే తీసికొంటిమి. దానిని నిర్మించువారినైనను వేఱొకలోకమునుండి తీసికొనిరాలేదు. ఇచ్చటివారే వానిని నిర్మించిరి. ద్రవ్యమును నిచ్చటిదే. ఈ ధర్మకార్యము మనద్వారా అయినదని కేవలము మన సంస్కారము మాత్రమే అందు కలదు. చచ్చిన తరువాత బావి, చెఱువు మనవెంట రావు. ఇచ్చటనే యుండిపోవును. కేవలము వాని శుభసంస్కారములే వెంట వచ్చును. ఆ సంస్కారముల ఫలస్వరూపముగ స్వర్గసుఖములు ప్రాప్తించును.

పరస్త్రీని జూడగనే ఒకానొకని చిత్తము చంచలమైనది. ఇది పాపమని మనస్సునకుఁ దెలియును. వాసనకు

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! నా గురుదేవుని పరీక్షిన్మహారాజు ఆఱు సందేహాము లడుగఁగా నాతఁడు క్రమశః జవాబు లిచ్చుచున్నాఁడు. రాజునకు ప్రథమశంక యిది - 'భగవంతుఁడు ధర్మవిరుద్ధమగు కార్య మేల చేసి నాఁడు?' దీనికిఁ బ్రత్యుత్తరము మునుముందుగా శుకదేవుఁ డొసంగెను.'

శుకదేవుఁ డిట్లనెను:- 'రాజా! భగవానుని విషయ మును నీవు వదలివేయుము. ముందుగా భగవంతుఁ డేర్పఱి చిన సృష్టిసంబంధమును గూర్చి విచారింపుము. శరీరమును స్వస్థముగనుంచుకొనుటకు ఏ నియమములను పాలింపవలయు నని ఆయుర్వేదము చెప్పుచున్నది. ఆయుర్వేదమందు పథ్యాపథ్య వివేచనము కలదు. ఏ వస్తువు స్వాస్థ్యమునకు హితకరమో, ఏది అహితకరమో దానిలో వివేచింపఁబడి నది. శరీరము వాత, పిత్త, శ్లేష్మముల ఆధారమున నున్నది. అట్లే యీ ప్రపంచమంతయును సత్వ రజ స్తమోగుణముల ఆధారమున నున్నది. ఆయుర్వేదమం దందఱకును నొకే వస్తువు హితకరముగ నుండదు. సామాన్యముగ భోజన నియమమునఁ దేలికైనదియును, పౌష్టిక మగునదియును, హృదయమునకుఁ బ్రియమగునదియు నగు సాత్త్విక భోజన మందఱకును హితకరముగ నుండును. ఉదరముననుండు అగ్ని

నాల్గు రకములని చెప్పఁబడినది. మందాగ్ని, సమాగ్ని, తీవ్రాగ్ని, బడబాగ్ని. మందాగ్నికలవాఁడు మిక్కిలి జాగ్రత్తగా భోజనమొనర్పవలయును. ఆయీ గరిష్ఠవస్తువులను దీసికొనినచో వాని స్వాస్థ్యము చెడిపోవును. ఆతనికిఁ గ్లేశము కలుగును. అందువలనఁ నాతఁ డత్యంత సంయమముతోఁ బథ్యభోజన మొనర్పవలయును, పగలంతయును బరిశ్రమ మొనర్చువానికి జఠరాగ్ని తీవ్రముగనుండును. వారు కొంచెమటునిటు నపథ్యము లొనర్చినను అంతగా హానియుండదు. వారికైనను సంయమముతో నుండుటయే హితకరము. కాని వారి సంయమము మందాగ్నికలవారి సంయమమునకు వేఱుగ నుండును. వారి పాచనశక్తి తీవ్రమైనది. కావున వారు గరిష్ఠ భోజనమొనర్పవలయును. వాఁడు చేసినట్లు మందాగ్ని కలవాఁడు భోజనమొనర్చినచో నాతఁడస్వస్థుఁడై తీరును. కొన్నికొన్ని రోగముల కెంతతిన్నను భస్మమైపోవును. దానికి చికిత్స వైద్యులు క్షీరాన్నము, హల్వా, గేదెపాలు, పెరుగు మొదలగునవి గరిష్ఠములును, చాలకాలమునకు పచనమగు నవియుఁ జెప్పెదరు. ఆతనికి బ్రొద్దు క్రుంకులును దినఁ బెట్టుచుందురు. తిని నిద్రించుట నిషేధము. కాని వైద్యుఁడు వానినిఁ దినఁగానే నిద్రబొమ్మనును. ఏలననఁగా వాని జఠరాగ్నియందు పాచన సామర్థ్యము కలదు.

ఇదేవిధముగఁ బ్రపంచమందును ధర్మాధర్మ వ్యాఖ్య కలదు. ఒక ఆశ్రమము వారికేది ధర్మమో యింకొక ఆశ్రమము వారికది అధర్మము.

మంచి స్థానమున నుండిన జలమును ద్రాగవలయు ననుట సామాన్య నియమము. గంగనైనను, అది గంగలో నుండి చీలి మరల గంగలోఁ గలియకుండిన దానిని ద్రావుట అధర్మము. కల్లుముంతలోని గంగాజలమును నపేయమే. ఈ విధముగ జలమును ద్రాగుటకును శాస్త్రముకలదు. కాని సూర్యనారాయణుఁడు సముద్రమునుండియు, నదులనుండియు, వాపీ, కూప, తటాకాదుల నుండియు, సమస్త ప్రాణుల యొక్క రక్తమునుండియును, మాంసము నుండియును, శరీర ధాతువులనుండియును, విష్ఠా మూత్రాదులనుండియును జలమును జీల్చుకొన్నను నాతనికి దోషమంటుటలేదు. ఆ జలమునే ఆతఁడు వర్షముగఁ గురిపించుచున్నాఁడు. ఆ వర్షజలముల నందఱును మిక్కిలి ప్రేమతోఁ బాన మొనరించుచుందురు. సూర్యనారాయణుఁ డశుద్ధస్థానములనుండి జలములను బీల్చుచున్నాఁడు కావున నా యశుద్ధ జలములను మనము త్రాగఁగూడదని చెప్పినను, త్రిలోకములందు సర్వశ్రేష్ఠుఁడగు సూర్యనారాయణుఁడు మూత్రజలమును ద్రాగుచున్నాఁడు కావున మనమును మూత్రమును ద్రాగవచ్చుననిన నది పొసగదు, సూర్యుఁడు సమర్థుఁడు. ఆతఁడశుచి

మనమాతని యాచరణము ననుసరింపరాదు. ఆతఁడన్ని స్థానములందలి నీటినిఁ బీల్చుచున్నాఁడని ఆక్షేపింపరాదు. గొప్పవారికిఁ బవిత్రమొనర్చు శక్తియును గొప్పగ నుండును.

ఇదేవిధముగ భోజనమునకును నియమము కలదు. ఫలాని వస్తువును దినవచ్చుననియును, ఫలాని వస్తువును దినఁ గూడదనియును గలదు. అఖాద్య వస్తువును దినిన నతఁడు ధర్మ భ్రష్టుఁడగును. కాని దేవతల ముఖమగు నగ్నిలో దేనిని వైచినను దినివేయుదురు. వేదమంత్రములచేఁ బవిత్ర మైన నన్నమును వేసినను సరియే, పెంటను వేసినను అన్నిటిని స్వాహా యొనర్చును. సర్వభక్షియైనను అగ్ని పవిత్రాతి పవిత్రమైనది.

సాధారణుఁడు తనలో నెవఁడైన నన్యజాతివానిని స్వార్థవశమునఁ గలుపుకొనినచో నందఱు నాతనిఁ దిరస్కరించెదరు. గొప్పవారు – అనఁగా నాచార్యుఁడగు సమర్థ పురుషుఁడు శిక్షాదీక్ష నొసంగి; యెవనినైనఁ దనకు సమానముగ నొనర్చినచో నాతఁడు జగత్పూజ్యుఁడగును. అందఱును నాతని నాదరించెదరు. మురికిగుంటలో నీరుండిన దాని నెవరును దాకనేతాకరు. అదియే గంగలో గలిసినచో దాని పేరు మారిపోవును. అందఱును దానిని శ్రద్ధాసహితముగ శిరస్సునఁ జల్లుకొందురు. దానిలో స్నానమొనర్చెదరు, ఆచమన మొనర్చెదరు.

పై విషయమునుబట్టి మనకు దేలిన దేమనఁగా సామర్థ్యవంతులగువారేదైన ధర్మవిరుద్ధమగు నాచరణమును జేసినట్లు కనఁబడినను దానిని నిందింపరాదు. వానియొక్క తేజఃప్రభావముననను, వారి సంసర్గముచేతను జెడ్డదియును మంచిదగును.'

అంత శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! పెద్దవారును, గొప్పవా రెట్లాచరించెదరో ఇతరులును నట్లే యనుకరించెదరు. ఈ ప్రాణు లనుకరణప్రియులు. బాలకులు తల్లిదండ్రులేయే పనులను జూచెదరో, వాని నాటలలో నాడుకొందురు. లోకుల కేపనులందు స్వాభావికరుచి కలదో, వానిని గొప్పవారు చేయుచుండినచో నది వారికిఁ బ్రమాణమగును. వారు ఆ పనులే తాము చేయవలసినవని చేయుచుందురు.'

సూతుఁడిట్లనెను:- 'స్వామీ! ఇది పొరపాటు. అట్లు చేయరాదు. మనము సుచరితుల ననుకరింపవలయుననియు, ధర్మవిరుద్ధముగఁ గర్మ కనఁబడినచో దాని ననుసరింపవలదనియు ఋషులు స్పష్టముగఁ జెప్పిరి. సమర్థులగువారి విధివాక్యములనే మన్నింపవలసియున్నది. వా రాజ్ఞాపించిన కర్మలనే చేయవలయును. ధర్మానుకూలముగ నాచరణమొనర్చిన వారి ననుసరింపవలయును. కాని వారి ఆచరణమున ధర్మవిరుద్ధముగ నేదైన గోచరించిన దానినిఁ జేయవలదని చెప్పినచో దాని నొనర్పరాదు. ఇట్లు కాకున్న వారు ధర్మభ్రష్టులగుదురు. తాము సమర్థులుకాక సమర్థులగువారి ననుసరించి

నచో, వారికి పరలోకములు నశించును. ఈ లోకమందును వారపయశభాగులగుదురు. ఈ విషయమును నేను జాల దృష్టాంతము లొసంగి నచ్చఁజెప్పెదను.

(1)

ఒక కపట సాధువుండెను. ఆతఁడొక పరమహంస అన్నిటిని దినుటను గాంచెను. ఎక్కడనైనను మలమూత్ర త్యాగ మొనరించును. గొప్పగొప్ప విద్వాంసులును పండితులును నాతని నాదరించుచుందురు. దీనినిఁగాంచి మానప్రతిష్ఠలను బొందుటకై, ఆతఁడును దితిక్షనానర్పసాగెను. దిగంబరియయ్యెను. తితిక్షలో నాకర్షణముండును. స్త్రీలును, బురుషులును నాతని తితిక్షను గాంచి, ఆతనివైపు ఆకర్షితులైరి. చాలమంది ఆతని దర్శనమునకు వచ్చుచుందురు. వివిధ పదార్థములను బెట్టుచుందురు. ఆతఁడు తన చేతితోనైనను దినఁడు. ఇతరు లాతని నోటఁ బెట్టెడువారు. ఇదంతయును నాతఁడు మానప్రతిష్ఠకొఱకు చేసెడువాఁడు. ఆతనికిఁ బరమహంసస్థితి ప్రాప్తింపలేదు. సర్వత్ర ఆతని త్యాగమును గూర్చియు, తితిక్షనుగూర్చియు ప్రసిద్ధి కలిగెను. తెలివిగల ఒక రాణి ఆతని ప్రశంసను విని వచ్చెను. ఆతఁడు చూడఁగనే ఆమె రాణి యని గ్రహించెను. ఆమెను జూడఁగనే ఆతఁడామె వడిలోనికివచ్చి పరుండెను. రాణి యేమియు ననలేదు.

ఆమె తనవెంట పాలకోవాను దెచ్చెను. దానిని నోటఁ బెట్టెను. ఆతఁడు తినుచుండెను. తినుచుండఁగా నాతఁడు రాణి వడిలోనే మలమును విసర్జించెను. రాణియొక్క వస్త్రము లన్నియును నపవిత్రములయ్యెను. అయినను నామె యేమియు ననలేదు. ఆతనికి కోవాను బెట్టుచుండెను. ఆమె ఒక కోవా బిళ్లను మలములో ముంచి ఆతని నోటఁ బెట్టబోఁగా ఆతఁడా దుర్గంధముచే ముఖము నీవలకుఁ ద్రిప్పెను. అప్పుడా రాణి ఆతని తన వడినుండి తీసి యిట్లనెను:- 'పోరా! ఆవలకు. కపటసాధూ! ఇది రాణియొక్క వడి. తినుచు మలత్యాగ మొనర్పఁగూడదని నీకు తెలియదు. కాని యిది కోవా, యిది మలమనిమాత్రము తెలియును. నీ జ్ఞానము పరిపక్వము కాలేదు. నీవు జ్ఞానివలె మూర్ఖుఁడవై అనుకరించుచున్నావు.' రాణియొక్క యీ మాట వినఁగానే ఆతనికి దనతప్పు తెలిసి తన కపటవృత్తిని వీడెను.

(2)

ఇట్టిదే తినుటవిషయమున నొక కథ కలదు. ఒక సాధువు పదునైదుగురు తన శిష్యులతోఁ దూర్పుదిశయందు జరించుచుండెను. అందఱును నాఁకలి యయ్యెను. గురువు ముందు పోవుచుండెను. శిష్యులు వెనుకనుండిరి. నదియొద్దనఁ గొందఱు పల్లెవాండ్రు చేపలను గాల్చుకొనుచుండిరి. గురువు

వారిని భిక్షమడిగెను. వారిట్లనిరి:- 'స్వామీ! చేపలున్నవి.'
గురువిట్లనెను:- 'పోనిండు, చేపలనే యివ్వవలెను.'

వెనుక శిష్యులు వచ్చుచుండిరి. వారికిని ఆఁకలి వేయుచుండెను. వారిదివఱలోఁ జేపలను దినుచుండిరి. వారు గురువువద్ద మంత్రమును దీసికొనినప్పుడు ఇఁక నెప్పటికిని జేఁపలను దినమని ప్రతిజ్ఞ నొనర్చియుండిరి. ఇప్పుఁడాఁకలియు నయ్యెను. కాల్చి కూరగా వండిన చేఁపలను జూడఁగానే వారికి నోట నీరూరెను. వారు పల్లెవాండ్ర నిట్లడిగిరి:- 'మా గురు వీమార్గమునఁ బోయినారా?'

పల్లెవాఁడిట్లనెను:- 'అవును స్వామీ! ఇప్పుడే పోయినారు. మేము చేఁపలనీయఁగా దిని పోయినారు.'

ఇది వినఁగానే వారి హర్షముఁనకు మేఱ లేకుండెను. వారిట్లడిగిరి:- 'మాకును మిక్కిలి ఆఁకలి వేయుచున్నది. మాకును జేఁపల నొసంగుము.'

శిష్యులలో నొకఁడిట్లనెను:- ఇది గురువాజ్ఞ. ఎన్నటికిని జేఁపలను దినఁగూడదుకదా!'

అంత మొదటివాఁడు కోపముతో నిట్లనెను:- 'ఓయీ! ఆజ్ఞవలన నేమగును. ఆయనే తినఁగా మనమేలఁ దినఁగూడదు, గురువేమి చేసినాఁడో శిష్యుఁడు నదే చేయవలయును.' అని పలికి వారును జేఁపలను గడుపునిండఁ దినిరి.

అంతట ముందుకుబోఁగా గురువు కలిసెను. ఆతఁడిట్లడిగెను:- 'మీ రేదైన తిన్నారా? లేదా?'

శిష్యులిట్లనిరి:- స్వామీ! మేమును మీరు తినిన చేఁపలనే తింటిమి.'

గురువిట్లనెను:- 'నేను జేఁపలను దినవలదంటినిగదా!'

శిష్యులిట్లనిరి:- స్వామీ! వలదనిన నేమి? మీరేమి పనిచేసినారో మేమును నాపనినే చేయవలయును.'

గురువిట్లనెను:- 'బాగుగనే యున్నది. అంతే.' అని పలికి ఆతఁడు వమన మొనర్చెను. ఆ క్రక్కునందు బ్రదికి యుండిన చేఁపలును వానిపైఁ దులసియు నుండెను చేఁపలెగిరిపోయి నీటిలోనికిఁ జేరెను; గురువిట్లనెను:- 'మీరందఱు నిట్లే క్రక్కుఁడు'

అప్పుడు వారు చిక్కులోఁ బడిపోయి గురుని పాదములపైఁబడిరి. అప్పుడు గురువిట్లనెను:-'గురు వేది చెప్పినాఁడో దానినిఁ జేయవలయును. ఆతని ధర్మసంగతములగు కార్యముల ననుసరింపవచ్చును. కాని ఆతఁడు కాదనిన కార్యములను, ధర్మవిరుద్ధమగు నాచరణమును గురువొనర్చినను దానినిఁ జేయరాదు.'

(౩)

ఇట్టిదే ఒక కథ త్రాగు విషయమునను గలదు. ఒక ఆచార్యుఁడు తన శిష్యులతోఁ బోవుచుండెను. దానిలో నాతనికి సారాయిబట్టి కనఁబడెను. ఆచార్యుఁడు సారాయము నడిగెను. వారు భక్తితో గమండలువు నిండ మద్యము నొసంగిరి. ఆచార్యుడు దానినిఁ ద్రాగివైచెను. ఆతని వెనుక శిష్యులుండిరి. వారును గురువు చూచుచుండఁగనే మద్యము నడిగి త్రాగిరి. ముందునకు బోఁగా నొక కంచరివాని బట్టీ కనఁబడెను. ఆతఁడు కంచునుగరుగుచుండెను. ఆచార్యుఁడు కరుగుచుండిన కంచునడిగెను. వారట్లే యొసంగిరి. ఆతఁడు దానినిఁద్రావివైచెను. అంతనాతఁడు శిష్యులతో నిట్లనెను:- 'మీరును ద్రాగుఁడు.' వారిట్లనిరి:- 'స్వామీ! దీనినిఁ ద్రాగుటకు మాలో నట్టి సామర్థ్యము లేదు.' అప్పుడు గురువిట్లనెను:- 'మీరు నా ధర్మవిరుద్ధమగు నాచరణమేలఁ జేసితిరి? మీరు నా ఆజ్ఞను పరిపాలింపవలయును. నా ధర్మవిరుద్ధపు కార్యముల ననుసరింపరాదు.'

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! పృథివి పుష్పములను మలములను దనలోఁ గలుపుకొనును. గంగ సమస్త జలములను దనలోఁ గలుపుకొని గంగాజలముగనే యొనర్చును. సూర్యనారాయణుఁడు సమస్త స్థానములందలి జల

ములను లాగుకొని శుద్ధమొనర్చును. అగ్ని అన్నిటినిఁగాల్చి భస్మమొనర్చును. ఇవన్నియును నేదో నియమమున బంధింపఁబడినను, వానికిని నియామకుఁడుండినను సామర్థ్యవంతులగుటచే నివి గుణదోషముల కంటి యుండవు. సదా నిర్మలములుగ నుండును. వీనికే యిట్టి సామర్థ్యముండిన సమస్త జగత్తునకు నియామకుఁడును, అనంతకోటి బ్రహ్మాండముల కేకైక అధీశ్వరుఁడునగు వాని కధర్మమెట్లంటఁగలదు ? ఆతఁడు ధర్మాధర్మములకు బరుఁడు. ఈ కార్యము చూచుట కధర్మముగ గోచరించుచున్నను భగవానునకు దీనివలన హానిలాభము లేమి యున్నవి?' అని యిట్లు మా గురుదేవుఁడు పలుకఁగా బరీక్షిన్మహారాజిట్లడిగెను:- 'స్వామీ! భగవానుఁడు ధర్మాధర్మములకు బరుఁడైనను లోకమునఁ బాపము పాపమే కదా! ఆతఁడు మనుష్యుఁడైనపుడు మానవ ధర్మములను బాలింపవలయును. కొన్ని పాపములు మనస్సులో నుండును కాని బయటకుఁ గనఁబడదు. ఇతరయుగములలో మానసిక పాపముల ననుభవింపవలసి యుండును కాని కలియుగమున నవి ఇంద్రియములద్వారా వ్యక్తము కావు. మనస్సులోనే ఉద్భవించి శాంతించును. సాధారణముగ వాని ఫలముండదు. వచనముతోఁ జేసినపాపము నవశ్యము అనుభవింపవలసి యుండును. కాని మనోవాక్కాయములచేఁ

జేయఁబడు పాపము ఘోరపాపము. ఇట్టి పాపమును భగవానుఁడేల యొనర్చినాఁడు ?'

ఇది విని శుకదేవుఁడు దీనికిని బ్రత్యుత్తర మొసంగ సిద్ధపడెను,

—//—

## భగవానునకు పంచినవాఁడు లేఁడు

శ్లో॥ గోపీనాం తత్పతీనాం చ సర్వేషామేవ దేహినామ్।
యోఽంతశ్చరతి సోఽధ్యక్షః క్రీడనే నేహ దేహభాక్॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౩౬ శ్లో.

వ. గోపికలకును, తత్పతులకును, సమస్త దేహధారులకును నంతరాత్మగానుండువాని క్రీడ లీ దేహముతోఁ జేసెడివి గావు.

ప్రపంచమునఁ దనవారెవరు, పరాయివా రెవరు? మనస్సు దేనిని దనదనుకొన్నదో అది తనది. దేనిని పరాయిదనుకొన్నదో అది పరాయిది. 'ఇది నాది, ఇది నాది కాదు. ఇది నేను, ఇది నేను కాదు' అను నద్వైతబుద్ధి అహంకారముచేఁ గలుగును. శరీరములన్నియును బంచభూతములచే

నిర్మితములైనవి. ఏ పంచభూతముల సమ్మిశ్రణముచేఁ బశు పక్ష్యాదులును, గీటకములును, బతంగములును శరీరములు ధరించినవో వానితోడనే మానవ, దేవతాది శరీరములును, నేర్పడినవి. స్థూల సూక్ష్మములుగ నుండవచ్చును కాని వస్తు వొక్కటే. ఈ జగత్తంతయును బంచభూతములచే నిర్మింపఁ బడినది. స్త్రీ పుం నపుంసక, అండజ, స్వేదజ, ఉద్భిజ, జరాయుజాదులలో నే శరీరమైనను బంచభూతములచే నేర్పడినవే. కావున శరీరమందఱకును సమానమే వానిలో భేదమేమియును లేదు. ఇఁక నాత్మయందుమా ? ఒకే పర మాత్మ జీవులందఱ హృదయములలో నుండి వసించుచుఁ జైతన్యప్రదాన మొనర్చుచున్నాఁడను సంగతి అందఱకును దెలియును. ఈ జీవులలోని చైతన్యమంతయును భాసించు నది నేకమాత్రమగు నాత్మద్వారముననే. కావున నాత్మ బుద్ధిచేతనే భేదమేమియును లేదు. జ్ఞాని తనలో నన్నిటిని, నన్నిటిలోఁ దనను జూచుకొనుచుండినచో నట్టివాఁ డెవరిని నిందింపఁడు. నిందయనునది ద్వైతముననే కలుగును. ప్రగాఢ ఆత్మీయత యున్నచోట నింద యెట్లుకలుగఁగలదు? ప్రేమలో ఏకత్వమందు దోష ముండనేయుండదు. గుణములే భాసిం చును. దీనినిఁబట్టి స్వపరాభినివేశము అజ్ఞానకృతము. అజ్ఞాన మం మిథ్యాజ్ఞానముచేఁ గలుగును. అహంకారశూన్యుఁడైన వానికిశుభాశుభములు లేవు. తనవారుపరాయివారనునది లేదు.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! పరీక్షిన్మహారాజు పరనారీ నిషేవణపాపమును గూర్చి ప్రశ్నింపఁగా, శుకుఁడు రాజున కిట్లు జవాబొసంగెను. 'రాజా! నే నిదివఱకే కర్మ బంధన మహంకారముచేఁ గలుగునని చెప్పితిని. మానవుఁడు శరీరమునే ఆత్మగా భావించినచో, వానికి శరీరమందు మిథ్యాభిమానము కలుగును. నేను రాజును నే పండితుఁ డను, నేను శ్రేష్ఠుఁడను, మిగిలినవారందఱును నాకంటె నికృష్టులు. ఇది నా యిల్లు, ఇది నా భూమి. దీనిపై నెవరైన నధికారమును బ్రకటించినచో వారు నా శత్రువులు.' అని యిట్లు అహంకార మమకారములకు వశీభూతులై స్వార్థ ముచే శుభాశుభకర్మ లొనర్చినయెడల నట్టివాఁడు శుభా శుభ ఫలముల ననుభవింపవలసివచ్చును. స్వర్గేచ్ఛచే యజ్ఞ యాగాదు లొనర్చినయెడల నాతనికి స్వర్గాదిలోక సుఖములు లభించును. సంసారి స్వార్థమునకు వశీభూతుఁడై బ్రహ్మహత్య సురాపానాది అశుభకార్యములొనర్చినచో నరకాదిలోకము లకుఁ బోయి దుఃఖము ననుభవింపవలసి వచ్చును. సుఖ దుఃఖము లనునవి సదహంకారమువలననే కలుగుచుండును. అహంభావము లేక, శుభాశుభకర్మలందు లిప్తుఁడు కాకున్నచో నాతఁడసంఖ్యాకములగు రాజసూయ. అశ్వమేధాదియాగము లొనర్చినను వాని ఫలమును బొందుటకై స్వర్గమునకుఁ బోవలసిన పని లేదు. శస్త్రమునుదీసికొని ప్రపంచమునంతను

సంహారించినను నరకమునకు బోవలసిన పనియుండదు. ఏల
ననఁగా నహంకారహీనుఁడగు సమర్థుఁడు శుభాశుభకర్మ
లొనర్చుటలో నిజస్వార్థ మెట్లు లేదో, అదేవిధముగ నశుభ
కర్మలొనర్చిన నాతనికి దానికిసంబంధించిన ననర్థముండదు.

జీవసంజ్ఞ కలిగినట్టి జ్ఞానులకే శుభాశుభకర్మ లంట
కుండినచో అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు శ్రీకృష్ణ
చంద్రునకు శుభాశుభకర్మఫలము లెట్లంటఁగలవు? భగవం
తుఁడు పశు, పక్షి, కీట, పతంగ, దేవతా, మనుష్యాది ప్రాణు
లందఱను నేకైక శాసకుఁడు, అందఱకును స్వామి, ప్రభువు,
శాసకుఁడు, నియామకుఁడు, సంచాలకుఁడు. ఆతనిఁ బాప
పుణ్యము లెట్లు స్పర్శింపఁగలవు? ఆతనిసంగతి నట్లుంచుఁడు,
భక్త్యాదులద్వారా ఆతని కృపను బొందినవారును, శ్రీహరి
చరణరజముచే సంతుష్టులైనవారును, నిత్యతృప్తులు నగు
భక్తజనులును, యోగసాధనప్రభావమున సమస్త కర్మ
బంధనములనుండి విముక్తులగు యోగిజనమును సమస్త
విధినిషేధరూపమగు బంధనములనుండి విముక్తులై స్వచ్ఛంద
ముగ విహరించుచుండఁగా, స్వభావముచేతనే స్వచ్ఛందుఁ
డును, సాధనాదులచే సిద్ధినిబొంద నవసరములేని స్వతఃసిద్ధుఁ
డును, సర్వాంతర్యామియును, సర్వేశ్వరుఁడు నగు హరికి
పాపపుణ్యము లెట్లంటఁగలవు? ఆతఁ డేవిధముగ దోషభాగి
కాఁగలఁడు?'

పరీక్షిన్మహారాజిట్లనెను:- 'పోనిండు, భగవానుఁడు దోషి కాఁడనియు, ఆతనికిఁ బుణ్యమొనర్చుటచే స్వర్గాదుల కోరికగాని, పాపమొనర్చుటచే నరకాదుల భయముగాని లేదనుకొందము. అయినను నాతఁడు మానవశరీరమునుధరించి నాఁడుకదా! మనుష్యశరీరమును ధరించినప్పుడు మనుష్యుని కనురూపమగు చేష్టలను చేయవలసియుండును ఆతఁడిట్టి తలక్రిందుల పనులొనర్పఁదలఁచిన బశుపక్ష్యాదిరూపములను ధరింపవచ్చును గదా! పశుపక్షులకు ఇది నా స్త్రీ, ఇది ఇంకొకరి స్త్రీ, ఇది నా తల్లి, ఇది నా సోదరి అను వివేక ముండదు. ఈ వివేకము మనుష్యునకే యుండును. మానవులలో నైనను ధర్మాత్ముఁడగు వర్ణాశ్రమాచారపరుఁడే యీ స్త్రీనిఁ బొందవచ్చును, యీ స్త్రీనిఁ బొందరాదను విచార ముండును. వివాహమునైనను బాగుగా విచారించి తన గోత్రము, మాతృగోత్రము కాకుండ చూచి వివాహ మాడుదురు. పరస్త్రీగమన మత్యంత నిషేధమని చెప్పఁబడినది. మనుష్యులలోనుండి మనుష్యశరీరమును ధరించి, మానవుల శాస్త్రమర్యాదలను బాలింపవలసి యుండును. పరస్త్రీని ఏకాంతమునఁ గామభావముతోఁ స్పృశించుట సర్వథా పాపము.'

శుకుఁ డిది విని గంభీరుఁడై యిట్లనెను:- 'రాజా! భగవంతుఁడు రాసలీల నొనర్చెననుసంగతి నీకెట్లు తెలిసినది? నీవు నీ కండ్లతో లీలను జూడలేదుకదా?'

రాజిట్లనెను:- 'స్వామీ! అన్నిటిని జూచుటచేతనే ప్రమాణముగ గ్రహింపను. నేను పుట్టకమునుపే నా తండ్రి చనిపోయెను. నే నాతనిఁ జూడలేదు. దీనినిఁబట్టి నాకు తండ్రి లేఁడని చెప్పవీలులేదు, గర్భాధానసమయమున నేను నా తండ్రిని జూడలేదు: అట్టియెడ నీతఁడే నా తండ్రియని యెట్లంగీకరింపఁగలము? ప్రత్యక్షప్రమాణ మేమంత గొప్ప ప్రమాణము కాదు. ఆకాశమున మనము ప్రత్యక్షముగ నింద్రధనుస్సును గాంచుచున్నాము; కాని వాస్తవమున నింద్రధనస్సనునది ఒకవస్తువు కాదు. ఆకాశమును నీలమందురు, కాని ఆకాశము నీలము కానేకాదు, దూరమునకు యమునాజలము నీలముగ గోచరించును. కాని ఆ నీటికి నీలిమ లేదు. కావునఁ గొన్ని ప్రత్యక్షప్రమాణములు యథార్థములుకావు. ముఖ్యప్రమాణము శబ్దప్రమాణము, జ్ఞానులును, ఋషులును జెప్పినదియే నిజమగు ప్రమాణము. కార్యాకార్యవ్యవస్థితికి శాస్త్రమే ప్రమాణము. మీరు ఋషులు, సర్వజ్ఞులు. మీరే చెప్పుచున్నారు భగవానుఁడు రాసలీల నొనర్చెనని. ఇదియే మా కన్నిటికంటె గొప్ప ప్రమాణము. పురాణము లన్నిటిలోను శ్రీకృష్ణుని రాసలీలావర్ణనము కలదు.

సంతోషముతో శుకుఁడిట్లనెను:- 'రాజా! రాస జరిగినట్లు శాస్త్రమే ప్రమాణమని నీచేఁ జెప్పించుటకే ప్రయత్నించితిని. ఏ శాస్త్రము రాసలీలనువర్ణించినదో ఆ శాస్త్రమే సర్వసాక్షియును, సర్వగతుఁడును, సచ్చిదానందస్వరూపుఁడునగు శ్రీహరి మానవస్వరూపమును లీలగాధరించెనని చెప్పుచున్నవి. సరే, సర్వగతుఁడును, సర్వవ్యాపియు నైనవానికి తనస్త్రీ పరస్త్రీ యను భేదభావ మెక్కడిది? నీవే యాలోచింపుము. వాయువు సర్వశరీరములందును వ్యాపించినది. అది మన చేయి, ముఖము మొదలగు నంగములను స్పర్శించును. దాచిన గుహ్యాంగములనుగూడ స్పర్శించును. అది లేకపోయిన జీవనమే లేదు. ఏవిధముగ సర్వాంతర్యామియగు ప్రభువు గోపికల శరీరమున నున్నాఁడో, నదేవిధముగ వారి పతుల శరీరములోను గలడు. వారి పతులును శ్రీకృష్ణుఁడుండుటచేతనే యున్నారు. వారిని వారి పతులు స్పర్శించునపుడు శ్రీకృష్ణుఁడును స్పర్శించుట లేదా? శరీరములో నెచ్చటనైనను జిల పుట్టినచోఁ జేతులు పోయియే గోకవలయును. నీవు విద్యుద్వీవనతో విసరినను, తాటియాకుల వీవనతో విసరినను గాలి ఒక్కటే, గోపిక లెవరినైన స్పర్శించినను, ఎవరైనను గోపికలను స్పర్శించినను శ్రీకృష్ణుఁడు లేక స్పర్శ జరుగఁజాలదు. ఏలననఁగాఁ బ్రాణులందఱియందును నాతఁడే యుండి కార్యములొనర్చుచున్నాఁడు. ఇట్టి సర్వాంత

ర్యామియగు ప్రభు వేకాంతమున స్పర్శించినచోఁ బాప మేమున్నది ?

పరీక్షిన్మహారాజిట్లనెను:- 'స్వామీ ! భగవానునకు దోషము లేదని ఒప్పుకొందుము. ఈతఁడు ఘటఘట వాసి. అయినను ఈ విషయము లోకములో నిందితముగ నెన్నఁబడుచున్నది. పరస్త్రీస్పర్శ లోకవిరుద్ధము.'

దృఢతాస్వరమున శ్రీశుకుఁ డిట్లనెను:- 'అట్లు కాదు రాజా! లోకవిరుద్ధము కాదు. లోకములో మనము నిత్యమును గాంచుచున్నాము. సభలలోను, సమావేశములలోను, కథా కీర్తనములందును, పర్వోత్సవములందును స్త్రీలు వేఱుగఁ గూర్చుండెదరు. పురుషులు వేఱుగఁ గూర్చుండెదరు. కాని పిల్లలు వారి కిష్టమువచ్చినపుడు పురుషులలోనికి వచ్చి కూర్చుండెదరు, మరల స్త్రీలలోనికిఁ బోవుచుండెదరు. పిల్లలు తాకరానివారని యే స్త్రీయు ననుకొనదు. అందఱును వాని నెత్తుకొని ముద్దుపెట్టుకొందురు. కౌఁగిలించుకొందురు. లోకములో దీని నెవరును దప్పనుట లేదు. శ్రీకృష్ణుఁడు మాత్ర మింకఁ జేసినదేమున్నది ?'

నవ్వి పరీక్షిన్మహారాజిట్లనెను:- 'స్వామీ! పిల్లల విషయము వేఱు. పిల్లలందఱును నొకటిగనే యుందురు. పిల్లలకు స్త్రీలు దాగరు; పరపురుషుఁడు కామభావముతో స్పర్శించుట నిషేధము.'

నవ్వి శుక దేవుఁ డిట్లనెను:– 'రాజా! నీవు పిల్లవాఁడని యెవరినందువు? ఒకానొకప్పు డందఱును బిల్లలే. అందఱును బిల్లలుగనే పుట్టెదరు గడ్డములు మీసములతోఁ బుట్టినవాఁ డెవఁడును లేఁడు. అందఱును బిల్లలే.

నవ్వి రాజిట్లనెను:– 'స్వామీ! అందఱును బిల్లలెట్లు కాఁగలరు? పుట్టుట యను విషయము వేఱు. పిల్లవాఁడు పెద్దవాఁడై యువకుఁడుగనో, వృద్ధుఁడుగనో అయినచో వానినిఁ బిల్లవాఁడని యెవరనఁగలరు? వారినిఁ గాంచఁగనే స్త్రీలు తలవంచుకొని పైఁట సవరించుకొందురు.'

శుకుఁ డిట్లడిగెను:– 'అయితే పిల్లవాఁడనిన నెన్నేండ్ల వాఁడని నీ యభిప్రాయము?'

రాజిట్లనెను:– "స్వామీ! పది పదునొకండు సంవత్సరములవఱకు బాలకుఁడందురు. ఆతఁడు పదునాలుగు, పదునైదు సంవత్సరముల వాఁడగుచో వానికిఁ బిల్లవాఁడను ఖ్యాతి యుండదు. స్త్రీలు పదియేండ్ల పిల్లవాండ్రవద్ద సంకోచమును జెందరు. వారిని స్త్రీలందఱును దమ పిల్లలవలెనే ప్రేమించెదరు."

నవ్వి శుకుఁడిట్లనెను:- 'అయితే రాజా! రాసలీలా సమయమునఁ గృష్ణుని వయస్సు పదియేండ్లు కూడ లేదు.

ఆతఁడు వ్రజమున బ్రకట రూపమునఁ బదునొకండు వర్ష ముల వఱకే యుండెను. ఇట్టి వయస్సులో నేయనుచిత విషయమును జరుగదు.' జరుగ లేదు,'

నవ్వి రాజిట్లనెను:-'స్వామీ! ఇప్పుడీ విధముగ నన్ను యుక్తుల చేతను,శబ్దజాలము చేతను బంధింపఁదలఁచుచున్నారు. ఇదివఱలో మీరెంతో స్పష్టశబ్దములతోఁ గామ క్రీడా వర్ణన మును గావించితిరి. ఇప్పుడు మీరు తప్పించుకొనుటకు విష యమును మార్చుచున్నారు. ఒక వేళ బాలకుఁడు భావముతోఁ దాకఁ దలఁచినచో రాత్రియందేకాంతముగ రాస నేల రచించినాఁడు ? మీరు మూర్తీభవించిన శృంగారరసమును వర్ణించితిరి.'

శీఘ్రముగ శుక దేవుఁడిట్లనెను:- 'రాజా! భగవానుఁడు రాసను రచింప లేదని నే ననుట లేదు. అవశ్యము రాస యొన ర్చినాఁడు. చక్కఁగాఁ జేసినాఁడు. గోపికలను రసములో ముంచివైచెను. వారికిఁ బ్రేమను రుచిచూపించెను. ఆడెను, పాడెను, పరస్పరము కౌఁగిలించుకొనిరి. కుంజకేళి, జలకేళి మొదలగు వివిధములగు క్రీడల నొనరించెను. కాని యవి ప్రాకృతములు కావు. దివ్యములు. భౌతికములు కావు. చిన్మయములు. ఈ శరీరముతో గాదు దివ్యాతి దివ్య శరీర

ముతో నొనర్చెను. తన భగవత్తత్త్వమును స్థిరమొనర్చు కొని చేసెను. స్వార్థవశమున గాక కేవలము గోపికలకు సుఖమును గలిగించుటకే యొనర్చెను. గోపికా సంబంధమునఁ గామ మను శబ్దము వచ్చినచోట దానిని దివ్యాతి దివ్యమగు ప్రేమయని తెలిసికొనవలయును. ఎచ్చట 'జారభావము' 'ఔపపత్య'మను శబ్దములు వచ్చినచోట దివ్య రసాస్వాదన ప్రక్రియయని తెలియవలెను. వాస్తవమున శ్రీకృష్ణుఁడు గోపికలకుఁ బరుఁడుకాఁడు. ఆతఁడు వారి కాత్మ స్వరూపుఁడు. ప్రేష్ఠుఁడు. పతి. స్వామి. సర్వస్వము. గోపిక లాతనికాత్మ. ఆత్మలో రమించుటకే ఆతని క్రీడ యందురు. ఆతఁడు స్వయముగ రసస్వరూపుఁడు, స్వయముగ నాస్వాద్యుఁడు. లీలాధామ, ఆలంబన, అవలంబన, ఉద్దీపనము మొదలగు కామ సంబంధమగు భావములన్ని యు నాయనయే. ఇవన్నియును గలిసి యెచ్చటఁ గ్రీడించునో అదియే రాస. రాజా! ఇదంతయును గడబిడగనుండును. ఇది చెప్పుటకును, వినుటకును వీలులేనిది. మాయ, క్రీడ, ఆట, లీల మొదలగునవన్నియును నాతఁడే.'

నవ్వి రాజిట్లనెను:- 'స్వామీ! ఏదో అయినది. ఇదంతయును భగవంతుఁడేల జేసినాఁడు? ఇంతటి సరసలీలవలన సాంసారిక ప్రాణులేమి నేర్చుకొందురు?'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ ! పరీక్షిన్మహారాజిట్లు ప్రశ్నింపఁగా మాగురుదేవుఁడు కొంచెముసేపు మౌనముగ నుండెను. ఆతని కన్నులనుండి ప్రేమాశ్రువులు రాలెను. అస్రువులను దుడిచికొని ఆతఁడు స్వస్థుఁడై, మరల రాజు ప్రశ్నకు సమాధానమీయ నుద్యమించెను.'

—॥—

# భగవానుని లీల లన్నియు శ్రేయస్కరములే

శ్లో॥ అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాస్థితః।
భజతే తాదృశీః క్రీడా యాః శృత్వా తత్పరో భవేత్॥

శ్రీభాగ. ౧౦ స్కం. 33 అ. 3౭ శ్లో.

వ. భూతముల ననుగ్రహించుటకై మానుష దేహముతోనుండి వేనిని వినిన వానియందు మనస్సు లగ్నమగునో అట్టి క్రీడల నొనర్చెను.

దృష్టాంతము సదా ఏకదేశిగా నుండును. ప్రపంచమున సర్వాపగపూర్ణమగు దృష్టాంతము లేనేలేదు. చంద్రముఖ మందురు. ముఖము చంద్రునివలె నుండునా? దాని

తాత్పర్యము చంద్రుఁ డెంత సుఖదముగను, శీతలముగను, ఆహ్లాదకరముగ నుండునో అట్లే ముఖము నుండుననియే. ముఖమును, చరణములను, కరములను, నేత్రములను కమల మునకుఁ బోల్చుచుందురు. చరణకమల మన్నప్పుడు చరణ ములు కోమలముగను, మృదువుగ నున్నవనియే అర్థము. అట్లే కరకమలముల విషయమును. కమలనేత్రము లనిన కమలములవలె వికసించి, ప్రసన్నములైన నేత్రములనియే. ముఖకమలమనినఁ గమలమువలె సుగంధము, సౌరభము, సరసత్వము, సౌందర్యము కలదనియే అభిప్రాయము.

భగవంతుఁడు పరిపూర్ణుఁడు. అపూర్ణ వస్తువులలోనే సమత లేకుండిన నిఁక భగవంతునితో సమానమగు వస్తు వేమి కలదు. ఆతనిగూర్చి ఉపమించుట కేమివస్తువు కలదు? ఆతని లీలలకు సమానమగు లీల లేమికలవు? పరాత్పరుఁడగు ప్రభువు భూమిపై నవతరించినపుడు, ఆతని సర్వవ్యాపకతా పరిపూర్ణతలకు బాధ లేదు. ఒకానొక రాజు రాజవేషమును ధరించినను, బిచ్చగాని వేషమును ధరించినను నాతని స్వరూ పము బాహ్యవేషమువలన మారదు. ఆతఁడు వేషము ననుసరించియే కార్యము లొనర్చును, అట్లే మాధవుఁడు మానవ వేషమును ధరించినపుడు మానవలీలలనే యొనర్చును. ఆతనికొఱకై సర్వాంగమగు నుపమానముకొఱకై వెదుక రాదు. ఈ లీల లొనర్చుటలోఁ బ్రయోజన మేమున్నదో, దీని

వలన మనము నేర్చుకొనఁదగినదేదియో ఆలోచింపవల వలయును. సర్వాంగానుకరణ మొనర్చినచో ననర్థములు కలుగవచ్చును.

సూతుఁడిట్లనను:- 'మునులారా! నా గురుదేవుఁడగు శుకుని, పరీక్షిన్మహారాజిట్లడిగెను:- 'స్వామీ! భగవానుఁ డిట్టి అత్యంత సరసలీల లొనర్చుటెందులకు? ఏదైన వీరరస మైనఁ దెలిసికొనవచ్చును. అత్యంత శృంగారరసమువలన మనము నేర్చుకొనున దేమి కలదు?'

ఇది విని మా గురుదేవుఁ డేమిచెప్పెనో, దాని యాధా రమున నేను మీకు జెప్పున్నాను. 'మునులారా! భగవల్లీల లచింత్యములు. వాని విషయమున జీవుఁ డిదమిత్థమని చెప్ప వీలులేదు. భగవానుఁ డిట్టి సరసలీలల నేలచేసినాఁడో, దాని నాతఁడే యెఱుఁగవలయును. శాస్త్రకారులుమాత్రము భగ వంతుఁ డిట్టి కమనీయలీలలను జీవుల ననుగ్రహించుటకే చేసెనని చెప్పెదరు. జీవుఁడు భగవంతునకు దూరమైననాటి నుండి మరల నాతనిఁ గలిసికొనుటకుఁ దపించుచుండును. ప్రపంచమందలి వ్యాకులతయు, నధీరతయు నాతనిఁ గలిసి కొనుటకే. ప్రయత్నమొనర్చినను, ప్రియుఁడు లభింపకుండి నను, ఆతని దర్శనము కాకున్నను, ఆతని స్పర్శసుఖము లభింపకుండినను దుఃఖియగును. ఏడ్చును. కృపణుఁడు ధనము లభింపవలయునని దేశ విదేశములయందు దిరుగుచుండును.

ఆతఁడు నిద్రించుచున్నను, మేల్కొన్నను ధనమెట్లు లభించు ననియే చింతించు చుండును. ఆతఁడు ధర్మమును విచారింపఁడు. ఆతనికిఁ గావలసినది శరీరసుఖమే. ఆఁకలిగొన్న వాఁడన్నమునకై వ్యాకులుఁడగును. దప్పికను గొన్న వాఁడు నీటికై తపించును. శీతార్తుఁడు ఉష్ణమునకై పరితపించును. కాముకుఁడు నిరంతరము కామినినే చింతించు చుండును. ఈ కోరికలన్నిటిలోఁ గామేచ్ఛ ప్రబలమైనది. జీవుని మనస్సులో నా కామేచ్ఛయే కృష్ణునియెడల నుదయించినచో నాతని దుఃఖములన్నియును దూరమై పోవును. ఆతఁడు శాశ్వత సుఖమును బొందును. ఇప్పుడు ప్రశ్న యేమనఁగాఁ గామభావము స్త్రీ పురుషులలో నుత్పన్నము కాఁగలదు. ఇద్దరును నొకరినొకరు పొందఁగోరుచుందురు. ఇందులో జీవుఁ డెవరి ననుకరింపవలయును? పురుషుఁడు స్త్రీనిఁ గోరినట్లును, స్త్రీ పురుషునిఁ గోరినట్లా?

మీరు బాగుగా నాలోచించినచో రెండువైపులను నాకర్షణము ప్రబలమైనట్లు మీ కర్థము కాఁగలదు. పురుషుఁడు స్త్రీ నెంతగాఁ గోరుచుండునో స్త్రీయును బురుషుని నంతగాఁ గోరుచుండును. రెండు వైపులను నాకర్షణము సమానముగ లేకుండినచో లోకములో నీ యాకర్షణము సర్వశ్రేష్ఠముగ నెన్నఁబడదు. లోభికి ధనమునందు మిక్కిలి యాకర్షణముండును. ధనము కొఱకాతఁడు ప్రాణములనైన

నొద్దును. ఆతఁడు ధనము నెంతగాఁ గోరునో, ధనమాతని నంతగా వరింపదు. అందువలన నీ యాకర్షణము పూర్ణమైనది కాదు. స్త్రీపురుషులలో నాకర్షణము రెండు వైపులనుండియు యుండును. అది అత్యంత ప్రబలమై యుండును. ఆకర్షించు శక్తి స్త్రీలో నెక్కువగ నున్నది. ఆకర్షింపఁబడుశక్తి పురుషునిలో నధికముగఁ గలదు. స్త్రీ ఆకర్షకము కాకుండినఁ బురుషుఁ డాకర్షింపఁబడఁడు. భగవంతుని దనవైపునకుఁ లాగుకొనుట జీవునియొక్క కార్యము. అల్పజ్ఞుఁడగు జీవుఁడు సర్వజ్ఞుఁడగు భగవంతుని దనవైపునకెట్లు లాగుకొనఁగలఁడు? ఆతఁడిచ్చిన శక్తిచేతనే లాగుకొనఁగలఁడు. స్త్రీ యెంతటి సుందరియైనను, ఎంత ఆకర్షణము కలదైనను మృత్పాషాణములచే నిర్మింపఁబడిన పురుషమూర్తిని దనవైపునకాకర్షించుకొనఁజాలదు. ఏలననఁగా దానిలో నాకర్షింపఁబడు శక్తి లేదు. అట్లే జీవుఁడెంతటి జప, తప, విద్యా, గుణ సంపన్నుఁడైనను, భగవానుని కృప లేనంతవఱకు వాఁడాతనిఁ బొందఁ జాలఁడు. జీవుఁ డాకర్షింపఁబడుటెట్లు స్వభావమో, అట్లే భగవానుఁడు కృప జూపుట స్వభావము. జీవుఁ డాతని నార్తుఁడై పిలిచినచో నాతఁడు రాఁజాలకుండుట అసంభవమును, గఠినమును. అతఁడు ప్రేమాధీనుఁడు. నిజమగు హృదయముతోఁ బిలిచినచో నాతఁడు రాఁదలఁచుకొనకున్నను వచ్చితీరవలసినదే. ఆతని కృప ఆతని వివశునిఁ గావించును.

ఆతఁడింక నిలువఁజాలఁడు. కావున జీవునియొక్క హృదయ
మందు కామపీడిత కామినికివలెఁ బ్రియునిఁ గలిసికొనుట
కావేదన చెందనంతవఱకు ప్రభుప్రాప్తి అసంభవము. దీనినిఁ
జెప్పుటకే భగవానుఁడిట్టి సరసలీలను రచించినాఁడు.

ఈ జగత్తంతయును బ్రకృతిపురుషులక్రీడ. ఈప్రపంచ
మున రెండే వస్తువులుకలవు. ఒకఁడాడువాఁడు, ఆడింపఁబడు
వాఁడు. దానిని మాయాబ్రహ్మలనుము, ప్రకృతి పురుషు
లనుము, ఈశ్వరజీవులనుము, విషయమంతయు నొక్కటే.
పురుషుఁడొక్క కృష్ణుఁడే. మిగిలినదంతయు బ్రకృతియే.
భగవానుడు జీవునిఁగూడ బకృతి యనియే చెప్పెను.
పురుషుఁడును నేకమాత్రుఁడగు బ్రహ్మ శ్రీకృష్ణుఁడే
యగునెడల పురుషునియొక్క భేదభావము మిథ్య. భగవం
తుఁడుకాక మిగిలిన ప్రాకృతజగత్తంతయు స్త్రీరూపమే.
అందఱును గోపికలే. అందఱును సఖులే. అందఱును బెరుగు
పాలనమ్ము గోపికలే. అందఱును శ్యామసుందరునకు సుఖము
నొసంగు వ్రజాంగనలే.

బృందావనమున నొక సాధువు స్త్రీలను జూడననెను.
ఒక గోపీరూప పరమభగవద్భక్తయగు మహిళ ఆతనిఁ గలిసి
కొనుటకుఁ బోయినది. ఆతఁడు స్త్రీలతో మేము కలిసి
కొనము, చూడమనెను. భగవద్భక్తయగు నామహిళ యిట్లు
కబురంపెను:- 'మేము బృందావనమున నందనుఁడనువాఁ

డొక్కఁడే పురుషుఁడు కలఁడని వినియున్నాము. అట్టియెడ నింకొకపురుషుఁ డెచ్చటినుండి పుట్టుకొనివచ్చియున్నాఁడు ?' సాధు వామె భావమును గ్రహించి ఆమెను జూచుటకు బయటకు వచ్చెను. ఇంతకు సారాంశ మేమనఁగా స్త్రీ పున్నపుంసకు లందఱును ప్రకృతిలోనివారే. అందఱును నా పరాత్పరపురుషోత్తమునిఁ గలియుటకు వ్యగ్రులైయున్నారు. అధీరులై యున్నారు. భగవంతుని బరమశ్రేష్ఠునిగ భావించి, ఆతని యానందముకొఱకు, ఆతని బొందుటకై జీవుఁడు సమస్తప్రయత్నము లొనర్పవలయును. దీనిని నేర్పుటకే భగవానుఁడు రాసలీల నేర్పఱచెను.

అంత శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! ఇది తెలిసి తెలిసియే రోగి కపథ్యమిడినట్లయినది. మహాభాగా! ప్రపంచమున నందఱును గామపీడితులై యుందురు. కామవశులై నిత్యమును గ్రొత్తకొత్త పాపము లొనర్చుచుందురు. భగవానుఁడును నట్టి కామక్రీడ నొనర్చుచుండినచో లోకు లింకను దుఃఖితులగుదురు. కాముకులముందు కామక్రీడ లొనర్చుట వలన వారి కామము నింకను నుత్తేజము కల్గించుటేకదా! దీనివలన జీవులకు మేలేమి కలిగినట్లు ? ఇంకను ననర్థము నుత్పన్నము కావించుటే యగును.

అంత సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! విషమున కౌషధము విషముగనే యుండును. జంగమ విషముచే స్థావర

విషము నాశమగును. దివ్యకామముచేఁ బ్రకృతికామము పూర్తిగ నశించును. ఈ భక్తిమార్గమున రాగానుభక్తి జీవున కనుకూలసాధనమని చెప్పఁబడినది.'

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! కామము నుత్తేజము కలిగించుటకంటె వైరాగ్య వివేకములద్వారా కామము నేల నశింపఁ జేయఁగూడదు ?'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! కామమును నశింపఁ జేసినచో నత్యుత్తమమే కాఁగలదు. కామారియగు శంకరుఁడు మొదలగువారు కామమును నాశముకావించిరి. కాని ప్రవాహమున కెదురుగా నీటిని గొనిపోవుట చాల కష్టము. యుక్తిద్వారా తీసికొనిపోవచ్చును, కాని మరల క్రిందకు పరువిడి వచ్చును. స్త్రీకి బురుషునియందును, పురుషునకు స్త్రీయందును సహజాకర్షణము కలదు. ఈ యాకర్షణము నెదుర్కొనుటకే మానవుఁడు భగవచ్ఛక్తియగు జగజ్జనని నుపాసించుచుందురు. వైరాగ్యముచేఁ గామమును జయించువారు ప్రపంచవిషయములం దేవగింపు నుత్పన్నము కావించుకొని విషయవిరాగమును జెందుదురు. వారిట్లందురు:- స్త్రీ ముముఖగాని, బురుషుని ముఖముగాని యెట్టిది ? ఉమ్మి, చీమిడి, చొంగతోఁ గూడినది. పండ్లనుండి దుర్గంధము వెలువడుచుండును. ఆొమ్మును జూతమా మాంసపిండములు, చర్మము, మాంసము, రక్తము తప్ప యింకేమున్నది ?

జఘున మెట్టిది? మూత్రముతోఁగూడ దుర్గంధయుక్తమగు నపవిత్రస్థానము. వీనివలన సుఖానుభవమును గోరువారును, ఆసక్తిని జెందినవారును, అజ్ఞులును, మూర్ఖులును, బాగుగా నాలోచించినచో నీకథనమందును నాసక్తి కలదు. ముఖ, హృదయ, జఘునములనుగూర్చి నిందించువారికిని లోలోన మోహాకత దాగియుండును, ఆతఁడు స్వాభావిక ఆకర్షణము నంగీకరించుచు మనస్సును మోసగించుటకు దానియెడల సేవగింపును గలిగియుండును, అనుకూలభావముచే నా యాకర్షకస్థలములను జింతించుచునే, వాని ననుభవించుచునే ఒకానొక అనుభూతినిఁ జెందును. ఈ ప్రతికూలభావముచే నాతనికి సంతోషము కలదు, ఇది యుత్తమమైనదే కాని యీ మార్గ మందఱకు ననుకూలమైనది కాదు.

ఒకానొక వ్యక్తికి బెల్లముతినెను నలవాటు కలదు. ఆతనిచే బెల్లమును దినుట మాన్పింపవలయునని ఆతని హితైషియొక్క అభిలాష. బెల్లముపై సేవగింపు కలుగఁ జేయుటకొక మార్గమిది - బెల్ల మెట్టిది? అది చెఱకునుండి వచ్చును. చెఱకును బొలములందు నాటెదరు. దానిలో విష్ఠా మూత్రములు. పేడ మొదగగు నపవిత్రవస్తువుల నెరువుగ వేయుదురు. ఈ యశుద్ధములగు నెరువులనుండి యా రసమును గ్రహించి చెఱకు పెరుగును. దాని రసమును దీసి పొయ్యి మీఁద వండెదరు. దానిలో నెన్నియో జీవజంతువులు పడి

చచ్చును. అందఱును నెంగిలిచేతులతోఁ దాకుచుందురు. బెల్లము చేయునపుడు చీమలు, పురుగులు, ఈగలు వచ్చిపడి చచ్చును. ఇట్టి చెడ్డబెల్లమును దినుటచే నేమి లాభము? తినిన జబ్బుచేయును. క్షణకాలము మాత్రము రుచి, తరువాత మలమైపోవును. ఈ విధముగ బెల్లముమీఁద నేవగింపును గలిగించెదరు.

ఇఁక రెండవమార్గము. బెల్లమును దినువానికి దానికంటె సుందరసుగంధమగు కండకలికి నొసంగి, దాని రుచి నాలుకకు తగులగానే బెల్లముమీఁదగల ననురాగము దానికదియే విలీనమగును. అంత జిహ్వా కండకొఱకు ఉవ్విళ్లూరుచుండును. ఈ సాధన స్వాభావికమైనది. ప్రకృతికి అనుకూలమైనది. మధురమైనది, జిహ్వాకు గావలసినది బెల్లము కాదు. తీపి. దానికి బెల్లముమీఁదగాదు ప్రీతి తీపిమీఁద. దివ్యమధురము లభించినచో సాధారణమాధుర్యము నేల కోరును? ఇదేవిధముగఁ బ్రకృతికి పురుషునితోఁ జేరవలయునను కోరిక స్వాభావికము. దానినిఁ బ్రకృతినుండి బలవంతముగ దొలిగించి పురుషునియందు జేరునుగాని అది పొడిపిండి వంటిది. గొంతు దిగదు. తృప్తి కలుగును. కడుపు నిండును. కాని సాధారణప్రకృతిని వదలి దివ్యప్రకృతిని నాశ్రయింపవలయును. విషయసుఖమును వీడి శ్రీకృష్ణచంద్ర ఆనందకందుని యందు మనస్సును మగ్నమొనర్పవలయును. అట్లుచేసినచో

నత్యంత సరసతతో నా దివ్యరసప్రాప్తి సుగమముగఁ గలుగును, అందువలన దీనిని రసమార్గమనిరి. రసశాస్త్రమందు దీనినిగూర్చి విస్తారముగఁ జెప్పఁబడినది ఈ రసలీలలను శ్రవణ మొనర్చుటచే నందఱకును సుఖానుభూతి కలుగును. ఎట్టి కావ్యమైనను, ఎట్టి కథయైనను దానిలో నాయిక లేకున్నచో నది నీరసమే యగును. నాయికానాయక సంసర్గముచేతనే రసాభివృద్ధి కలుగును. నాయకుఁడు శ్రీకృష్ణుఁడు. నాయికామకుటమణి రాధిక, ఈ యిద్దర హాసవిలాసమునకును క్రీడకును రాసయందురు. ఈ లీలల సేవగించుకొనువారి విషయమును, వినఁదలఁపనివారి విషయమును వేఱు. శ్రీకృష్ణునిఁ బ్రాకృతునిఁగ భావించి ఆతని క్రీడలు ప్రాకృతములని భావించినవారికి ప్రకృతిప్రాప్తియే కలుగును. శ్రీకృష్ణు నప్రాకృతములుగ భావించి, లీల లప్రాకృతములని భావించి శ్రద్ధతో నాతని లీలలను మననముచేసినచో నట్టివారికి ప్రకృతిఁబరముగు నప్రాకృత దివ్యగోలోకప్రాప్తి కలుగును. అచ్చట భగవానుఁడు నిత్యరాస యొనర్చుచుండును. అది రాసకు సంబంధించిన లోకమే, అట్టి రసమయమూర్తి భూమిపై నవతరించి రసమయములగు నా దివ్యలీలల నొనర్పకుండినచో బ్రపంచమున సరసతాలోపము కలుగును. కవి యే విషయమును గూర్చి రచించును ? గాయకుఁడేమి గాన మొనర్చును ? లేఖకుఁడేమి లిఖించును ? ప్రపంచ మేచరిత్రలను బాడుకొని

రసనిమగ్నము కాఁగలదు ? నేఁడు భగవానుని వంశీనినాద గీతములను బాడుకొని గాయకులును, చదివి పాఠకులును, మూర్ఖాతిమూర్ఖులు పాడుకొనియు నొకానొక దివ్యానంద మును, అనుభూతినిఁ జెందుచున్నారు కావున లోక కల్యా ణార్థమే భగవానుఁ డీ లీలల నొనర్చినాఁడు. వీనివలన మనము నేర్చుకొనవలసిన దిదియె. ప్రబల ప్రేమతోఁ బ్రభు వును బొందుటకు ప్రయత్నమొనర్పవలయును. అన్నిటిని ఆతని ప్రసన్నతకొఱకే చేయవలయును. ఒకానొక దినమున నాతఁడు స్వయముగ వేణువునూది పిలుచును. రాససుఖమున మనలను నిమగ్నుల నొనర్చును.

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! నేను తెలిసికొనిన దింతయే. కాని భగవల్లీలల కిదియే ప్రయోజనము కాదు; వానినిగూర్చి శాస్త్ర మెంతగాఁ జెప్పినను జెప్పఁజాలదు.

—— // ——

# రాస దివ్యదేహముచే జరుగును

శ్లో॥ నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితా స్తస్య మాయయా।
మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్దారాన్
వ్రజౌకసః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౩౮ శ్లో.

వ. శ్రీకృష్ణుని మాయవలన మోహితులై గోపికల భర్తలు వారు తమ పార్శ్వముల నున్నట్లు తెలిసికొని కృష్ణునియం దసూయను జెందలేదు.

కలయిక సమాన శీలురయందే జరుగును; పాల నీరు చేరఁగలదు. ఇనుము చేరదు. ప్రాకృత నేత్రములు ప్రాకృత పదార్థములనే చూడఁగలదు. దివ్యవస్తువును జూచుటకు దివ్యదృష్టియే యుండవలయును. ప్రకృతి కలిసిననే మనస్సు కలియును. రెండు ప్రకృతులును గలిసిననే మనస్సు కలియును. ఇద్దరియొక్క శీలస్వభావము లొక్కటిగా నుండి నప్పుడే రసమభివృద్ధినిఁ జెందును. శ్రీకృష్ణుడు జగన్మోహినీ మాయ కావలివాఁడు. కావున నాతని నీ మాయిక పదార్థములు మోహింపఁజేయఁజాలవు. ఆతనికివి అంటవు. ఆతఁడు నిర్లిప్తుఁడు. దివ్యాతిదివ్యుఁడు. కావున నాతని మోహింపఁజేయుటకు దివ్యాతిదివ్య మాయ కావలయును. మోహనుని మోహింపఁజేయుమాయయును మోహన కావలయును. భగవానుని శ్రీ విగ్రహము ప్రకృతికిఁ బర మైనది. దానికి బ్రాకృతశరీరమువలె స్థూలసూక్ష్మ కారణ శరీరముల భేదముండదు. అది చిన్మయమైనది. ఆతనితో రాసక్రీడ ప్రాకృత శరీరములతో నెట్లు జరుగఁగలదు? ఆతఁ డెట్టివాఁడో రాస యొనర్చువారును నట్టివారై యుండవల యును. అప్పుడే లీల సాంగోపాంగముగ జరుగఁగలదు.

అప్పుడు దానిలో సరసతా సంచారముకలుగును. అందువలన రాస ప్రాకృత శరీరములతోఁ జేయఁబడునది కాదు. చేయుట అట్లుంచుఁడు. ప్రాకృత దేహాభిమానము కలవాఁడు రాస వర్ణన మొఁనర్చుట కధికారి కాఁడు.'

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! ఈ విధముగ మా గురుదేవుఁడు పరీక్షిన్మహారాజునకు రాస సంబంధమైన సందేహములకు సమాధానమొసంగెను.'

అంత శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! పరీక్షిత్తుని శంకలలో నొకటి యింకను నట్లే యున్నది. ఆ విషయమున నీవే మియును జెప్పనే చెప్పలేదు. ఆతని శంకయిది:- 'గోపకులు తమ భార్యలింటిలో రాత్రి కనఁబడక పోయినప్పుడు వారు వారిని వెదుకుటకు వనములకేలపో లేదు?' పుణ్యము కానిండు పాపము కానిండు వారెంతటి ఏ కాంతమున రహస్యముగఁ జేసినను నది దాగఁబోదు. రాసవిషయము రహస్యముకాదు. ఒకరిద్దరు గోపికలైనచో దాగిన దాగవచ్చును. ప్రతి యింటి నుండియును గోపికలు పోయిరి. తమ తల్లి, తండ్రి, సోదరులు, బంధువులు మొదలగువారి యెదుటనే పోయిరి. రాత్రి యంత యును గ్రీడించిరి. గోపకులు కృష్ణునియొక్క యీ యనుచిత కార్యము నేల నిరోధింపలేదు? ఆతని నేలనిందింపలేదు? వారిని జాతి బహిష్కారమేల కావింపలేదు?'

ఇది విని సూతుఁడిట్లనెను:- స్వామీ! భగవానుఁడు నిందించుట కవకాశ మొసంగిన కదా గోపకులు దూషించుట. కృష్ణుఁడు చాల యుక్తిపరుఁడు. దొంగతన మొనర్ప నేర్చిన వాఁడు తప్పించుకొనుటయును దెలిసికొని యుండును. కృష్ణుఁడు బయటకుఁ గనఁబడు నీ శరీరములతో రాస యొనర్ప లేదు. ఆతఁడు గోపికలయొక్క దివ్యచిన్మయ అప్రాకృత శరీరములతోఁ గ్రీడించెను. వారి బాహ్యశరీరము వారి యింటివారికడనే యున్నది. భర్తలకు తమ భార్యల శరీరము తమ దగ్గఱనే యుండెను. అన్నలు తమ చెల్లెండ్రు తమ వద్దనే యున్నట్లు తెలిసికొనిరి తండ్రులు తమ కూఁతుండ్రు అన్నపుపళ్ళెరములను గడిగి శ్రమచే సుఖముగ నిద్రించుచున్నారనుకొనిరి. అట్టియెడ వనముల కేల వెదుకఁబోయెదరు? వృథాగా శ్రీకృష్ణు నేల శంకించెదరు?'

శౌనకుఁ డిట్లడిగెను:-'సూతా! అచ్చటి ప్రసంగమును బట్టి నీ మాటలల్లుచున్నావు. అచ్చట వేణుగానమును వినఁగానే గోపికలు రాసకు బోవు ప్రసంగము వచ్చినపుడు నీ వెంతో విస్తారముగ వర్ణించితివి. ఒకతె పాలుపితుకుచును, ఇంకొకతె బిడ్డను పాలిచ్చుచును, మఱియొకతె అన్నమును వండుచును, అన్యగోపిక కంటికిఁ గాటుకను బెట్టుకొనుచును బరువిడిపోయిరనియు, ఎట్లున్నవారట్లే పోయిరని చెప్పితివి, పతి, పితా, బంధు, బాంధవు లెంతగా నడ్డగించినను నాగ

లేదనియు, వారి నవహేలనము కావించి, తిరస్కరించిపోయి
రనియు, ఏలననఁగా గోవిందుఁడు వారి చిత్తములను దన
వైపునకు గట్టిగా నాకర్షించెననియుఁ జెప్పితివి. కొందఱు
గోపికలింటనే యుండిరంటివి. వారినిఁ దమవారు లోపల
నుంచి తలుపులు తాళములు వేసిరనియు, వారు శ్రీకృష్ణ
భావితలై, తన్మయలై ఆతనిగూర్చి ధ్యానము చేయు
చుండిరనియు, అచ్చటనుండియే వారు శ్రీకృష్ణుని మానసిక
సంస్పర్శ కావించి త్రిగుణమయ శరీరమును వీడిరనియుఁ
జెప్పితివి.

ఈ వర్ణనమునుబట్టి గోపికలు స్థూలశరీరముతోఁ
బోయిరని తోఁచుచున్నది, తమ దివ్యశరీరములతోడనే
పోయినచో వారిని వారి బంధుబాంధవు లడ్డగించిరనుట
యెట్లు పొసఁగును? వారడ్డగించగా వా రాగకపోయిన
వారికి దివ్యశరీరములతోఁ బోవు టెచ్చటిది? ఇంటిలోనుండిన
శరీర మొకటియు, రాసక్రీడనొనర్చు శరీర మొకటియు ననినచో
వారికి శరీరత్యాగ మొనర్చు అవసర మేమున్నది? దివ్యశరీర
ముచే రాస రచించెననినఁ దమ్ము నాపఁగాఁ దమ త్రిగుణ
మయ శరీరమును వదలుట యెట్లు జరుగఁగలదు? దీనినిబట్టి
సిద్ధమగుచున్న దేమనఁగా వార లీ శరీరముతోడనే వారి
ముందు పోయి రాసను రచించిరి. పోఁజాలనివారు కొట్టు
కొట్టుకొని చచ్చిరి. ఇట్టి సంఘటనము లిప్పటికిని గనఁబడు

చున్నవి. తమ ప్రియుని విరహమును భరింపఁజాలక యిప్ప
టికిని గొందఱు శరీరమును వదలెడువారు కలరు. అట్టియెడ
నీవు రెండుశరీరములను గల్పించు టెందులకు ?'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! గోపికల శరీరమును
ప్రాకృతమును త్రిగుణమయమైనదియును గాదు. వారిపైన
నీ త్రిగుణాత్మక చర్మ మేర్పడినది. వారివియును శ్రీకృష్ణునకు
వలెనే అప్రాకృత దివ్య చిన్మయ దేహములు. కాని భగవం
తునియొక్క మాయచే వారి దివ్యరూపమును మఱచిరి
భగవానునియొక్క మోహినీవంశీ నినాదమును వినఁగానే
వారి రోమ రోమములనుండియును గలియవలయునను
నుత్కంఠ తీవ్రముగ జనించెను. వారి హృదయములందు
ప్రేమతరంగములు కొట్టుకొనుచుండెను. వారు తమ ఆవేశ
మును నాపుకొనఁజాలకపోయిరి. వర్షకాలమునందు నిండిన
నదులు ప్రవాహవేగమునఁ దమనాథుఁడగు సముద్రునిఁ గలి
యుటకుఁ బరువిడునట్లు, అప్పుడు వాని నాపినను నాగనట్లు
వీరును ప్రేమావేగమున నీ త్రిగుణమయ స్థూలశరీరము
తోడనే పోయిరి. కాని శ్రీకృష్ణుఁడు దివ్యచిన్మయ దేహుఁడు.
అట్టివాఁడు గుణమయశరీరముతో నెట్లు క్రీడింపఁగలఁడు ?
అట్లే సర్పము కుబుసమును వదలిన మరల దివ్యదేహముతో
నెట్లు వచ్చునో, అట్లే గోపికలును, శ్రీకృష్ణుని దర్శనము
చేయుఁగనే ఆతని యిచ్ఛచే దివ్యులైరి. వారియొక్క ఆ

త్రిగుణాత్మక దేహములను శ్రీకృష్ణుఁడు తన యోగమాయా ప్రభావముచే వారివారి యిండ్లకు బంపివైచెను. వెడలునపుడందఱును జూచిరి: కాని యెప్పుడు తిరిగివచ్చినదియును నెవరును దెలిసికొనఁజాలకపోయిరి. అందఱును భగవన్మాయా మోహితులైరి. ఆ శరీరములన్నియును గుబుసములవంటివని తెలిసికొనఁజాలకపోయిరి. వారు పోయినసంగతియును మఱచి తమ పత్నీ, పుత్రి, సోదరీ యనుచు వ్యవహార మొనర్చిరి.

శరీరమును వదలినవారు తీవ్ర విరహముచే శరీరమును వదలిరి. వారి ప్రేమ అత్యుత్కటముగ నుండెను. రాసలో వారును బాల్గొనిరి. వారి దేహములును జిన్మయములయ్యెను ఇంతకు భేదమేమనఁగా వారు తమ త్రిగుణాత్మక శరీరములను శాశ్వతముగ వదలివైచిరి. అచ్చటికిఁ బోయిన గోపికలు కోరిక లేకున్నను భగవదాజ్ఞచేఁ దమశరీరములలోనికి వచ్చిరి. ఇండ్లలో శరీరమును వదలినవారికి గొప్పలాభము కలిగెను. వారు శరీరమును వదలఁగానే వెంటనే శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చిరి. మిగిలినవారందఱును గాలితోఁ బరువిడి కొంచెమాలస్యముగ వచ్చిరి. ఈ విధముగ గోపికా కృష్ణుల యొక్క రాసలీల ప్రాకృతముకాదు. దివ్యమైనది. దానిలో శ్రీకృష్ణుని నిందించు నవసరమే లేదు. ఏశాస్త్రము శ్రీకృష్ణుఁడు గోపికలతో రాస మొనర్చినాఁడని చెప్పినదో, ఆ శాస్త్రమే నెత్తిన నోరుబెట్టుకొని ఢంకామీఁద దెబ్బగొట్టుచు భగవా

నుఁడు ప్రాకృతుఁడుకాఁడు, చిన్మయుఁడు, దివ్యుఁడు, అస్ఖలిత వీర్యుఁడు. అచ్యుతుఁడు, ప్రాకృతగుణములకుఁ బరుఁడని చెప్పినవి. ఈ విషయములనన్నిటినిఁ దెలిసికొనక కేవలము రాసవిషయమున దోషము నాపాదించుట వ్యర్థముగ ఛిద్రాన్వేషణము కావించుటయే కాఁగలదు. జల్లెడ స్వభావము మంచిమంచి బియ్యమును వదలుటయును, రాళ్లు, గడ్డలు. వడ్లు. గడ్డ, తాలును బట్టుకొనుటయే. వీరును జల్లెడవంటి వారే. కావున మహాభాగులారా! శంకకు అవకాశము లేనే లేదు. హఠము కలవారికిని, నిందకులకును, శుష్కాలోచనము చేయువారికిని మన మెన్ని యుక్తులతోఁ జెప్పినను వారి హఠమును వారు మానరు కాని భగవద్భక్తులు శ్రీకృష్ణుని భగవంతునిగ భావించెదరు, అట్టివారికి భగవానుని యేలీల విషయములోను సందేహము కలుగదు. ఈ విధముగ నేనత్యంత సంక్షేపముగ మా గురుదేవుని ముఖమునుండి వినిన విషయము నాధార మొనర్చుకొని రాససంబంధమునఁ బరీక్షిన్మహారాజడిగిన నాలు శంకలకును సమాధానమును జెప్పితిని. ఇప్పుడు సంక్షేపముగ నా సమాధానములను వినుఁడు.

1. భగవానుఁడధర్మ మొనర్ప లేదు, జీవధర్మమునకును భగవద్ధర్మమునకును నంతరము కలదు, జీవుఁడు మాయాబద్ధుఁడు. భగవానుఁడు ప్రేమచే బంధింపబడును.

ఆతని కార్యము లన్నియును ప్రేమ నభివృద్ధి యొనర్చుటకే జరుగును.

2. భగవానున కన్యుఁ డెవఁడును లేఁడు. అందఱు నాతనివారే. ఆతఁడును మనస్సుతో నేమి తలఁచునో, నోటితోఁ దానిని జెప్పును. అట్లే చేయును, ఆతని సంకల్పము సృష్టి. ఆతని మాటలు శాస్త్రము. కర్మలీల. ఇవన్నియు నప్రాకృతములే.

3. భగవానుఁడు మనకు నేర్పుటకు లీలలు నొనర్పఁడు. లీలాధారి యగుటచే లీలలొనర్చుట ఆతని స్వభావము. తమ తమ ప్రకృతి ననుసరించి ఆతని లీలలవలన నట్టి శిక్షణనైనను గ్రహింపవచ్చును. ఆతని లీల లన్నియును ప్రేమకొఱకే యుండును.

4. భగవంతుఁడు కర్మాధీనుఁడై శరీరమును ధరింపఁడు. కావున నాతని కెవిధమగు కర్మసంబంధ ముండదు. ఆతనికి బుణ్యపాపములు లేనే లేవు.

5. భగవంతుఁడు రసస్వరూపుఁడు. కావున రసయుక్తమగు లీల నొనర్చుటయే ఆతని స్వభావము. కలకండ తీపినే యొసంగును.

6. ఆతని కధీనులు కానివారే ఆతనికి విరుద్ధముగ నుందురు. అందఱను నాతఁడే ఆడించుచున్నాఁడు. ఎవరి కెప్పటికే బుద్ధి నీయవలెనో దాని నాతఁడే యొసంగును.

ఆతఁడు మాయకధీశ్వరుఁడు. అందఱకును నియామకుఁడు. అట్టి యెడ నాతనికి విరుద్ధముగ నెవఁడుండఁగలఁడు.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! మీ కత్యంత సంక్షేపముగ నేను రాసకు సంబంధించిన శంకలకు సమాధాన మొసంగితిని. వీనినిఁ బరీక్షిన్మహారాజు శంకింపఁగా శ్రీశుకదేవులు సమాధాన మొసంగినాఁడు. వానిని నేను మీ యెదుట యథామతిగఁ జెప్పితిని. మీ రిప్పుడేమి వినఁగోరుచున్నారు?'

శౌనకుఁ డిట్లడిగెను:- 'సూతా! మా శంకలకును సమాధానము వచ్చినది. సర్వేశ్వరుఁడు సర్వసమర్థుఁడు. ప్రేమయే ఆహారముగఁ గల శ్రీకృష్ణునిగూర్చి శంకించుట శంకలకును గళంక మాపాదించుటే కాఁగలదు. స్థలక్రీడ, నికుంజలీల, జలకేళి, వనవిహారము ఇవి అయిన తరువాత నేమి జరిగినదో మాకు జెప్పుము.'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! ఇంక జెప్పవలసిన దేమియును లేదు. లౌకికదృష్టిచే రాసలీల అయిపోయినది వాస్తవికదృష్టిచే రాస పూర్తి కానేకాదు. అది అవ్యాహతగతితో నిరంతరము జరుగుచునేయుండును.'

—॥—

# రాసలీలా ప్రసంగ సమాప్తి

(౧౦౦౬)

శ్లో॥ బ్రహ్మరాత్ర ఉపావృత్తే వాసుదేవానుమోదితాః ।
అనిచ్ఛన్త్యో యయుర్గోప్యః స్వగృహాన్భగవత్ప్రియాః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౩ అ. ౩౯ శ్లో.

వ. 'బ్రాహ్మ్య ముహూర్తంబునఁ గృష్ణు వీడ్కొని గోపిక లిచ్ఛ లేకయు నిండ్లకడ కేగినం గృష్ణమాయామోహితులై గోపకులు వారలం గోపింప నేరరైరి.'

శ్రీమదాంధ్ర భాగవతము.

వృక్షముల కాపు రాలుటకే యుద్భవించును. జీవులు పుట్టునది చచ్చుటకే. సంయోగము వియోగము కొఱకే. సృష్టి సంహారముకొఱకు జరుగును. ఆరంభ మంతముకొఱకు జరుగును. ప్రపంచమున నేది ఆదియో అది తప్పక అంతమై తీరును. కావుననే భగవంతుని అనాది, అనంతుఁడనిరి. ఆతనికి ఆద్యంతములు లేవు. ఆతఁ డెట్లనాది, అనంతుఁడో అదే విధముగా నాతని లీలలును అనాదులు, అనంతములు. వాని కెన్నటికిని సమాప్తిలేదు. అవి నిరంతము జరుగుచుండును. ప్రతిక్షణము వానియందు రసబుద్ధి కలుగును. నూతనత వచ్చి పోవుచుండును. అయినను లీలా ప్రసంగము నిలుపుటకై

సంయోగ వియోగవర్ణనము చేయఁబడుచుండును. ప్రసంగ మారంభమైనది కావున దానికి పరిసమాప్తియును గనఁబడ వలయును. ఇది పరిసమాప్తినిఁ జెందు లీలకాదు ప్రాకృత ప్రసంగమని తెలిసికొనవలయును. అదియును సంగతిని నిలుపుటకై. రాస రూపమగు రసాయనము నిరంతరము సేవింపఁ దగిన వస్తువు. దీనిని సేవించినచో లోపలదాగి యుండిన రోగమును మొట్టమొదట అవి నశించిపోవును. మరల నిరోగతయును స్వస్థతయును ప్రాప్తించును. స్వస్థులు కాఁగానే పరమసుఖదాయినియగు దట్టమైన కమ్మని నిద్రవచ్చును. ఈ దివ్యనిద్రాప్రభావమువలన రోగములు వచ్చుసంగతి అటుంచుఁడు. మృత్యువును వారినిగాంచి పాఱిపోవును. రాస ఒక్కదినమున వినునట్టి వస్తువుకాదు. అది శ్వాస ప్రశ్వాస వలె నిరంతరము సేవింపఁదగిన వస్తువు.

సూతుఁడిట్లనెను:- 'మునులారా! రాస ప్రసంగమును ఇంకనధికముగ వర్ణించుటకు నాకు సామర్థ్యము లేదు. ఈ విషయము చెప్పఁదగినదికాదు. ఇది అనుభవింపఁదగిన వస్తువు. ప్రియుని సమ్మేళనములో నెంతటి సుఖమున్నదో దానినే శబ్దములతో వ్యక్తపరుపఁగలము? ఇది అనుభవగమ్యమగు విషయము. గోపికలు శ్యామసుందరుని సుఖద సంస్పర్శను బొంది, యెంతగాఁ ప్రముదితులైరో, ఇది అవర్ణనీయ విషయము, ఏ భాగ్యశాలురు రాసలీలాదర్శనమును గావించిరో

వారు కృతార్థులైరి. పాషాణములు కరిగిపోయినవి. వృక్షము లకు రోమాంచము కలుగును. దేవాంగనలు సరసత్వమున నిమగ్నలై, వారు తమ కేశములయొక్కయు వస్త్రముల యొక్కయు, చివరకు శరీరములయొక్క స్పృహాయును లేకుం డెను. చంద్రుండు పోవుచుఁబోవుచు నాగిపోయెను. ఆతని గతి రుద్ధమైపోయెను. ఆతఁడు ముందునకుఁ గదలజాలక పోయెను. ఆఱునెలలు ఒక రాత్రిగ నయ్యెను. శ్రీకృష్ణుఁడు అపార సరసతావృష్టినిఁ గురిపించెను. రాసస్థలియందలి రస ప్రవాహము ప్రవహించెను. దానిలో వ్రజాంగనలందఱును నిమగ్నలైరి. వారెచ్చట నుండిరో వారికి తెలియదు. వారికి వారి యిండ్లువాకిండ్లు గుర్తులేవు.

వారికి తృప్తి కాఁగానే ఆతఁడు సరసతా ప్రవాహ మును నుపసంహరించెను. అట్టి ప్రేమలో నెన్నటికినిఁ దృప్తి కలుగదు ఇఁకఁ జాలుననునది ప్రేమలో లేదు. ఇంక నెంత యధికము దొరకునో అంత మంచిది. ఇదే ప్రేమమార్గమునకు మూలమంత్రము అయినను ప్రసంగ సమాప్తి చేయవల యును గదా!

రాస చేయుచుఁ జేయుచు నరుణోదయమువలె కాంతి కనఁబడును. శ్యాముఁ డదరిపడి యిట్లనెను:- 'అయిపోయి నదా? ఇప్పు డరుణోదయము కానున్నది. ప్రాచీదిశాముఖ

మున భువనభాస్కరుఁడు శంఖమవలె గోచరించుచున్నాఁడు. దాని రక్తాంచలమునుండి ఆతఁడు బయటఁ బడఁజూచు చున్నాఁడు ఇప్పుడు మీరు అందఱును వెళ్లుఁడు.'

అధీరులై గోపికలిట్లనిరి:- 'శ్యామసుందరా? ఎచ్చటికి పోఁగలము? 'మీ మీ గృహములకు బొండు' అని నిష్ఠుఁడగు శ్యామసుందరుఁడు ఒక్క శ్యాసలోఁ జెప్పివైచెను.'

'మాయిల్లెచ్చటనున్నది? మేము గృహమును విడిచి వైచితిమి. మేము వనమాలి కంఠమున మా బాహుహార మును వైచితిమి. మేమాతని వరించితిమి. మేము వన మాలితో నిరంతరమును వనములోనే నివసించెదము.' అని గోపికలనిరి.

శ్యామ సుందరుఁడు భయముప్రను బెట్టి యిట్లనెను:- 'కాదు, కాదు. ఈ విషయము ఉచితముకాదు. కులవతులగు కామినులు వనమున నివసింపరాదు. మీరు మీ మీ గృహ ములకుఁ బొండు.'

గోపికలిట్లనిరి:- 'మా గృహములు నీ శ్రీచరణములే. మీ శ్రీచరణము లెచ్చట నుండునో అచ్చటనే మా భవ్య భవనము లుండును. నీ వెచ్చట లేవో అచ్చటనే దట్టమైన అరణ్యము.'

శ్రీకృష్ణుం డిట్లనెను:- 'ఇప్పుడు సూర్యోదయము కాఁబోవుచున్నది. ఎవరైనఁ జూచిన నేమనెదరు ? ఇండ్లకుఁ బొండు, ఇండ్లకుఁ బొండు.'

గోపికలు కోపముతో నిట్లనిరి:- 'పొండు పొండని ఊరక వల్లించుచున్నావు, పోయి మేమేమి చేయుదుము. మేము జీవములనెట్లు నిలుపు కొనఁగలము.'

శ్యామసుందరుఁ డిట్లనెను:- 'మధుమధుర స్మృతిలో సుఖమున్నట్లు సంయోగమున సుఖములేదు. సుందర వనోపవనములను ఉద్యానవనములను, పుణ్యప్రదేశములను జూచునప్పుడే సుఖము కలుగునో, దానికంటె నధిక సుఖము తరువాత దానిని స్మరించినపుడు కలుగును. ఏదైన రుచిగల మిఠాయిని దినుము. దానినిఁ దినునపుడల్పకాలిక సుఖము కలుగునుగాని తర్వాత దానిని జ్ఞాపకము చేసికొనిన నోట నీరూరును. తన కెవరైనఁ బ్రియులుండిన, సహృదయులుండిన, అత్యంతప్రేమించువారుండినఁ బరస్పరము కలియుట చేతనే ఒకరొకరు ఆలింగనము చేసికొందురు. అప్పుడు ప్రేమాలింగనముననే సుఖము కలుగునో అది క్షణికసుఖము. తర్వాత నెప్పుడైన నాతని ప్రేమాలింగనము జ్ఞప్తికి వచ్చెనా శరీరము రోమాంచితమగును. హృదయమందు ఒకానొక మధురాతి మధుర చక్కిలిగింత కలుగును. స్మృతిసుఖము శాశ్వతముగ

నుండును. దీనికి బాహ్యావస్తువు అవసరముండదు. నాకును మీకును నే సుఖము లభింపవలయునో దీని మధురస్మృతి శాశ్వతమైన నిధి. మీరీ సరస ప్రసంగస్మరణముచేత నే కాల క్షేప మొనర్పవలయును. మరల మనము రాత్రి కలుసు కొందము. ఎప్పుడు సంయోగము కలుగునో, సమ్మేళనము కలుగునో అప్పుడు సమ్మేళన సుఖము. దేహమునుండి దూర మైనపుడు సమ్మేళన స్మృతిసుఖము. ప్రేమమార్గములో సుఖమే. అచ్చటి అశ్రువులును మధురములే. ప్రేమాశ్రు వులు శీతలముగ నుండును. పొండు. ఆలస్యము చేయవలసిన పని లేదు.'

గోపికలు మనస్సులో నిట్లాలోచించుకొనిరి:- 'పురుష హృదయమెంత కఠోరమగును! మేము సమీపమున నుండఁ గోరుచున్నాము. కృష్ణుఁడు మమ్ముఁ బంపింపఁ దలఁచు చున్నాఁడు. మేము దగ్గఱకువచ్చి ఆనుకొని యుండఁగోరు చున్నాము. శ్యాముఁడు మమ్ము దూరముగావించి నెట్టి వేయుచున్నాఁడు. ఏమి చేయుదుము? మే మబలలము. ఈతఁడెట్లు చెప్పిన నట్లు చేయవలసి యుండును.'

ఇట్లాలోచించుకొని యిచ్ఛలేకున్నను వారు బ్రహ్మ ముహూర్త సమయమున భగవదాజ్ఞను బొంది వారివారి యిండ్లకు వెడలిపోయిరి.

సూతుఁ డిట్లనెను:- 'మునులారా! భగవానుని యొక్క యీ రాసలీలా పరమ ప్రసంగము సమాప్తమైనది. ఎవరు దీనిని శ్రద్ధతో వినెదరో వారి హృదయములోఁ గామ రూప మగు రోగము నశించిపోవును. వారు స్వస్థులగుదురు.'

శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! కామమును నీవు హృదయ రోగమని యేలఁ జెప్పుచున్నావు?'

సూతుఁ డిట్లనెను:- 'స్వామీ! రోగములో నేమి యుండును? త్రిదోషములు కుపితములగును. ఇంద్రియములు శిథిలములగును. సంగ్రహణీ రోగము కలిగినవారికి వాని నాలుక వాని స్వాధీనములో నుండదు. దేనినిఁ జూచిన దానినిఁ దినఁబుద్ధి కలుగును. వైద్యుఁడు తినవలదనును. ఫలాని వస్తువును దినినచో రోగ మధికమగును. కాని ఆ వస్తువు సమ్ముఖమునకు వచ్చిన అతఁడు దాని నాపుట కసమర్థుఁ డగును. దీని నొక్కసారి దీని రుచిచూచి వదలుదమను కొనును. కాని అది ఒక్కసారితో నెప్పటికిని సమాప్తము కాదు. ఒక్కసారి రసమును గ్రహించిన మరలఁ గోరిక కలుగును. మరల ఆ పథ్య మొనర్చును. మరల దుఃఖి యగును. ఇదేవిధముగ సమస్తరోగముల స్థితియును, మానవుఁడు సదా పథ్యముతో నుండవలయును. కుపథ్యమును జేయకుండిన రోగము రానేరాదు. శారీరక రోగము పూర్వ

జన్మకృత పాపపరిణామస్వరూపమున సాధారణముగ నవి కుపథ్యము చేయవచ్చును. అధిక కుపథ్యమొనర్చినచో వృద్ధి యగును. వాత, పిత్త, శ్లేష్మములచే శారీరక రోగములు వచ్చినట్లు హృద్రోగము కామము, ఈ కామభావము హృదయములో స్వాభావికమగును. సంయమము చేతను, సదాచారము చేతను, సాత్త్వికత చేతను నీ రోగమణఁగి యుండును. అనుకూల దేశ, కాల, పరిస్థితి, కలిగినప్పుడిది బయటపడును. దీని వేగము ప్రబలమైనపుడు వివేకమంత యును నశించును. మానవుని సమస్త ప్రతిజ్ఞలును మట్టిలోఁ గలిసిపోవును. ప్రాణి కామమున కధీనుఁడై చేయరాని పనులు చేయుట కారంభించును. దీనికి సర్వసుగమమగు నౌషధి ఒక్కటే. అది మనస్సును భగవంతుని రాసలీలా చింతనమున నుంచుటయే. దీనిలో గోపికలయొక్క దివ్యలీల నెలకొనును. అప్పుడీ మాంసాస్థిరక్తములతోడను, దుర్గంధ పదార్థములతోడను జేయఁబడిన నీ శరీరముపై నేవగింపు కలుగును. దానికదియే. మనస్సీదిక్కునుండి తొలగిపోవును. ఎవని హృదయములోఁ గామవాసన ప్రబలముగ నుండునో, వారికి శ్రీకృష్ణ లీలలు బాగుండవు. చేదుగనుండును. పిత్త రోగికి కలకండ చేదుగనుండునో అట్లే యీ లీలలు చేదుగ నుండును. దాని కౌషధమును నిదియే. నిరంతరము సితో పలాది చూర్ణమును, కలకండతోఁ జేయఁబడిన నిట్టి యౌష

ధములను సేవింపవలయును. నిత్యమును కలకండను దినుటచేఁ చిత్త వికారము తొలఁగి పోఁగలదు. ఇదేవిధముగ నెవని మనస్సులోఁ గామరోగముత్పన్నమైనదో వారు కోరికాని కోరకగాని యేవిధముగనైనను రాసలీలను చింతన మనన మొనర్పవలయును. చింతన చేయఁగా దానిమీఁద నాసక్తి కల్గి ప్రేమ యుత్పన్నమగును. హృదయరోగము దూర మగును. మునులారా! దివ్యకామముచేఁ బ్రాకృత కామము నశించును. ఇదియే రాసలీల శ్రవణ మొనర్చిన గొప్ప మహిమ. నేను మీకు రాసలీలా ప్రసంగమును జెప్పితిని. ఇంక నిప్పుడేమి వినఁదలఁచుచున్నారు?'

శౌనకుఁ డిట్లనెను:- 'సూతా! నీకు చిరాయువు కలుగుఁగాక! నీవు చాలకాలమువఱకు జీవించెదవుగాక! మహాభాగా! నీవు చాల రసవత్తమమగు రాసలీలను జెప్పితివి. ఇప్పుడు భగవానుఁడు తరువాత నే యేలీలల నొనర్చెనో మాకు చెప్పుము. ఏలననఁగా సాంసారిక కథలను వినుటచే నాయువు వ్యర్థముగ నశించును శ్రీకృష్ణకథ మాత్రమే వినఁదగినది. ఏ దినమున శ్రీకృష్ణకథను వినలేదో ఆదినము అభాగ్యమైనదని తెలిసికొనవలెను. నేఁడు మాకాలము వ్యర్థముగ గడచినది. రాసలీలాప్రసంగమున మాకు తృప్తి కలుగలేదు. అయినను మాకిప్పుడు తర్వాత లీలలను జెప్ప

వలయును. ఏలననఁగా నీవు రాసలీలోపసంహారమును జేసితివి.'



సూతుఁ డిట్లనెను:- 'మునులారా! ఇప్పుడు మీరు శ్రీకృష్ణుని అన్యలలిత లీలలను శ్రద్ధతో శ్రవణ మొనర్పుఁడు.'